# వీరేశలింగం - వెలుగు నీడలు

## అనుబంధం - 1

# వీరేశలింగం - వాస్తవాలు



వివిధ వ్యాసాల సంకలనం



వేమన వికాస కేంద్రం

మొగల్రాజపురం, విజయవాడ-10

# విషయసూచిక

## ముఖ్యమైన తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 10 | 22 | అతొలి | అదితొలి |
| 11 | 28 | దీలేదు. | ఏదీలేదు |
| 28 | 19 | ఒప్పేసుకొనే ప్రవర్త నన్నారని | ఒప్పేసుకొన్నారని |
| 29 | 20 | అట్టిపాశ్చాత్యుల ఆవారం | అట్టి ప్రవర్తన పాశ్చాత్యుల ఆవారం |
| 34 | 18 | వెలసి | వెరసి |
| 36 | 13 | చివరిస్థాయిగా | చిరస్థాయిగా |
| 38 | 16 | ఆదునిగా | ఆద్యునిగా |
| 39 | 16 | స్వాయంభుమనవు | స్వాయంభువమనువు |
| 68 | 8 | వర్షపు వరదలలో | వరపు వరదలలో |
| 72 | 20 | జీర్ణించుకొరన | జీర్ణించుకొన్నారన్న |
| 75 | 28 | తీరుఇది. ఆయన రాలేదు | రాలేదు· ఆయన తీరుఇది |
| 75 | 30 | సంపాదనాప సత్యా నృతంగా పర్వాన్ని | సంపాదనా పర్వాన్ని సత్యానృతంగా |
| 76 | 8 | వ్యాసంవిన్నా | వ్యాసంవినా |
| 77 | 30 | దయానందులువారి తొడిపొత్తు | దయానందులు వారితోపొత్తు |

# మా మాట

లియోనార్డు వీరేశలింగ థీసిసును విమర్శించలేక పదిహేనేళ్ళ కిమిన్నాస్తిగా వుండిపోయిన పాతడిండిమ భట్టును రెక్కపట్టి పైకిలేపి విశాలాంధ్ర వారు దిగవల్లివారికి ఎదురుగా బరిమీద నిలపదలంచడము, అందుకాయన తలపడడము రెండూ రెండు వైపరీత్యాలు. నలభయ్యేళ్ళగా వీరేశలింగం వీరకొలుపు లారంభించిన విశాలాంధ్రీయ మేధానిధులు సొంతంగా సమర్థించుకోలేనంత డీలా దివాలావాలాలుగా తేలిపోయారు. అందుకింకొకరి కలాన్ని అద్దెకు తెచ్చుకున్నారు.

అదీ ఎవరినంటే ఒక అబ్స్కురాంటిస్టుని, ఒక సిద్ధాంత నిర్దేశంలేని వారిని, శ్రీమన్నారాయణ కవచపారాయణ ప్రవణుణ్ణి, వీరేశలింగ హేతుబుద్ధికి విరుద్ధదృష్టి ప్రకృష్టుణ్ణి, ఎవరికేది కావలయునో అదే వ్రాయడానికున్నా నన్నట్టున్న వారిని—

ఎందుకు తెచ్చుకొన్నట్టు అంటే, ఎదిరిపక్షాన్ని అంగీకరించుతూనే గీకరించుతూ ఘూకరించుతూ అంగీకరించకపోయినట్టుగా ఎదుర్కొంటున్నట్టుగా ఆక్రోశ ఉత్క్రోశ కోశము కాగలండు కాబట్టి. అంతకంటే వారి వీరి పరిస్థితి వేరుగామాత్రం లేదను కొంటాను. ఒప్పుకోళ్ళ-మొత్తుకోళ్ళ, ఏడుపు-ఎగతాళి-అదొక రాగతనంగా వుంది.

మూడుమాసాలు విశాలాంధ్రలోను, రెండుమాసాలు ఆంధ్రవారజ్యోతిలోను అనర్గళంగా ఆయన ఊదిన సబ్బుబుడగల్ని చిల్లులుపొడుస్తూ శతపధిగారివంటి విశేషజ్ఞులు, హనుమంతురావుగారివంటి వివేచకులు, పి.వి.ఆర్.కె. శర్మగారుమొదలైన పరిశీలకులు వ్రాసిపంపిన ఖండనలను తట్టుకోలేక మూలపడవేయడం దివాలాతనమే. పరాయివారివ్రాతలు వేయజాలమంటే శివరావుగారు వ్రాస్తేవేస్తారా అని నేనై అడగగా, క్లుప్తంగా పాయింట్లుగా వ్రాయించండి, అలాగేవేద్దాం అన్న రాఘవాచారిగారి మాటమీద శివరావుగారు రెండుకాలములు నిండనంత తక్కువ వ్రాసి పంపించారు. అదికూడా వేయలేకపోయారు! మధ్యలో ఒకచిన్న సీను నడిపారు. తమ ఆస్థాన పరిశోధకుని వ్రాతలను శివరావుగారు ఖండించిన భాగాలను వేయజాలము; మా ఆస్థానికుడు వదలి వేశారన్న యిరవై పాయింట్లవరకు వేద్దామని వుందన్నారు రాఘవాచారిగారు. అనగా ఆస్థానికునివిమర్శకు శివరావుగారు సమాధానించలేకపోయి, అసలు ఇక విమర్శించక వదలినఅంశాలజాబితా ఒకదాన్ని మాత్రం యిచ్చారన్నట్టు తప్పు అభిప్రాయం కలిగేట్టు ప్రచురించడమవుతుంది; అది తప్పు అన్నాను. ఆపైన మొత్తం గల్లంతు చేశారు· మాట తప్పారు.

కాని వారి తెరవెనకటి డిండిమభట్టుకు శివరావుగారి రిజిస్టరుపోస్టు ముట్టింది

గాని మూగనోమే. ఈ పత్రికలు ప్రతివిమర్శలు టపా బట్వాడాచేసి, జవాబించమని వుండాలి. దానికీ మూడునెలలుగా అతీగతీలేదు.

ఆంధ్రజ్యోతి వారపత్రికకు శతపధిగారు ఖుద్దునవెళ్ళారు- తమ ఖండన యిచ్చారు. వేస్తామన్నారు: సకలమర్యాదలుచేసి, పంపగా వేస్తారనుకొని చూచి చూచి ఏంచేశేట్టు అని నన్నడిగారు. ఇలా పుస్తకంవేసి, మూలరచన అయిన వీరేశలింగం - వెలుగునీడలుకు అనుబంధం-I గా ప్రకటిస్తున్నాము. ఈ మధ్యలో శతపధిగారు హరి సర్వోత్తమ శతజయంతి సంచికావిష్కరణ సభలో ఆవిష్కర్త రాఘవాచార్యుల వారి వేదికనుంచే సర్వోత్తముని కేసు విషయంలో పంతులుగారిపాత్రను ఆవిష్కరించి నట్టున్నారు. సమాధానయత్నమేలేదట ! పంతులుగారి కల్లచరిత్ర యిటువంటి పత్రికలు పోషించాలేగాని వేదికలమీద నిలబెట్టగలిగిన రోజులు పోయినై అనవచ్చునిక !

శివరావుగారిచేత వ్రాయించి, అచ్చుకనువుగా నాకు సాపువ్రాసి యిచ్చినవారి దగ్గరకేవెళ్ళి శివరావుగారు వ్రాస్తేవ్రాయవచ్చుగాని వెంకటేశ్వరరావు ప్రచురించడాన్నే "మా వాళ్ళంతా" అసహ్యించుకొంటున్నారనటము ఈ ప్రతివిమర్శలను ప్రచురించలేక పోవటము నిజాలను తొక్కిపెట్టే నియంతల బుద్ధే. ఆపైన వెంకటేశ్వర్రావు ప్రచురించడానికి కులమత వర్ణ భేదరహితులయ్యామనే "మా వాళ్ళంతా" తీసిన అర్ధాలు లెఖలోకి ఎక్కలేదుగాని అవి చాల సిగ్గుపడవలసినసంగతులు. వారి ఆసాన రాయసంచేత తగుమాత్రంగా తమపత్రికలో అక్షరబద్ధం చేయడం.చూపించాను. ఈ వర్గంఅల్పత్వం అంతటితో ఆగలేదు. సాయంసోమయాజుల వారిని ప్రయోగించి పనసలు చదివించి శివరావుగారిచేత మరణశాసనాలు రాబట్టుతున్నారు! ఇదీ వారి అధఃపతనం.

వీరేశలింగం - వెలుగునీడలుతో ఆగక శివరావుగారు మరొక గ్రంథం పంతులుగారి మీదకూర్చి అచ్చుకు సిద్ధం చేయమంటుండగా అవాంతరంగా యీ అనుబంధ రచన ప్రకటించవలసివచ్చింది. అంతేగాక, ఏలూరు లక్ష్మీనరసింహంగారి చరిత్రనుకూడా శివరావుగారు వ్రాయగలరని ఎగతాళి డిండిములుమోగినట్టే అదీ తయారు చేస్తున్నారు. వీరేశలింగం-ఉభయలక్ష్మీనరసింహాలు అన్నది మంచి పరిశోధన అవుతుంది.

వీరేశలింగంగారి పాండిత్యం, గ్రంథ చౌర్యాలను గూర్చి ఇప్పటికి స్పృశించి విడిచామేగాని గట్టిగా పట్టించుకోలేదు. అది ఆరంభమేగాని అంతంకాదు. వీరి ఆస్థాన పరిశోధకులు తదితరులు చేసినది సమగ్ర పరిశీలనకాదు. పంతులుగారి ఉపన్యాసాలలో చాలా ఆసక్తికరమైన విషయాలున్నవి. శివరావుగారి చూపుపడింది: కలంమోపారు అని చెప్పవలసివుంది.

—త్రిపురనేని వెంకటేశ్వరరావు

## డా॥ నమశ్శివాయగారి లేఖ

3-6-86

డా. జి. నమశ్శివాయ D. A. M. విజయవాడ

శ్రీ దిగవల్లి వేంకట శివరావు పంతులుగారికి

విశాలాంధ్ర వ్యాసాలు చదవలేదు. నిన్న ఏటుకూరి బలరామమూర్తిగారు కనిపించి చెప్పారు. ఆయనకు వేంకటేశ్వరరావుగారి మీద కోపం ప్రచురించారని శివరావుగారి దేముంది లేండి. మా వాళ్ళు చాలామంది అసహ్యించుకున్నారు వేంకటేశ్వరరావుగారిని అన్నాడు. అయిదు వ్యాసాలు వ్రాశాడుట. అయిదువారాలు వస్తవన్నాడు. పూర్తి అయింతరువాత మొత్తం పంపుతా చదవమన్నాడు. ప్రకాశచంద్ర శతపధిగారిది వ్రాసింది నాకర్థం కాలేదు. రెండవ జాబులో సమాధానం వ్రాయవలసిన విషయాలు ఏమీ లేవు.

చిత్తగించవలెను
నమశ్శివాయ
3-6-86

# విశాలాంధ్రకు శివరావుగారి లేఖ

5-10-86
హైదరాబాదు-20

శ్రీ విశాలాంధ్ర పత్రికాధిపతి రాఘవాచార్యుల వారికి,
దిగవల్లి వెంకట శివరావు నమస్కారములు.

మీరు నన్నెరుగరు. మిమ్ములనుగూర్చి నేను విన్నాను. ఇటీవల మీకు జరిగిన సన్మానమును గూర్చి పత్రికలలో చదివాను. కమ్యూనిస్టు సిద్ధాంతాలకు కట్టుబడినవారైనా నీతినిజాయితీలు కలవారని కొందరివల్ల తెలుసుకొని సంతోషించానుగాని, మీ పత్రికలో రమాపతిరావుగారి వ్యాసములకు ఉపోద్ఘాతంగా ప్రకటించిన "ఒకమాట"ను 28-9-86 తేదీన సోమసుందర్ అనే ఆయన చిలకమర్తి వారిని గూర్చి వ్రాసిన వ్యాసంలో సందర్భం కలిగించుకొని నన్నుగూర్చివ్రాసిన అసహ్యపు వ్రాతను మీరెలా హర్షించారో నాకు అర్థంకావడంలేదు.

నేను 80 సం॥రాలు నిండి చావుకు సిద్ధంగావున్నమాట నిజమేగాని పొట్టకూటికై వీరేశలింగం - వెలుగునీడలు వ్రాసినమాట సర్వాబద్ధము. భగవంతుడు నాకు అన్న వస్త్రాలకు కొరతలేకుండా చేశాడు. నాకేవిధమైన కొరతలేదు. నాకు ధనేషణగాని, కీర్తీషణగానిలేవు. అబద్ధాలాడవలసిన అగత్యం లేదు. నేను వీరేశలింగంగారిని గూర్చి ఎటువంటి అసత్యములు వ్రాయలేదు. నాకు తెలిసిన సత్యములన్నీకూడా వ్రాయలేదు. ఆయనపైన నాకు లోపల సానుభూతి కద్దు. ఈ మాటను మీరు నమ్మకపోవచ్చును గాని నమ్మనందున నాకు నష్టంలేదు.

నేను 1910 సం॥రము నుండి 1916 సం॥రము వరకూ రాజమండ్రిలో చదువుకున్నాను. పంతులుగారిని బాగా ఎరుగుదును. వారి సభలలో పాల్గొన్నాను. చిలకమర్తి వారికి నామీద చాలా దయ. బెజవాడలో కూడా మా యింటికివచ్చి భోజనం చేశారు. నేను కాౖమేడ్ వీరేశలింగం వ్రాసిన సమయంలో అభ్యుదయ రచయితలు వారి గ్రంథం ప్రకటించినప్పుడు వారు కబురంపించారు. అచ్చమాంబగారింటికి వచ్చి బసచేశారు.

నా చిన్నతనంలో నేను వీరేశలింగంగారి గ్రంథాలన్నీ అమూలాగ్రంగా చదివాను. ఇటీవల మళ్ళీ చదివాను. రమాపతిరావుగారి సమగ్ర పరిశీలన అనేది బూటకమని చెప్పగలను. ఆయన చాలా తప్పులు వ్రాశారు. ఆయన తరచు నా దగ్గరకు వచ్చి కాళ్ళకు దణ్ణంపెట్టి అతివినయం ప్రదర్శించేవారు. 1980వ స॥కంలో ఆయన వీరేశలింగంగారిని గూర్చి వ్రాసిన తప్పులను గూర్చి చెప్పి, వానిని దిద్దుకొనకపోతే మర్యాదదక్కదని స్పష్టంగా చెప్పాను. లియోనార్డు పరిశోధనా గ్రంథానికి నేను వ్రాసుకొన్న 120 పేజీల నోట్సునూ యిచ్చాను. దానిని గూర్చి విశాలాంధ్ర వారి



స్వీయచరిత్ర పునర్ముద్రణంలో చర్చించడం మంచిదని చెప్పాను. ఆయన రాజమండ్రీ వెళ్ళి దర్యాప్తుచేసి నిజం తెలుసుకొన్నారు. అప్పుడు వారు చెప్పినమాటలనిప్పుడు కాదంటున్నారు. విశాలాంధ్ర వారు నా గ్రంథానికి విమర్శ వ్రాయమన్నారు. తానందు కంగీకరించలేదని పిఠాపురములో ఎవరిచేతనో వ్రాయిస్తున్నారని నాకు చెప్పాడు. నిజం అనుకున్నాను. ఇటీవల ఆయన ప్రకటించిన వ్యాసాలు చూసి ఆశ్చర్యపడ్డాను. ఆయన చేసిన మిత్రద్రోహానికి బాధపడ్డాను. ఆయనకు శాపనార్థాలతో ఒక పెద్దలేఖ వ్రాశానుగాని వైరాగ్యభావంతో చింపివేశాను. ఇటీవల ఆయనను గూర్చి వ్రాసిన 10 పేజీల బహిరంగలేఖకు Xerox కాపీ పంపించాను. జవాబులేదు. మీరూ దానిని Black Out చేశారు.

వీరేశలింగంగారిని గూర్చి నాకు తెలిసిన సంగతులన్నీ నా గ్రంథంలో వ్రాయలేదు. ఇటీవల నా నోట్సునుండి కొన్ని ముఖ్యమైన వ్యాసాలు వ్రాశాను. వాటిలో కొన్ని త్రిపురనేని వారు ప్రకటిస్తామన్నారు. నేను చనిపోయిన తరువాతనైనా అవి ప్రకటింపబడగలవు. ఈ వ్యాసాలలో నేను వ్రాసిన సత్యములను ఎవరికీ ఆక్షేపణ లేనట్టి సంగతులు వెల్లడించాను.

పంతులుగారి భార్య రాజ్యలక్ష్మమ్మగారు మహాలక్ష్మివంటిది. ఆమె బ్రతికి యున్నంతకాలము ఆయన మర్యాద కాపాడినది. ఆయన అవగుణములన్నింటినీ కప్పిపుచ్చినది. ఆమె మహాపతివ్రత. భగవద్భక్తురాలు. ఆవిడ పోగానే పంతులుగారి బండారం బయటపడింది. ఆయన చేసిన స్వయంకృతాపరాధాలవల్లనే ఆయన అవినీతి వెల్లడియైనది. రమాపతిరావుగారికి గాని మీ పత్రికలయందు ఎవరికిగాని వీరేశలింగం గారి నిజచరిత్ర తెలియదు. ఆయన స్వీయచరిత్రను 1911 - 1915 మధ్యకాలములో ప్రకటించినదానిలో ప్రతి పుటలోను నిజమును కప్పిపుచ్చి ఆత్మస్తుతిపరనింద చేశారు. లోకాన్ని మోసపుచ్చారు. ఆయన వ్రాసిన అబద్ధాలు వెంటనే బయల్పడలేదు. క్రమక్రమంగా మెల్ల మెల్లగా వెల్లడియైనవి. లియోనార్డుకు కూడా కొన్ని రికార్డులు, పత్రికలు, గ్రంథాలు దొరకలేదు. తాము ఊరుకొంటే కాలప్రభావంవల్ల మచ్చ మాసి పోతుందని పంతులుగారెరుగుదురు. అందువల్లనే 1915 నుండి 1919 వరకూ ఏమీ వ్రాయకుండా ఊరుకున్నారు. అయితే నిజము దాగదు. ఎలాగో బయటపడుతుంది. గూడూరి నమశ్శివాయగారు నన్ను బాధపెట్టగా నేను కొన్ని సంగతులు వ్రాశాను. దానిని బంగోరే చూసి ప్రకటించాలని నమశ్శివాయగారిచేత సాపు వ్రాయించుకొని వెళ్ళాడు; ప్రకటించకుండానే చనిపోయాడు. అసమగ్రమైన నోట్సునుబట్టి మళ్ళీ వ్రాశాను. త్రిపురనేని వెంకటేశ్వరరావుగారివల్ల నేను ఒక కాపీయైన పుచ్చుకొనలేదు. ఈ సంగతిని వెల్లడిస్తూ దీనిని నా మరణ శాసనంగా వ్రాశాను.

--దిగవల్లి వెంకటశివరావు

# దిగవల్లి వారి వ్యక్తిత్వం

శివరావుగారి కుటుంబం వారి తాతలనాటి నుండి అరిస్టోక్రటిక్ కుటుంబము. తాతగారు దిగవల్లి తిమ్మరాజుగారు పిఠాపురం దివానుగా నుండి కాకినాడలో పెద్ద దేవాలయాలు కట్టించి శాసనం వ్రాయించారు. ఆ ప్రాంతంలోనున్న జమీందార్లను మెప్పించి భూములు ధనము సంపాదించి దానినంతా కాకినాడ భీమేశ్వరస్వామి వారికి అర్పించారు. ఆ ధనము లక్షలలో వుంటుంది. శివరావుగారి పెదతండ్రిగారి పేరు శివరావుగారు. ఆయన తన తండ్రిగారి వద్ద తరిఫీదుపొంది మళ్ళా పిఠాపురం దివానుపదవి నిర్వహించారు. శివరావుగారి తండ్రిగారు వెంకటరత్నంగారు రెవెన్యూ శాఖలో సబ్ మాజిస్ట్రేటుగా పనిచేస్తూ చిన్నవయసులోనే చనిపోయారు. శివరావుగారి అన్నగారి పేరు కూడా తిమ్మరాజుగారు. ఆయన నూజివీడు సంస్థానంలో దివాన్‌గా పనిచేశారు. ఆయన పెద్ద కుమారుడు దిగవల్లి సుబ్బారావుగారు కాంపోజిట్ మద్రాసు రాష్ట్రంలో పబ్లిక్ హెల్తు శాఖలో డైరెక్టరుగా పనిచేశారు. పైన పేర్కొన్న పెద్దలందరూ నీతి నియమాలకు కట్టుబడి తమ పదవులు నిర్వహించుకొన్నారేగాని ఉద్యోగం దొరికిందికదా యని ఏదో సంపాదించాలని అవినీతికి లోనై అపఖ్యాతిపాలైనవారుకాదు.

శివరావుగారు ఒకసారి తిరుమల తిరుపతి వెళ్ళారు. అప్పుడు అక్కడ 11 ఎకరాల భూమి వేలం పాడుతున్నారు. శివరావుగారు ఆ భూమిని పాటపాడి తన పేర కొట్టివేయించారు. చాలా కాలం తన పేరనే వుంది. శ్రీ గంగాధర రామారావుగారు కూడా మరిచిపోయారు. శివరావుగారు చివర రోజులలో రాజాగారికి చెప్పి ఆ భూమిని రాజాగారి పేర దస్తావేజు వ్రాసియిచ్చారు. రాజాగారు ఆశ్చర్యపోయారు.

అదీ దిగవల్లి వారి వంశంలో నిజాయితీ.

శివరావుగారు 1922లో లా ప్రాక్టీసు ఆరంభించారు. 1930 నాటికి సీనియర్ లాయర్స్ లిస్టులో చేరింది శివరావుగారి పేరు. అవి ఉప్పు సత్యాగ్రహం జరుగుతున్న రోజులు. కాంగ్రెసు ఉద్యమాన్ని ప్రచారం చేయుటకు, విషయాన్ని వివరించి చెప్పుటకు, ప్రజలకు ఆ విషయాలు తెలియజెప్పుటకు ప్రచారక కార్యదర్శి పదవిని చేపట్టారు. కోర్టుపని చూచుకొనివచ్చి కాంగ్రెసు ప్రచారం చేయుటకు రోజూ ఒక కరపత్రం వ్రాసేవారు. రాత్రి 10 గం॥లకు ఆ కరపత్రం A. G. Pressకు వెళ్ళి తెల్లవారు జాము 4 గం॥లకు అచ్చయివచ్చేది. ఈ విషయంలో కుందా నరసింహమూర్తి గారు చాలా తోడ్పడ్డారని చెప్పేవారు. వందల కరపత్రాలేకాక 11 పుస్తకాలు కూడా వ్రాసి ప్రచురించానని చెప్పారు. ఈ సామాగ్రి ఇంట్లోకాని, ప్రెస్సులోకాని వుండేది



కాదు. జిల్లాలలో వ్యాప్తిజెందేది. శ్రీ కాకాని వెంకటరత్నంగారు ఆంధ్ర ప్రభుత్వం వారు శివరావుగారికి సన్మానం చేసిన సందర్భంలో సభకు విచ్చేసి యీ విషయాలు ప్రకటించారు. శివరావుగారు కాంగ్రెసు ఉద్యమాన్ని నడిపించారు. మేము బజారులోకి వెళ్ళి ఏ విధంగా కాంగ్రేసు ప్రచారం చెయ్యాలో మాకు ట్రైనింగిచ్చేవారు అని చెప్పారు. చివరకు కలెక్టరు ఆయన మీద కేసుపెట్టారు. శివరావుగారు దానిని ఎదుర్కొని కోర్టులో నిలబడితే ప్రభుత్వం కేసును ఉపసంహరించుకుంది. అప్పుడు జిల్లా కలెక్టరు అన్నాడు. He Corrupted the whole Krishna District అని. రైతు నాయకుడు Prof. N. G. రంగాగారి మీద ఒకకేసు బనాయించారు. అప్పుడు శివరావుగారే కోర్టుకు హాజరై వకాలత్ తీసుకొని రంగాగారి తరపున వాదించి కేసు కొట్టివేయించారు.

బెజవాడబార్‌లో ముఖ్యమైన లాయరుగా ప్రసిద్ధి నొందారు శివరావుగారు. చాలా పెద్ద కేసులు చేపట్టి విజయం పొంది వేలకు వేలు ఫీజు తీసుకొని సుఖజీవనం గడిపారు. శివరావుగారి జీవితంలో రెండే రెండు ముఖ్యమైన పనులు. ఒకటి ప్రాక్టీసు. 2. చరిత్ర పరిశోధన-వీటికి సంబంధించిన లైబ్రరీని పెంపొందింపజేయుట ,రామ్మోహన లైబ్రరీ వృద్ధికి కారణంశివరావుగారు. తరువాత మద్రాసు కన్నెమర లైబ్రరీ నుండి పుస్తకాల పార్శిల్సు వచ్చేవి. ఏవిపంపమంటే అవిపార్శిలు ద్వారా వచ్చేవి. పార్శిలు ద్వారా తిరిగివెళ్ళేవి. ఈ సౌకర్యంకలిగించుకున్న కారణాన వారి పరిశోధన ఫలవంతమైంది. పుస్తకాలు చదవడం నోట్సుతీసుకోవడం వారి ముఖ్యకార్యక్రమం. ఈ విధంగా వారు తీసుకొన్న నోట్సునుగ్రంధాలను లారీలతో తోలారుహైదరాబాదు.

శివరావుగారు 1946లో బార్‌కౌన్సిలుకు అధ్యక్షులయ్యారు. శివరావుగారు తనకు పనివున్న ఎవరివద్దకునైనా వెళ్ళే ఆచారం వుంది. పనిలేకపోతే ఇంట్లోకూర్చుని పరిశోధనా కార్యక్రమాన్ని నిర్వహించుకునే అలవాటు. నూజవీడు జమీందారుగారు ఒకరు మీ సలహా తీసుకోవాలి. ఫీజుఇస్తాను. నూజవీడు కోటకు రమ్మని కారుపంపారు. 'నాతోపని వుంటే నా దగ్గరకు మీరురావ'లసిందే. మీవద్దకువచ్చే ఆచారంనాకేమీ లేదని చెప్పి కారు త్రిప్పి పంపించారు. R.C. జోషి I.C.S అని బెజవాడలో ఒకసబ్ కలెక్టరుండేవాడు. 1946 ప్రాంతంలో బెజవాడలో రెంట్‌కంట్రోల్‌యాక్టుకుసంబంధించిన కేసులు ఆయన వద్దముమ్మరంగా వుండేవి. ఆయనవాయి దాలువేయడం తప్పపనిచేయువాడుకాదు. కోర్టుకు వస్తేసరిగా 11గం. లకువచ్చి విచారణ ప్రారంభించి హాజరుకాని కేసులు కొట్టివేయువాడు. మరునాడు వాదిప్రతివాదులు 11 గం.లకే కోర్టుకు హాజరయ్యేవారు. 3గం.ల వరకు కోర్టుకు వచ్చేవాడుకాదు. 3గంటలకు బంగళాకు రమ్మని వాయిదాలు వేశానవేవాడు. ఆవాయిదా ఎప్పటికి వేసింది తెలిసేదికాదు. ప్లీడర్లు, గుమాస్తాలు గందరగోళంలోపడి శివరావుగారికి చెప్పారు. ఆకాలంలో నేనూ ఒకప్రతివాదినే. శివరావుగారు జిల్లా కలెక్టరుకు వ్రాశారు. జిల్లా కలెక్టరు సబ్ కలెక్టరును

సమాధానం కోరారు. సబ్ కలెక్టరు గుమాస్తాను పంపారు, శివరావుగారిని తీసుకు రమ్మని. గుమాస్తావచ్చి సబ్, కలెక్టరుగారు "మిమ్మొకసారి రమ్మన్నారు. ఏదో మాట్లాడాలట" అని చెప్పాడు. వారి నియమాన్ని వివరించి చెప్పారు. "నాతో పనివుంటే ఎవరైనాసరే నావద్దకు రావలసిందేగాని నేను వారివద్దకువచ్చే అలవాటులేదు పొమ్మన్నారు.

సబ్ కలెక్టరుగారే బయలుదేరి శివరావుగారింటికి వచ్చారు. పిటీషను చూపి సమాధానం కోరారు. అందబద్దాలులేవు. అంతాసత్యమేనన్నారు శివరావుగారు. ఆపిటీషను ఉపసంహరించుకోమని కోరాడు సబ్ కలెక్టరు. అదినాకు ఆచారంకాదన్నారు శివరావుగారు. చివరకు సబ్ కలెక్టరు జోషి ఒంగోలుకుబదలాయించ బడ్డారు.

భాస్కరరాజు గారనే సబ్ జడ్జి ఒకరుండేవారు. వారుప్లీడర్ల నవమానిస్తూ బెంచిమీదనే నోటికొచ్చినట్టు వాగుతూ అవమానిస్తూండేవారు. ఒకరోజున కోర్టులో శివరావుగారు కూర్చుని వుండగానే మెట్లపల్లి కోటీశ్వరరావుగారిని ఏ'లా'కాలేజిలో చదివావులా అని ప్రశ్నించాడుట. శివరావుగారు ఆమాటవినిలేచి బార్ రూంలోనికి వెళ్ళారు. మీటింగు నోటీసు వ్రాసి, ప్లీడర్లనందరినిరప్పించి సమావేశపరచారు.

"బెజవాడ బార్ కు ఆదర్శప్రాయుడు, పెద్దవాడు, తెలివి గలవాడునైన శ్రీ మెట్టపల్లి కోటీశ్వరరావు పంతులుగారిని ఏలాకాలేజీలో చదివావని అడుగుట అవమానించుటగాయీ సమావేశం భావించు చున్నది. తక్షణము ఆమాట ఉపసంహరించుకొని పంతులుగారికి క్షమాపణచెప్పుకోవాలి. లేనిచో బార్ తీవ్రమైన చర్యలు తీసుకొంటుంది."

తీర్మానంవ్రాసిలోకలుటపాలో పంపి సంతకం చేయించుకున్నారు. భాస్కరరాజుగారు ఖిన్నులై ఆమాట నుపసంహరించు కొన్నానని క్షమాపణ చెప్పుకుంటున్నానని చీటీవ్రాసి అధ్యక్షులకు పంపారు.

అదీ శివరావుగారి తత్వము. ఇట్టిచర్యలవల్ల ప్రాక్టీసు దెబ్బతింటుందనిగాని, తనకేసులకు వ్యతిరేకంగా తీర్పులిస్తారనిగాని వెరచేవారుకారు. ఆయనది సింహమువంటి సత్త్వము. ఎవరికీ ఏవిధంగాను లొంగుట అనునది వారిలోలేదు.ఆయన 'న్యాయకేసరి' బిరుదుకు అర్హుడు.

మరొక విషయంచెప్పి విరమిస్తాను. శివరావుగారి వంశంలో ఒక ముసలమ్మగారుండేవారు. వీరికి మేనత్తో వీరితండ్రిగారి మేనత్తో నాకు సరిగా గుర్తులేదు. వీరి మూడవకుమార్తె వివాహానికి ఎప్పుడూ అతగాడికి ఏ సహాయం చేయలేదని షుమారు 7000వేలరూపాయలు అన్నకుమారుని పరంగా పంపుకుంది. అన్నకుమార్డు ఏలూరులో అడ్వకేటు. వెంకటరత్నంగారని, ఆయన ఆ డబ్బు తెచ్చి ఇవ్వబోయారు పెండ్లిలో శివరావుగారు తీసుకొనుటకు నిరాకరించారు. అంతా నివ్వెరబోయారు.



"ఆమెకు నా యందు అభిమానముంటే ఆమె స్వయంగావచ్చి పిల్లలను ఆశీర్వదించి ఇస్తే తీసుకునేవాణ్ణి. ఆమెరాకుండా మరొకరితో పంపడం,నేనులేని వాణ్ణని, డబ్బుకక్కుర్తి మనిషినని, ఆమె కలిగిన ధనవంతురాలనే ధ్వని స్ఫురిస్తోంది. నా యందు అభిమానం స్వచ్ఛమైందికాదు" అనిచెప్పి నిరాకరించారు. తరువాత ఆ ముసలమ్మ మరణించింది. ఆ డబ్బు బ్యాంకులో వేయించి నాలనంతరం శివరావుకు చెందాలని మరణ శాసనంలో పేర్కొన్నది. తరువాత నాల్గవకుమార్తె వివాహానికి షుమారునదివేలువడ్డీతో ఆ విల్లు తీసుకువచ్చి బ్రతిమాలి ఆ పైకం ఇచ్చారు. శివరావుగారికి నియమనిబంధనలంటే అంతపట్టుదల. జీవితమంతా పట్టుదలతో యీ విధంగా సత్యవ్రతాన్ని ఉపాసించినవారిని మరొకరిని నేచూడలేదు. ఇదంతా గాంధీ మహాత్ముని మహిమని చెప్పాలి.

శివరావుగారికి జయంతిపురం రాజాగారికి కలిపి కాంగ్రెసు సేవకులుగా సన్మానం చేయాలని కొందరి కాంగ్రెసు ప్రముఖుల సలహా సంప్రదింపులతో ఒక నిర్ణయం తీసుకొన్నాం. శ్రీ త్రిపురనేని వెంకటేశ్వరరావు గారింట్లో ఒక సమావేశంఏర్పాటు చేశారు. ఆ సమావేశానికి ఒక పాతికమంది వరకు హాజరయ్యారు. అందునేను, మల్లెల శ్రీరామమూర్తిగారు, కాట్రగడ్డ మధుసూదనరావుగారు కూడా ఉన్నాము. సన్మానము ఎప్పుడు చేయాలి ? ఏమి చేయాలి అనే సమస్య ఎదురైంది. నేను మల్లెల శ్రీరామమూర్తిగారు కూడా చెప్పాను. రాజాగారి పుస్తకం ఒకటి, శివరావుగారి పుస్తకమొకటి అచ్చువేసి సమర్పించుట తప్ప మరోవిధమైన సన్మానం ఉభయులు అంగీకరించరని ప్రసంగించాము. దానికి హాజరైన సభ్యులంతా అంగీకరించారు. త్రిపురనేని వెంకటేశ్వరరావు గారిని వారలను కలుసుకొని ఆ పుస్తకాలను సంపాదించమని సలహా యిచ్చాము. తరువాత జయంతిపురం రాజాగారిని కలిసి మంగళసూత్రము అనుభోద్ఘాతవ్యాసావళితెచ్చి అచ్చువేశారు.

శివరావుగారి నుండి వీరేశలింగం - వెలుగునీడలు అనే గ్రంధాన్ని తెచ్చి అచ్చువేశారు. త్రిపురనేనివారు శివరావుగారి వద్దకువెళ్ళితే సన్మానాన్నే నిరాకరించారు. కాట్రగడ్డ మధుసూదనరావుగారు కూడా వున్నారు. నేనూ శ్రీరామమూర్తి కూడా వున్నామని చెప్పితే ఇక కాదనలేక అచ్చుకావలసిన పుస్తకాల కట్టతెచ్చి ముందుపడవేసి నీ ఇష్టమొచ్చినపుస్తకం తీసుకోమన్నారు. త్రిపురనేనివారు 'వీరేశలింగం వెలుగునీడలు' తీసుకున్నారు. అప్పుడు శివరావు గారన్నారుట 'అది వివాదగ్రస్తమైన గ్రంధమని' అయినా అదే వేస్తానని తెచ్చి అచ్చువేయించారు. కాని త్రిపురనేని వారు చేసిన తప్పు దానిని ఉదయం పత్రికలో వ్యాస పరంపరగా ప్రచురింప జేయనిచ్చుట. పుస్తకము ఆవిష్కరణ, దిగవల్లి శివరావుగారికి సన్మానసభ జరిగిన పిమ్మట పత్రికా ప్రచురణ చేయాలి. అంతదనుక ఉండ బట్టలేకపోయారు. ఈ ఒక్క విషయముతప్ప మిగతా

కథంతా సక్రమంగా నిష్కల్మషంగానే జరిపారు. ఈలోగా జయంతిపురం రాజాగారు శ్రీ వాసిరెడ్డిగర్గా సదాశివేశ్వర ప్రసాద్‌గారు మరణించారు.

శివరావుగారిలో ఈర్ష్య కషాయితలు ఇంకిపోయాయి. క్రిష్ణలైజ్డు పారంలో స్ఫటికంలా నిష్కల్మషులయ్యారు. వారి తపస్సు విద్యుత్‌వలె ప్రవహిస్తోంది శరీరంలో. ఆ విద్యుత్‌ను ఎవరుతాకితే వారు కాలిపోకతప్పదు. ఒక సత్యోపాసకులు మాత్రమే తట్టుకోగల్గుతారు. శివరావుగారు సత్యతపోనిష్ఠులు. 'వీరేశలింగం వెలుగునీడల'నే పుస్తకాన్ని బలవంతంగా అనేకసార్లు హెచ్చరించి సంకలనము చేయించిందినేనే. బంగోరేకూడా కొంత కారకుడయ్యాడు. అచ్చువేయిస్తానని తీసుకున్న బంగోరే మరణించాడు. ఆ ప్రతిని త్రిపురనేనివారు తీసుకొని అచ్చువేయించారు, నిష్కల్మషంగా. ఆయనకు ప్రింటు చేయుటకు శుద్ధప్రతి తయారు చేసిచ్చిందినేనే. రమాపతిరావుగారి పిచ్చితిట్లు శివమెక్కి వ్రాసిన అశ్లీలపు వ్రాతలకు అటువంటియితరుల మాటలకు వ్రాతలకు సమాధానం లేదు.

శ్రీ దిగవల్లి శివరావుగారు ఇప్పటికీ సంపన్నులే. కుమారులు అల్లుళ్ళు అందరూ సంపన్నులే. బాగా ఆర్జించుకొనుచున్నవారే. ఆయన పరిశోధనా గ్రంధాలను' రచనలను జెరాక్సులు చేయించటానికి నిత్యఖర్చు చాలా వుంటుంది. పుస్తకాలు చాలా కొంటారు. ఆయనకు అద్దెలే నెలకు మూడువేలు వస్తాయని తెలియని వారూ శీల శూన్యులూ తమవంతునే శివరావుగారిని కూడా భావించి వ్రాయించడం వ్రాయడం ప్రచారంచేయడం సిగ్గుచేటు. పత్రికలందుకు అవకాశమివ్వటం నీచంగావుంది. కులమత వర్ణ భేదం పాటించమని చెప్పే వర్గంవారుదారితప్పి మాట్లాడుతున్నారు. ఇది దేశానికి సంఘానికి చాలా అపకారం.

కాని వీరేశలింగంగారు చేసిన విధవా వివాహాలను ఎవరూ కాదనరు. విమర్శించరు. మిగతా వారి అభిప్రాయాలతో ఎవరూ ఏకీభవించరు. వీరేశలింగంగారు హిందూ సంస్కృతి లోతులు తెలియనివాడు బ్రిటిషువాళ్ళకు తొత్తు. ఈ విషయం గూర్చి ప్రత్యేకంగా ఒక పుస్తకం వ్రాసి ప్రకటించవచ్చు.

-డా॥ గూడూరి నమశ్శివాయ

# Judgement on Veeresalingam and his work

*(The Hindu April 15, 1911 and May 8, 1911)*

In April and May 1911 a series of articles appeared in the Hindu entitled 'the Present position of Telugus.

The first article asked why are the Telugus backward? The fourth article dealt with public life in the Telugu Country and its leaders. The articles concentrated on the analysis of three different movements -Social Reform, The Prardhana Samaj and Nationalism - to explain the apparent aparthy in coastal Andhra. In the fourth article, the author stated that the progress of a country is determined by two factors by the form of its public institutions and by the character displayed by its leaders.

The author proceeded to analyse Veeresalingam as a leader and an Institution-builder. True it is that very few of the sympathisers of the movement could not go as far as he asked them to do, in its very early days. There is however anotherside of the shield. The fault was never entirely on the side of his lesser men. Mr. Veeresalingam Pantulu has, I may be pardoned to call, an oppressive (sic) personality-his genius, his strength of will, his peculiar humour and stubbornness, his uncompromising attitude and especially his entire lack of penetrative imagination have always been in the way of his weaker followers.

He is no doubt a highly religious man; but he always lacks sweetness and soothing balm of love. He lacks in the the power of building and cementing the materials before him. It is ironic that the first volume of Veeresalimgam's autobiography completely confirmed the above apprehension.

Later in 1911, another critique of Veeresalimgam's accomplishment appeared in J. Gurunatham's biography: Veeresalingam: the Founder of Telugu Public Life. Gurunatham attacked Veeresalingam's work in three fields: Nationalism, the Prardhana Samaj and Social reform.

His remarks (Gurunatham,s) on the Brahmosamaj movement in Coastal Andhra were some what peculiar. He condemned it and Veeresalingam for a lack of "ascetic element." He wrote :

"The entire absence of emphasis on this mood and its passion for simplicity, self-applied rigour, merit, discipline, firm regulation," in the religious propaganda of Mr. Pantulu and his party, explains to some extent the cause of the general superficiality of the Prathana Samaj in the Telugu Country.' [Veeresalingam, the Founder of Telugu Public Life by J. Gurunatham, 1911. P. 170]

His evidence for this failure was Veeresalingam's inability to produce a handful of men with strong and militant character (Ibid P 170) in contrast with the success of Brahmoism in Culcutta.

# News Time Review

by Potturi Venkateswara Rao

***Editor, Andhra Prabha.***

It is true that the men who make history have no time to write it. But some men do write so that their record of performance is projected in a manner they like it to be. Some of the autobiographies of eminent men bear abundant testimony to it. One such autobiography, very surprisingly, is that of Veeresalingam Pantulu, a great social reformer belonging to the latter part of 19th century and early part of this century. Mr. Digavalli Venkata Siva Rao the octogenarian scholar of Andhra Pradesh, discovered a number of distortions and deliberate omissions in the autobiography of Veeresalingam. In his book *Veeresalingam Telugu Needalu* (meaning the bright and dark sides of the personality of Veeresalingam). Mr. Siva Rao lists a number of instances with historic authenticity to prove that Veeresalingam wanted all the credit for the movement of widow marriage. There were several others who led and helped the movement.

Samineni Muddukrishnama Naidu was the person who pioneered the movement Paida Ramakrishnaiah, Atmuri Lakshmi Narasimham, Basava Raju and Eluri Lakshmi Narasimham were the other great men who lent their support to it both financially and otherwise. Even title page of the book depicts Vaeresalingam as 'panchamukheswara' (the five headed personality) with the picture of Naidu standing high above. Mr. Siva Rao did not discover the omissions and commissions all of a sudden, but has been exposing them in his articles published over the last several decades.

Several interesting facts of historic value were incorporated in the book. That some Telugu widows, in the year 1856, petitioned to the then Governor of Madras seeking his mercy for "an enactment with the authority of which Hindu widows may

marry if they chose to'' and that two of the petitioners signed in English, was only one such instance.

Mr Siva Rao's book, though pulls down the image of Veeresalingam, is a welcome research work which sets the record of history straight. The Vemana Vikasa Kendram of Vijayawada which was instrumental in bringing out the book promises to publish similar works on Raghupati Venkataratnam Naidu, Tripuraneni Ramaswamy, Gurajada and Kattamanchi Ramalinga Reddy.

Mr Digavalli Venkata Siva Rao's work, probably the first of its kind in Telugu, is undoubtly an outstanding research work.

## ఆంధ్రలేఖ

ఆంధ్ర శేషగిరిరావు
ఝుళ్ళ్మ్ఠమల
534336
పశ్చిమ గోదావరిజిల్లా

శ్రీ గూడూరు నమశ్శివాయ గారికి,
ఆంధ్ర పుత్రులకు

అభివాదాలు

శ్రీ దిగవల్లి వెంకట శివరావుగారి వీరేశలింగం వ్యాసాలు మూడుఆదివారాలుగా చదువుతున్నాను. ప్రశంసనీయంగా ఉన్నాయి. రాజశేఖర చరిత్రలో ఆయన చౌర్యం లోగడ శ్రీ చేకుమళ్ళ కామేశ్వరరావుగారు ప్రబుద్ధాంధ్రలో వెల్లడించి ఉన్నారు. తెలుగు పెద్దల గ్రంధ చౌర్యాలు అనే నా వ్యాసంలో లోగడ బాలనీతి కావ్య విషయంలో వీరేశలింగంగారి చౌర్యం బయలుపరచడం జరిగింది. ఇక వీరేశలింగంగారి స్వభావాన్ని గురించి శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి, శ్రీ శృంగార కవి సర్వారాయుడు తమ తమ గ్రంథాల్లో వ్రాసినవి మీరు చూచే ఉంటారు. నిజం నిలకడమీద తేలుతూ ఉంది. పుస్తకం సేకరించి ఉంచండి; బుక్కు పోస్టులో పంపవద్దు. చేరేదాకా నమ్మకం లేదు.

ఇట్లు,
ఆంధ్ర శేషగిరిరావు
23-7-85

## పొత్తూరి వారి లేఖ

13-01-85

మాన్యశ్రీ దిగవల్లి వెంకట శివరావుగారికి నమస్సులు

మీరు పంపిన "వీరేశలింగం వెలుగు నీడలు" పుస్తకం అందింది. ధన్యవాదాలు.

వీరేశలింగంగారి కృషిని తక్కువచేయకుండానే ఆయనలోని కొన్ని లోపాలను మీరు బయట పెట్టారు. అది మంచి పనే. వర్తమాన చరిత్రలో - రాజకీయాల కారణంగా నిజం మరుగున పడుతున్నది. కనీసం గత చరిత్రనైనా సవరించుకొని, ఉన్నది ఉన్నట్టు చెప్పుకోడానికి ప్రయత్నించడం మంచి పనే.

భవదీయ
పొత్తూరి వెంకటేశ్వరరావు
ఎడిటర్

# ఆంధ్ర వాఙ్మయ యుగములు - వీరేశలింగంగారు

—దిగవల్లి వెంకటశివరావు

ఆంధ్ర సాహిత్యములో వీరేశలింగయుగం అనినేను వ్రాసినట్లుగాను పంతులు గారిని పొగడుతూ చక్కని సమీక్షను ప్రకటించినట్లుగాను రమాపతిరావు వ్రాశారు.

ఆ వ్యాసముపేరు ఆంధ్ర వాఙ్మయయుగములు. వానిని అయిదు యుగములుగా విభజించాను. అందులో గద్యకావ్య యుగమును వీరేశలింగ యుగ మనవచ్చునన్నాను. వారిని నవయుగములో చేర్చలేదు. నవయుగానికి పునాదులువేయ ప్రయత్నించినవారని, భావోద్రేకములో మునిగితేలిన యుగపురుషుడని వ్రాశాను. గద్యకావ్యయుగ లక్షణాలు నవయుగ లక్షణాలు నేను వేరువేరుగా వివరించాను. యుగపురుషుడనేది గద్యకావ్య యుగానికి చెందినమాట. భావోద్రేకమున మునిగితేలిన వారనే వాక్యములో సంఘ సంస్కారావేశములో యుక్తా యుక్త వివేచనలేకుండా వ్రాసినవారనే ధ్వని యున్నది. నవయుగానికి పునాదులువేయ ప్రయత్నించినవారనే మాటలో సంకల్పసిద్ధి కాలేదనే ధ్వని వినపడుతూనే వున్నది. వ్యాసమంతా చదివితే పంతులుగారిని గూర్చి చాలా మర్యాదగా విమర్శించినట్లు ఎవరైనా గ్రహింపగలరు. పంతులుగారు నవయుగ పురుషుడనడానికి ఆస్కారమేలేదు. [1926]

# వీరేశలింగం వెలుగు నీడలు రమాపతిరావుగారి విమర్శల తీరుతెన్నులు

— దిగవల్లి వెంకట శివరావు

శా॥ 'సర్వజ్ఞత్వము సాంబమూర్తిది
మనుష్య ప్రజ్ఞ యల్పంబు దు
ర్గర్వంబుల్ కొలగావు దూషణల
మోక్షశ్రీలు చేకూర వీ
యుర్విన్ ఖానికు దెన్ని రాళ్ల వడ పోయున్
రత్నమొక్కంటికై
గుర్వర్థం బొం కడున్న జాలదె ?
సుధీకుంభుల్ విచారించినన్.'

అని వీరేశలింగంగారి సమకాలికులైన మహాకవి దాసు శ్రీరాములుగారు వ్రాసియున్నారు.

25-5-1986 నుండి పదకొండు ఆదివారం విశాలాంధ్ర పత్రికలో వీరేశలింగంగారిని గూర్చి అసత్యాలు అర్ధసత్యాలు అనేకోక్తితో అక్కిరాజు రమాపతిరావుగారు నేను రచించిన వీరేశలింగం వెలుగునీడలను విమర్శిస్తూ వ్యాసాలు ప్రకటించారు. ఆంధ్రజ్యోతి వారపత్రికలో 8 వారాలు ప్రకటించారు. ఆంధ్రప్రభలో ప్రకటించారు.

ఈ రమాపతిరావుగారు కమ్యూనిష్టుల ప్రచారం సందర్భంలో వీరేశలింగంగారిని గూర్చి గత 50 సం॥లో వివిధ గ్రంధకర్తలు చేసిన విమర్శలన్నిటినీ కప్పిపుచ్చి 1982 సం॥లో వీరేశలింగం స్వీయ చరిత్రను పునర్ముద్రణ చేయుటకు పరిష్కర్తగా నియమింపబడి వారి చెప్పుచేతలలోనున్నారు.

నేను నాగ్రంధంలో పేర్కొన్న వివిధ గ్రంధకర్తలు వ్రాసిన అసలు విషయాలకు సమాధానాలు చెప్పలేక అబద్ధాలతో వక్రభాష్యాలతో అప్రస్తుత ప్రసంగాలతో హేళనలతో పేజీలు నింపివున్నారు. సహృదయులైన సాహిత్యవేత్తల విమర్శలకు విలువ వుంటుందిగాని ఇటువంటి పనికిమాలిన వ్యాసాలకు విలువ యుండదు.

ఆంధ్రప్రభ సంపాదకులు శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు గారు నా గ్రంథాన్ని ప్రశంసిస్తూ News Time లో 26-1-86 తేదీన సమీక్ష ఇంగ్లీషులో ప్రకటించారు. మరికొందరు సాహిత్యవేత్తలు నాగ్రంథాన్ని ప్రశంసిస్తూ ఉత్తరాలు వ్రాశారు .

రమాపతి రావుగారి చేత ఈవ్యాసాలు వ్రాయిస్తూవున్న 'విశాలాంధ్ర' సంపాదకులు 25-5-86 పత్రికలో రమాపతిరావుగారి వ్యాసాలకు ఉపోద్ఘాతముగా 'ఒకమాట' అనే శీర్షికతో ఒక అసహ్యమైన రచన ప్రకటించారు. అందులో వీరేశలింగంగారిని విమర్శించేవారు కుక్క గొడుగులు, అల్పబుద్ధులు, అంగుష్ఠ మాత్రులు వెకిలి వెంగళాయలు రొచ్చుగుంట ప్రచారానికి దిగుతున్నవారని వ్రాశారు. అది వారి స్థాయి.

కాని మహాకవియని కమ్యూనిష్టులు గౌరవిస్తూవున్న గురజాడ అప్పారావుగారు వీరేశలింగం గారిని గూర్చి తమ డైరీలో 7-4-1895 తేదీన ఈక్రింది విధంగా వ్రాశారు.

"Lionising has done much harm to Southern India. Some fellow of indifferent charecter and attainments is made much of and the conviction grows upon him and his admirers that he is perfect. He cares no longer to improve himself. His followers copy his imperfections. Mr. Veeresalingam is an example to the point." అని వ్రాశారు. వీరేశలింగంగారిని ఇంత కఠినంగా విమర్శించినందువల్ల గురజాడ అప్పారావు గారుకూడా విశాలాంధ్ర సంపాదకులు పేర్కొన్న కుక్కగొడుగులు అల్పబుద్ధులు అంగుష్ఠమాత్రులు నీచప్రచారకులు వెకిలి వెంగళాయులు రొచ్చుగుంట ప్రచారకుల జాబితాలో చేరినందుకు చాలా సంతోషిస్తున్నాను.

అప్పారావుగారు వీరేశలింగం గారిని ఇంతటితో వదలలేదు. అటుతరువాత ఆయన రచించిన కన్యాశుల్కంలోను కొండు భట్టీయంలోను వీరేశలింగం గారిని గూర్చి వ్యంగ్యంగావ్రాసి అసహ్యంగా చిత్రించారు. వెటకారం చేశారు. "చేస్తే చేశారులెండి, దానివల్ల వీరేశలింగంగారికి న్యూనత లేదు. అప్పారావు గారికి పెరిగిన గౌరవములేదని" రమాపతి రావుగారు వ్రాశారు ! అనగా, వారివద్ద దీనికి జవాబులేదన్నమాట.

వీరేశలింగంగారి ఆంధ్ర కవుల చరిత్రను గూర్చి కూడా అప్పారావుగారు చాలా కఠినంగా విమర్శించి అందులోని లోపాలను చూపారు. వీరేశలింగం వెలుగు నీడలలో అప్పారావుగారి విమర్శలను ముద్రించియున్నాను. రమాపతి రావుగారు దీనికి సమాధానం వ్రాయలేదు.



# రమాపతిరావుగారి సర్వజ్ఞత్వం, స్వాతిశయం

దిగవల్లి వెంకట శివరావు గారు సుమారుయాభై ఏళ్ళనుండి చారిత్రక పరిశోధనలో నిమగ్నులైయున్నారని, వీరేశలింగం పంతులుగారిని గూర్చిన పరిశోధనకై పాతిక సంవత్సరముల క్రిందట వారి సలహాసంప్రదింపులకై వారిని దర్శించానని అప్పట్లో వారి దగ్గరున్న పాతపత్రికలు పనికి వచ్చే సంప్రదింపు సామాగ్రి యిచ్చి ఎంతో సహాయంచేశారని రమాపతిరావుగారు 25-5-86 విశాలాంధ్రలో తెగ వ్రాశారు. తమకు నాపట్ల గౌరవం ఉన్నదని ఎంతో వ్రాస్తూనే ఈ వ్యాసాలలో తమకు తెలిసినన్ని విషయాలు నాకు తెలియవని మధ్య మధ్య నన్ను హేళన చేస్తూవచ్చారు !

వీరేశలింగంగారి వివేక వర్ధనికి బందరులోని పురుషార్ధప్రదాయిని మార్గదర్శియని నేను వెలుగునీడలులో వ్రాసిన దానిని గూర్చి ఎగతాళి చేస్తూ అంతకు పూర్వము ప్రకటింపబడిన తత్వబోధిని పత్రిక సంగతి నాకు తెలియదన్నారు. ఈతత్వబోధిని పురుషార్ధప్రదాయిని వంటి వివిధ విషయములను గూర్చిన పత్రికకాదు. చెన్నపట్నం వేద సమాజంవారు ప్రకటించే మత విషయిక పత్రిక. రమాపతిరావుగారు కళ్లుతెరవక పూర్వమే సాహిత్యకుడు కాక పూర్వమే 1968 సం॥లో నార్ల వెంకటేశ్వరరావుగారి షష్టి పూర్తి సందర్భంలో ఢిల్లీలో ప్రకటింపబడిన Studies in the History of Telugu Journalism అనే గ్రంథంలో (నిడదవోలు వెంకటరావుగారు, ఆరుద్ర, మొదలైన వారితో పాటు) నేను (కూడా) 'Telugu Journalism Past and Present' అనే పెద్ద వ్యాసం వ్రాశాను. అందులోనే వీరేశలింగంగారి వివేకవర్ధనికి పురుషార్ధప్రదాయిని Model అని వ్రాశాను. తత్వబోధిని పత్రికను ఇతర పత్రికలను పేర్కొని వాటిని గూర్చి వ్రాసివున్నాను.

రమాపతిరావుగారు తమ సర్వజ్ఞత్వమును గూర్చి ప్రకటించుకొనడమేగాక వీరేశలింగంగారి వలెనే ఆత్మస్తుతి పరనింద చేస్తున్నారు. ఈ వ్యాసాలలో తమ పరిశోధనను గూర్చి గొప్పగా వ్రాసుకుంటున్నారు. అందువలన రమాపతిరావుగారి పరిశోధనలోని ఘోరమైన తప్పులను కొంచెం వెల్లడించడము అవసరమైనది.

1963 సం॥లో రమాపతిరావుగారు పదిరోజులపాటు ప్రతిదినము బెజవాడలో మా యింటికివస్తూ నాదగ్గరున్న గ్రంథాలను పత్రికాసంపుటాలను చదివి నోట్సువ్రాసుకున్నారు. వీరేశలింగంగారు ధవళేశ్వరం గ్రామస్థులను ప్రోత్సహించి 1874 సం॥లో బాలికాపాఠశాల స్థాపించక పూర్వము చాలాకాలం క్రిందటనే ఆంధ్రదేశంలో బాలికా

పాఠశాలలున్నవని నేనాయనకు చెప్పి విశాఖపట్టణంలో గొడే జానకయ్యమ్మగారు 1867 సం॥లో స్థాపించిన బాలికాపాఠశాలను ఆమెకుమార్తె రత్నయ్యమ్మగారు అల్లుడు G. L. నరసింగరావుగారు యువతీ విద్యాలయంగా అభివృద్ధి చేశారని 1869 సం॥లోని Madras Journal of Education అనే పత్రికను, Madras Revenue Register అనే పత్రికను యిచ్చి చూడమని చెప్పగా వారు వానిని చదివి నోట్సు వ్రాసుకున్నారు. అవి సరిగానే చదివి అర్థం చేసికున్నారని అనుకున్నాను. కాని వానిని సరిగ్గా అర్థం చేసికొనలేదని తమనోట్సులో తప్పులువ్రాసుకున్నారని 1968 సం॥ ఏప్రిలు నెల భారతిలో "120 ఏళ్ల వీరేశలింగం" అనే శీర్షికతో వ్రాసిన వ్యాసము వల్ల నాకుతెలిసినది. అందులో ఇలావ్రాశారు. "1869 సం॥లో విజయనగరంలో బాలికాపాఠశాల స్థాపనచేసే సందర్భములో యావద్భారత దేశంలోను ఒక్క కాశీనగరంలో తప్ప ఇట్టి బాలికాపాఠశాలల స్థాపన జరగలేదని, ఇట్టి సంస్కరణోద్యమాలద్వారా ముందు ముందు ఈ దేశీయులు స్త్రీ పునర్వివాహములు మొదలైన సంస్కరణకూడా సాధింపగలరని తామాశిస్తూవున్నట్లు శ్రీ లింగం లక్ష్మీజీ పంతులుగారు ఆనాటి సభలో ఉపన్యసించారు. Madras Journal of Education 1869 pages 262–266."

ముందు ముందు స్త్రీ పునర్వివాహములు మొదలైన పెద్ద సంస్కరణలను సాధించే కాలంరాగలదని ఆశిస్తామని ఆ సభలో ఉపన్యసించినవారు G. L. నరసింగరావుగారేగాని లక్ష్మీజీ పంతులుగారుకాదు. లక్ష్మీజీ పంతులుగారు స్త్రీ విద్యవిషయాన్ని మించి మరొక్కమాట మాట్లాడలేదు. స్త్రీ పునర్వివాహంగూర్చి నరసింగరావుగారు ఉపన్యసించిన తర్వాత ప్రసంగించుతూకూడ లక్ష్మీజీపంతులుగారు ఆ ప్రసక్తి ఎత్తుకోకుండా వదిలేశారు. వారికి విధవావివాహ సంస్కరణ భావాలుంటే వెలిబుచ్చవలసిన మహదవకాశం అది కాని అక్కడ వెలిబుచ్చలేదు. మరొకచోట వెలిబుచ్చినట్లు దాఖలాలులేవు. పైగా, వారి విజయనగరం వారి ఆస్థానం కన్యాశుల్కాన్ని గూర్చేగాని విధవావివాహాన్నిగూర్చి మాట్లాడిందికాదు. 1869లో నరసింగరావుగారు చేసిన ఆ సంస్కరణోపన్యాసాన్ని లక్ష్మీజీగారిపేర జమవేయడం అన్యాయం. ఆ అక్రమమైన జమను యిప్పటికీ దిద్దకుండా నిజమైన ఆసామి ఖాతాకు తిరిగి జమవేయకుండానే ఆ అసత్యకధనాన్ని అలాగే నిలబెట్టుకొస్తున్నారు. Madras Journal of Educationలో ప్రచురితమైన ఆ వార్త ఏవిధంగానూ పొరపడటానికి వీలులేకుండా అతిస్పష్టంగా వున్నది. ఇది కావాలని చేసినఅసత్యకధనంగా కనిపిస్తున్నది. గొడేవారి సంస్కరణ



కృషిని అభిప్రాయాలను కప్పిపుచ్చి రమాపతిరావుగారు చాలా అపచారం చేస్తున్నారు

ఇది సామాన్య బాలికా పాఠశాలకాదు. ఇది ఒక యువతీ విద్యాలయమనే మాట రమాపతిరావుగారు గ్రహించలేదు. దీని చరిత్రను గూర్చి రమాపతిరావుగారు సరిగ్గా అర్థంచేసికొనలేదు.

1869 సం॥ జులై మాసపు Journal of Education పత్రికలో 4 పేజీలలో దీనిని గూర్చిన వృత్తాంతము సన్నని అచ్చులో ముద్రింపబడి యున్నది. The Madras Revenue Register Vol III 1869 ఆగస్టు 15 తేదీనాటి సంచికలో దీనిని గూర్చి ఒక వ్యాసమున్నది. ఈ పాఠశాల విశాఖపట్టణంలో 1867 సం॥లో స్థాపింప బడినది. దాని నూతన భవన ప్రారంభోత్సవం 1868 సెప్టెంబరు 7వ తేదీన చేయబడినది. అప్పుడు జరిగిన సభలో పలువురు విశాఖపట్టణం ప్రముఖులు ప్రసంగించారు. దీని చరిత్రను జి. ఎల్. నరసింగరావుగారు వివరించారు.

1867 సం॥లో విశాఖపట్టణంలో గొడే సూర్యప్రకాశరావుగారి భార్య జానకయ్యమ్మగారు ఒక బాలికాపాఠశాలను స్థాపించారు. దానిని ఆమెకుమార్తె రత్నయమ్మగారు, అల్లుడు జి. ఎల్. నరసింగరావుగారు (A School for Adult Hindu girls) వయోధికయువతీ విద్యాలయంగా అభివృద్ధిచేశారు. దానితో St. Joseph Convent Sisters తోడ్పాటుతో వయస్సు వచ్చిన ఆడపిల్లలకు ఇంగ్లీషు తెలుగు భాషలలో విద్యనేర్పడమేగాక లేస్ (Lace) అల్లిక కుట్టుపని మొదలైన వృత్తికళలు కూడా నేర్పేవారు. ఈ పాఠశాల విద్యార్థినులు అల్లిన లేసు (Lace) మచ్చులు మద్రాసు గవర్నరుగారికి బహూకరించగా ఆయన ఈ పాఠశాలనభినందిస్తూ సందేశము పంపినట్లు Madras Revenue Register 1869 ఆగస్టు నెల సంచికలో ప్రకటింపబడినది.

అది ఇంతగొప్ప యువతీ విద్యాలయం అయినందువల్లనే విజయనగరం ఆనంద గజపతి మహారాజుగారి ప్రయివేటు ట్యూటరు, బహుభాషావిశారదుడు, లింగం లక్ష్మీజీగారు దానిని గూర్చి ప్రశంసిస్తూ ఉపన్యసించారని రమాపతిరావుగారు గ్రహించలేకపోయారు. ఈ Adult Girls Schoolను గూర్చిన రిపోర్టు కొంతభాగమును వెలుగునీడలలో ముద్రించియున్నాను.

రమాపతిరావుగారి తప్పుడు పరిశోధనకథ ఇంతటితో ముగియలేదు. వీరు భారతిలో వ్రాసిన ఆ వ్యాసమును చూచి K. V. రమణారెడ్డిగారు గురజాడ అప్పారావు

గారిని గురించి వ్రాసిన 'మహోదయం' అనే గ్రంధములో ఈ తప్పుడు సమాచారాన్ని కాపీ చేశారు. (చూడు : పుట 81)

రమాపతిరావుగారు వీరేశలింగంగారిని గూర్చి గ్రంధంవ్రాసి డాక్టరేటు పొందటం వల్ల 1968 సం॥ భారతిలో వ్యాసాలు వ్రాయటంవల్ల కమ్యూనిష్టులు ప్రకటించిన వీరేశలింగం డైరీలు-లేఖలు అనే గ్రంధానికి Editorగా నియమింపబడినారు. ఈ గ్రంధంలో కూడా భారతిలో వ్రాసిన తప్పుడు సమాచారాన్ని పునర్ముద్రణం చేశారు! (చూ. 1971 వీరేశలింగం డైరీలు-లేఖలు విశాలాంధ్ర ముద్రణ పుట 21) ఇంకా చేస్తూనే వున్నారు.

రమాపతిరావుగారు విశాలాంధ్రవారి మెప్పుకోసం ఆ గ్రంధంలో వీరేశలింగం గారి అవినీతిని గూర్చిన Libel కేసుకు మసిపూసి మారేడుకాయచేసే ప్రయత్నంలో దానినిగూర్చి చిన్న పెద్ద తప్పులు చాలావ్రాశారు. పెద్దాపురం డివిజనల్ మేజిస్ట్రేటుకోర్టులో జరిగిన కేసు మునసబుకోర్టులో జరిగినట్లు వ్రాశారు! ఆ కేసులో బారిష్టరు ప్రకాశంగారు వీరేశలింగంగారిని ఐదురోజులు క్రాసుపరీక్షచేసి మంగమ్మతో బెంగుళూరుకు ఆనాటి సెకండుక్లాసు coupe (పే) కూ రైలుపెట్టెలో ప్రయాణం చేశారని, బెంగుళూరులో మూడు నెలలొకే గదిలో పడుకునేవారని ఆమెవీపును తనునిమురుతూ వుండేవాడినని ఇంకా మరికొన్ని సంగతులు ఒప్పించగా ఆకేసు విచారించిన మేజిస్ట్రేటు వీరేశలింగం గారు అవినీతిపరుడని వ్రాసి ఆ కేసుకొట్టివేశాడు. ఈ సంగతులన్నీ ప్రకాశంగారి జీవితచరిత్రలో వివరించి యుండగా రమాపతిరావుగారు వాటినన్నిటినీ కప్పిపుచ్చి, కత్తిరించి వారువ్రాసిన మాటలకు వక్రభాష్యం చేశారు. వీరేశలింగంగారు క్రాసు పరీక్షలో ఒప్పుకొన్న సంగతులు పరమ యథార్థాలు: శిలాక్షరాలు. కాగా వీరేశలింగం గారిని నిందించిన వారేగాక ఆ నిందను నమ్మినవారుకూడా దుర్మార్గులని రమాపతి రావుగారు వ్రాశారు!

1980 సం॥లో రమాపతిరావుగారు హైదరాబాదులో నన్ను కలిసినప్పుడు ఇటువంటి తప్పుడు వ్రాతలు వ్రాయటం మర్యాదకాదని గట్టిగా మందలించినప్పటికీ ఆయన తమ తప్పులు దిద్దుకొనలేదు.

కమ్యూనిష్టులు వీరేశలింగం గారి స్వీయ చరిత్ర సంగ్రహమును 1971 సం॥లో ప్రకటిస్తూ దానికి కొడవటిగంటి కుటుంబరావు గారిని Editor గా నియమించి వీరేశలింగం గారి కాలం నాటి సంఘము కుళ్లిపోయిందని దానిని వీరేశలింగంగారొక్కరే సంస్కరించారని వ్రాయించి ముద్రించారు. ఇటీవల 1982 సం॥లో స్వీయచరిత్రను పూర్తిగా పునర్ముద్రణ చేయుటలో రమాపతిరావు గారిని Editor గా నియమించారు.



రమాపతి రావుగారు విశాలాంధ్రవారి ఇష్టాను సారంగా కొడవటిగంటి వారిపీఠికను పునర్ముద్రణం చేసి దాని కనుగుణంగానే తమ పీఠికను వివరణలను వ్రాసి, మసి పూసి మారేడుకాయ చేశారు! కొన్ని వాక్యాలను తీసివేసి, ఆస్థానంలో చుక్కలు పెట్టి రమాపతిరావుగారు తమ పరిశోధనా ప్రావీణ్యము కమ్యూనిష్టువారి చిత్తాను సారముగా కొనసాగిస్తూ ఇప్పుడు విశాలాంధ్రలో ఈ వ్యాసాలు ప్రకటించారు.

## రమాపతిరావుగారి నీతి నిజాయితీలు :-

నీతి నిజాయితీలు విమర్శకులు ఇతరుల గ్రంధాలనుంచి వ్యాసాలను ఉదాహరించడ ములో వానిని యథాతథంగా ముద్రిస్తారేగాని వానిని కత్తిరించి మార్చి కొంతభాగము మాత్రంముద్రించి దానికి వక్రభాష్యము చేయరు. రమాపతిరావు గారిలో నీతినిజాయితీలు లేనందువల్ల ఈ వ్యాసాలలో భారతిలో నేను 1926 సం॥లో వ్రాసిన ఆంధ్రవాఙ్మయ యుగములు, అనే పెద్ద వ్యాసములోని ముఖ్యమైన భాగాలను కత్తిరించి తమ దుర్వాదన కనుగుణముగా నుండునట్లు చివర కొంత భాగాన్ని మాత్రం ముద్రించారు. నేను వీరేశలింగం గారిని గద్యవాఙ్మయ యుగములో చేర్చి దానిని వీరేశంయులిగయుగమని చెప్పవచ్చునని వ్రాసియున్నాను గాని వీరేశలింగంగారిని నవయుగములో చేర్చ లేదు. అయితే రమాపతిరావుగారు "ఆంధ్ర సాహిత్యంలో వీరేశలింగయుగమని నేను వ్రాసినట్లున్నూ ఆయనను నవయుగ పురుషుడని వ్రాసినట్లున్నూ వక్రభాష్యం చేశారు. ఇలాగే ఆంధ్రకేసరి ప్రకాశంగారు తమ తమ్ముడైన శ్రీరాములుగారి పైన వీరేశలింగం గారు దాఖలు చేసిన Libel కేసును గూర్చి తమజీవిత యాత్రలో వ్రాసిన భాగాన్ని కత్తిరించి వక్రభాష్యం చేశారు. ఆమాదిరిగానే చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు వీరేశలింగం గారితో మంగమ్మగారికి గల సంబంధమును గూర్చి వ్రాసిన భాగాన్ని కత్తి రించి వక్రభాష్యం చేశారు. ఇంతేకాదు కామరాజు హనుమంతరావుగారి వివాహమును వీరేశలింగంగారు ఆపివేసి షరతులు విధించిన విషయమును గూర్చి చిలకమర్తి లక్ష్మీ నరసింహంగారు వ్రాసిన ఉదంతమును కూడా కత్తిరించి మార్చివేసి వక్రభాష్యం చేశారు. అలాగే మంగమ్మ విషయంలో వ్రాసిన దానిని కూడా కత్తిరించి మార్చివేసి, వక్రభాష్యం వ్రాశారు.

## రమాపతిరావుగారి అభూత కల్పనలు :

రమాపతిరావుగారి వ్యాసాలలో చాలా అభూత కల్పనలు చేస్తూ నేను కల్పనలు చేశానని నన్ను నిందిస్తున్నారు. రమాపతిరావుగారు చేసిన అసత్య కల్పనలలో స్పష్టంగా కనబడే వాటిలో కొన్నిటిని ఉదాహరిస్తాను :

ఏలూరి లక్ష్మీనరసింహంగారు వీరేశలింగం గారి Libel కేసు నాటికి పూర్వమే చనిపోయి వుండగా, రమాపతిరావుగారు 20-7-1986 తేదీన ప్రకటించిన వ్యాసంలో ఏలూరి లక్ష్మీనరసింహంగారు ప్రకాశం పంతులుగారికి చాలాదగ్గర వాడని, టంగుటూరి శ్రీరాములుగారికి మరింత ఆప్త, ఆప్త ప్రాణమిత్రుడై వుంటాడని అందుకే మంగమ్మ కేసులో వెనుకవుండి నాటకమాడించి ఉంటాడని వ్రాశారు! రమాపతిరావుగారి నోటికి శుద్ధి నిబద్ధిలేదు!! అబద్ధము బయల్పడినా సిగ్గులేదు.

27-7-86 తేదీ ప్రకటించిన వ్యాసంలో "మంగమ్మ కేసుకు శివరావుగారు 'మంగమ్మకథ' అన్నారని అందులో శివరావుగారు అద్భుత అతిమేధా ప్రదర్శక కల్పనలెన్నో చేశారని వ్రాశారు గాని ఆ కల్పనలేవో చెప్పలేదు. పైన చెప్పిన రమాపతిరావుగారి కల్పనలు కనబడుతునే వున్నవి గదా! ఆతేదీ వ్యాసములోనే, "వీరేశలింగంగారి భార్య చనిపోగా ఆయన విరోధులు ఆయనను ఎలాగైనా బాధపెట్టాలని, లొంగదీయాలని యశోహాని కలిగించాలని శీల నిర్మూలనము కలిగించడానికి విరోధులు కృత నిశ్చయులైనారని వ్రాశారు. ఈ విరోధులెవరో చెప్పలేదు. బహుశా ఏలూరి లక్ష్మీనరసింహంగారు చనిపోయిన సంగతి ఈలోగా తెలిసినందున వారిని పేర్కొనలేదనుకుంటాను. నిజానికి ఆయన స్నేహితులే విరోధులైనారు. వీరేశలింగం గారికి ముఖ్య స్నేహితులైన దామెర్ల వెంకట రమణారావుగారుకూడా ఆయనపై వచ్చిన అపవాదులను మొట్టమొదట నుండి నమ్మి శ్రీరాములుగారు వీరేశలింగంగారి పైన దాఖలు చేసిన Libel కేసులో శ్రీరాములుగారి పక్షమున సాక్ష్యము ఇచ్చారని చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు వ్రాశారు కదా! (వీరేశలింగంగారు 'దేశమాత'లో వ్యాసము వ్రాసి తమకు పరువునష్టం కలిగించారని 1913 జూలైలో శ్రీరాములుగారు వీరేశలింగంగారి పైన కేసు దాఖలు చేశారు.) అటు తరువాత అక్టోబరులో వీరేశలింగంగారు Libel కేసుదాఖలు చేశారు) విరోధి వర్గంలోని రమణరావుగారిని పంతులుగారు సలహా అడిగినారని రమాపతిరావుగారు వ్రాశారు!

4-7-1986 తేదీ ఆంధ్రజ్యోతిలో రమాపతిరావుగారు ఇలాగ వ్రాశారు. "మంగమ్మ పంతులుగారికి సపర్యలు చేస్తూవుండేది. ఏ విధంగా ఆ పుకారు ఎందుకు పుట్టిందోనని పంతులుగారు ఊరికి దూరంగా ఉంటున్న ఆనందో ద్యానవనంలో ఉండటం, ఆయనతోపాటు మంగమ్మ ఉండటం, వితంతు శరణాలయంలోని ఇతర వితంతువుల అసూయకు అపార్థాలకు కారణమైందో ఏమో మంగమ్మతో పంతులుగారికి తగని సంబంధం ఏదో ఏర్పడిందని పుకారు పుట్టింది. ఆ పుకారు ఊళ్ళోకి వ్యాపించింది.



చిలకమర్తిస్వీయచరిత్రలోయీవిషయం ప్రస్తావిస్తూ దీనిని 'కొందరు నమ్మారు కొందరు నమ్మలేదు. నేను చాలామంది మిత్రులతో వాకబుచేసి చర్చించి యీ అపవాదును నమ్మలేదు" అని చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు వ్రాసినట్లుగా రమాపతిరావుగారు వ్రాసిన ఈ చివరిమాటలు చిలకమర్తివారి మాటలకు విరుద్ధంగా ఉన్నాయి. రమాపతిరావుగారు బుద్ధి పూర్వముగా ఆ మాటలను తమకు అనుకూలంగా మార్చి వేసి వ్రాశారు. వీరేశలింగంగారితో బాల్యం నుండి కలిసిమెలిసి పనిచేసిన వారితో మాట్లాడి సంశయములను దీర్చుకుని, వారి వయస్సును బట్టి, ఆరోగ్యం బట్టి, వారి పూర్వ చరిత్రను బట్టి, అటువంటి అపవాదులను విశ్వసింపకూడదని నిశ్చయించు కున్నానని చిలకమర్తివారు వ్రాయగా వారు వ్రాసిన దానిలో చివరిమాటలు తీసివేసి వాటికి బదులుగా రమాపతిరావుగారు "ఈ అపవాదులను నమ్మలేదు" అని చిలకమర్తివారు వ్రాసినట్లుగా ఉదాహరించుటే గాక, ఏ కారణములచే వారు విశ్వసింప కూడదని అనుకున్నారో తెలియజేయు మాటలను మూలం నుండి తొలగించి నమ్మలేదు అని మాత్రం Positive assertion గా ఢంకావేసి మరీ చెప్తున్నారు. దీనినే Literary Forgery అంటారు.

ఆ వ్యాసంలోనే రమాపతిరావుగారు మళ్ళీ ఇలావ్రాస్తున్నారు. "ఒకవేళ వాదంకోసం చివరిదశలో ఆయన మానవీయమైన బలహీనతకు లోనైనారనే అనుకున్నా 50 సం॥ సంఘసంస్కరణకు ఆయనచేసిన ఘనమైనకృషి కొట్టబడి పోతుందా? అనివ్రాశారు.

ఈ మాటలే వెలుగునీడలలో నేను వ్రాశానుగదా! రమాపతిరావుగారికి ఇప్పటికి జ్ఞానోదయమైనదని తోస్తుంది.

ఈ రమాపతిరావుగారే 27-5-1986 తేదీ ఆంధ్రప్రభలో ఇంకొక విధంగా వ్రాశారు. "తన ఇల్లాలు బ్రతికి యున్నప్పటినుంచీ తమవద్ద చనువుగా మెలగిన మంగమ్మను ఆయన తపరక్షణనిమిత్తము ఎన్నుకున్నారు. ఇది తక్కినవితంతువులకు అసూయాజనకమైంది. మంగమ్మకు పంతులుగారు పెళ్ళిచేశారు. ఆమెగర్భవతి అయింది. ఇదంతా వితంతుశరణాలయంలోని దురదృష్టవంతురాండ్రకు అసూయామాత్సర్యకారణం కాదా? ఈ మంగమ్మ కేసునుగూర్చి ప్రకాశం పంతులుగారి స్వీయచరిత్రలో వివరంగా ఇచ్చారు. ఇది జరిగి డెబ్బై ఏళ్ళు గడిచాయి. మళ్ళీ ఇప్పుడెందుకు." అనివ్రాశారు. మంగమ్మ తనవద్ద చనువుగా మెలగేదని పంతులుగారు వ్రాయలేదు. చిలకమర్తివారువ్రాశారు. పంతులుగారు వ్రాయన్నిమాటను చిలకమర్తి వ్రాయటంలో ప్రాధాన్యముంది.

15.6.1986 తేదీ 'విశాలాంధ్ర'లో మంగమ్మకేసునుగూర్చి "ఇదమిద్ధమని ఎవరుచెప్పగలరు? అని వ్రాస్తూ తేలవేశారు! ఇలాగ ఒకమాటు వ్రాసినదానికి ఇంకొక మాటు వ్రాసిన దానికి పొంతనలేదు.

"తెలుగులో మొదటి నాటకం నేనేవ్రాశాను. మొదటినవల మొదటి ప్రహసనం నేనేవ్రాశానని వీరేశలింగంగారు స్వీయచరిత్రలో రెండవభాగం రెండవప్రకరణంలో వ్రాసినమాటలు అబద్ధమని నేను వెలుగునీడలులో నిరూపించియుండగా రమాపతిరావుగారు 1-6-1986 విశాలాంధ్రలో "పంతులుగారు భార్యపోయి, ఆశాభంగవాతావరణంలోఎటుచూసినా వ్యతిరేకత అవమానాలు అభియోగాలతో మానసిక స్వస్థతలేక నేనిదిచేశాను నేనదిచేశాను అని సాంత్వనం కలిగించుకోవడం తప్పుపడతారా ? అని సమర్థించటానికి ప్రయత్నిస్తున్నారు! ఈ స్వీయచరిత్ర రెండవప్రకరణం వీరేశలింగంగారు 1913సం॥ం వేసవికాలంలోమే, జూన్ నెలలలో బెంగుళూరులో ఉన్నప్పుడు వ్రాశామని స్వీయచరిత్ర అవతారికలో వ్రాసియున్నారు. అప్పుడాయన మంగమ్మ సంరక్షణలో కులాసాగా ఉన్నారు. అప్పటికింకా ఎటుచూచినా వ్యతిరేకతాలేదు, అభియోగాలంతకంటేలేవు. తమపైనగల అపవాదులను గూర్చి చాలాధీమాతో ఉత్తరాలు వ్రాశారు. రాజమంద్రి తిరిగి వచ్చినతరువాత libel కేసును శ్రీరాములుగారిపైన దాఖలు చేశారు. 10-1-1914 తేదీన F.N. Stewart జడ్జిఆయన అవినీతి పరుడని కేసుకొట్టివేసేవరకు మానసిక స్వస్థత తప్పలేదు.

అభిజ్ఞానశాకుంతలమునుగూర్చి వ్రాస్తూ పంతులుగారు దానిని 1876 సం॥లో వివేకవర్ధనిలోప్రకటించామని అందువలన మొదటి నాటకమును తామే రచించామని వ్రాశారు. రమాపతిరావుగారే 1859 నాటికే పరవస్తు వెంకటరంగాచార్యులుగారు అభిజ్ఞాన శాకుంతలం వ్రాసినట్లు వెలువరించినట్లు పురిపండ అప్పలస్వామిగారు రంగాచార్యులుగారి జీవితంలో వ్రాశారు. అంతేగాదు. 1876లో రచించారని లోగడ తాముచెప్పి, యిప్పుడు ఆ అభాగ్యోపాఖ్యానాన్ని పంతులుగారు పురుషార్థప్రదాయిని వాసనతగలక ముందే అనగా, 1872కు ముందేవ్రాశారని అసత్యం వ్రాశారు. అలా ఆ తొలి అధిక్షేపక కావ్యం కాదనుకొంటున్నారు.

## వేమనను గూర్చి వెటకారం

వీరేశలింగంగారు ఇంగ్లీషు విద్యావిధానంలో విద్యనేర్చి పాశ్చాత్య నాగరికతనభిమానించినవారని, భారతదేశాన్ని దాస్యంలోముంచి ఆర్థికంగా కొల్లగొంటూ వైజ్ఞానికంగా అధోగతిలో నుంచిన బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఆశ్రయించి బ్రతికినవారని దానివల్ల చాలా లాభాలు పొందినవారని, ఆయన వారి మెప్పుకోసం హిందూమతధర్మాలను దుయ్యబట్టినారని, వారి విమర్శలలో స్వార్థమున్నదని - వేమన స్వతంత్రుడు మన మత ధర్మాలను పూర్వాచారాలను నిస్వార్థంగా మనమతం మనతత్వం ఆధారంగానే విమర్శించి సంస్కరించడానికి ప్రయత్నించాడని, సామాన్య గ్రామ ప్రజలను అట్టడుగు వారిని ఉద్ధరించడానికి ప్రయత్నించినాడని, వీరేశలింగంగారు ధనికాభీన పరిపాలకులకు, సంపన్న వర్గానికి చెందిన బ్రాహ్మణ సంఘసంస్కర్తయని



నేను వెలుగునీడలలో వ్రాసి, సుప్రసిద్ధ చరిత్రాచార్యులైన పట్టాభిరామిరెడ్డిగారు వీరేశలింగం గారికన్న వేమన గొప్పవాడని, వీరేశలింగంగారు దోహదం చేసినది Comprodore Renaissance అనివ్రాసిన లేఖను ప్రశంసించగా, ఒక కమ్యూనిస్టువర్గం చెప్పుచేతలలోనున్న రమాపతిరావుగారికి నామీదకోపం వచ్చి ఈవ్యాసాలలోనన్ను దూషించారు. వేమనను మార్క్సిస్టు అని నేను చెప్పినట్టు కూడా కల్పించారు !! ఇంతేకాదు వేమనపైనమీకింతప్రీతి ఎలాకలిగింది ? ఎప్పటినుండి కలిగింది ? అని ప్రశ్నిస్తున్నారు. అక్కిరాజు వంశములోని మహావిద్వాంసుడైన అక్కిరాజు ఉమాకాంత విద్యాశేఖరులు 1920 సం॥లో మద్రాసురాజధాని కళాశాలలో తెలుగుపండితులై ఆకాలేజీలో బి.ఏ. ప్యాసైనవిద్యార్థుల వ్యాసరచనపోటీలో పోతనవేమనల రచనలను వ్యాసవిషయంగా నిర్ణయించగా నేనురచించినవ్యాసానికి 1922 సం॥లో నాకే రు. 150ల ప్రథమ బహుమతి వచ్చింది.అప్పటినుండి వేమనయోగిపై నాకు ప్రీతికలిగిందని రమాపతిరావుగారికి మనవి చేస్తున్నాను.

రమాపతిరావుగారు కళ్ళు తెరవకముందే శ్రీ ఉమాకాంతంగారు రచించిన నేటికాలపు కవిత్వమనే ఉద్గ్రంధములో కూడా వేమననుగూర్చి ప్రశంసించి యున్నారు (చూ. వేదాంతికవిత్వము) 1923 స॥ న చెన్నపట్నంలో జరిగిన ఒకసభలోకూడా వేమనను ప్రశంసించారు. (చూ. వెలుగునీడలు) వీరేశలింగంగారి కన్నా వేమన వెయ్యిరెట్లు గొప్పవాడని చెప్పండని రమాపతిరావుగారు నన్ను ఎద్దేవ చేశారు.

వీరేశలింగంగారు బ్రిటిష్ప్రభుభక్తి పరాయణుడు కాదన్నారు. జాతీయవాది అన్నారు. అందుకు నిదర్శనంగా వీరేశలింగంగారు బ్రిటిష్ అధికారులను, పాశ్చాత్యులలో ప్రబలియున్న త్రాగుడు మొదలైనవానిని విమర్శించారని వ్రాశారు. బ్రిటిష్ప్రభుత్వమువారి అడుగులకు మడుగులొత్తేవారుకారని అధికారులనుకూడా విమర్శించారని వివేకవర్ధని పత్రికావిమర్శలను చూపించి నేనన్నీ అబద్ధాలు వ్రాశానన్నారు. వందేమాతరం జాతీయోద్యమాన్ని తిట్టిపోస్తూ బ్రిటిష్ ప్రభుత్వముపట్ల భక్తిని ప్రబోధిస్తూ వీరేశలింగంగారు స్వీయచరిత్ర Ist Edition volumeII పుటలు 269-284 లో వ్రాసిన సంగతులుచూస్తే ఎవరు అబద్ధాలు వ్రాసిందీ బయటపడుతుంది. [ఆభాగాన్ని, మరికొన్నింటిని యీ పుస్తకంలోనే పాఠకుల రెడీరిఫరెన్సుకై యిస్తున్నాం.]

## రమాపతిరావుగారు చెప్పలేనివి

రమాపతిరావుగారు వ్రాసిన వ్యాసాలలో వెలుగునీడలపై నిజమైన విమర్శంటూ దీలేదు. నా రచనలోఆయన చూపిన అసత్యాలు లేవు. అర్ధసత్యాలు అంతకంటేలేవు. అప్రస్తుతప్రసంగాలతో, హేళనలతో అబద్ధాలతోవిశాలాంధ్రపేజీలు మాత్రమునింపారు. నాగ్రంధములో వివరించిన ముఖ్యాంశాలకు సమాధానము చెప్పలేకపోయారు.

(1) వీరేశలింగంగారు తమకాలమునాటి దేశపరిస్థితులవల్ల ప్రభావితులైన బ్రాహ్మణ సంఘసంస్కర్తయేగాని తనకాలమునాటి దేశపరిస్థితులను ప్రభావితము చేసిన యుగపురుషుడు కాదని నేనువ్రాసినదానికి రమాపతిరావుగారు జవాబుచెప్పలేదు.

(2) వీరేశలింగంగారు తమగొప్పదనము చాటుకొనుటకే స్వీయచరిత్రవ్రాశారని, అందులో ఆత్మస్తుతి పరనిందచేశారని నాగ్రంథములో వివరించిన కొద్ది ఉదాహరణలకు కూడా సమాధానాలు లేవు.

(3) వీరేశలింగంగారు తమ జీవితములో తీర్థము స్వార్థముఅనే రెండు ప్రయోజనాలను దృష్టిలోనుంచుకొని అనేక కార్యాలు జరిపించారేగాని నిస్వార్థంగా ఏదీచేయలేదనే నావిమర్శకు సమాధానము లేదు.

(4) వీరేశలింగంగారి ఉపాధ్యాయత్వమును గూర్చి వారిదగ్గర చదివిన వల్లూరి సూర్యనారాయణరావుగారు, దాసువిష్ణురావుగారు చేసిన విమర్శలకు జవాబు లేదు.

(5) గురజాడ అప్పారావుగారు వీరేశలింగంగారిని గురించి ఆయన అనుచరు లనుగురించి 7-4-1895 తేదీన ఆయన డైరీలో కఠినంగా విమర్శిస్తూ వ్రాసిన దానికి సమాధానంలేదు.

(6) గురజాడవారు కన్యాశుల్కంలోను, కొండుభట్టీయంలోను వీరేశలింగం గారిని, వారికార్యకలాపాలను వారి అనుచరులను గూర్చి హేళనచేస్తూవ్రాసినదానికి జవాబు లేదు. “చేస్తే చెయ్యనియ్యండి” అని వూరుకొన్నారు రమాపతిరావుగారు !

(7) వీరేశలింగం గారు కక్కుర్తిగా వితంతు వివాహాలు జరిపేవారని, శరణా లయంలోని వితంతువు, గుడిపాటి వెంకట చలంగారి మేనత్త చేసిన విమర్శలకు జవాబులేదు.

(8) వీరేశలింగం గారు కామరాజు హనుమంతరావుగారి పట్లచేసిన అన్యాయ ములను గూర్చి కామరాజు హనుమంతరావుగారు, చిలకమర్తివారు వ్రాసిన దాని సమాధానం లేదు.

(9) వీరేశలింగంగారి గ్రంథచౌర్యం గురించి వివిధగ్రంథముల లోనికిఉదా హరణలకు సూటియైన జవాబులేదు.

(10) హితసూచని లోని చర్చలను పురుషార్థప్రదాయినిలోని చర్చలను గూర్చి ఉదాహరించిన వివిధాంశములకు జవాబులేదు.

(11) వేటూరి ప్రభాకరశాస్త్రిగారి విమర్శలకు జవాబులేదు.

(12) బంగోరె ప్రకటించిన చంద్రిక గ్రంథము చదవకుండానే రమాపతిరావు గారు వ్యంగ్యం లేదన్నారు. బంగోరెయే ఒప్పుకొన్న విషయం.



(13) లియొనార్డు పరిశోధనాగ్రంథములో నుండి ఉదాహరించిన వివిధవిమర్శలకు సమాధానము లేదు.

(14) A sensational case of Defamation అనే శీర్షికతోవ్రాసిన దానిలోని సంగతులకు జవాబులేదు. కేసులోతులు మెలికెలు అర్థమేకాలేదు.

(15) మంగమ్మ కథలోని వివిధాంశాలకు జవాబులేదు.

(16) అభినవ అజామిళోపాఖ్యానమనే ప్రకరణములోని విషయాలకు జవాబు లేదు.

(17) 'Compradore Renaissance' అనే నా ఇంగ్లీష్ వ్యాసములోని విషయాలకు జవాబులేదు.

(18) Report on Adult Girls School in Madras Journal of Education (1869) అనేదానికిసమాధానం లేదు.

(19) వీరేశలింగంగారి బ్రాహ్మణీకం బ్రాహ్మమతం అనే ప్రకరణములోని వివిధాంశాలకు సమాధానాలు లేవు.

(20) త్రిపురనేని వెంకటేశ్వరరావుగారు రచించిన హితసూచని నుండి హితకారిణికి' అనేపీఠికలోని విషయాలకు సమాధానాలు ఆఖరున చెపుతామని చెప్ప కుండానే దాటేశారు. ఇంకా అనేక విషయాలను కూడా దాటేశారు. ఇందులో చెప్పిన సంగతులకన్న చెప్పవలసిన వెన్నోవున్నాయి. చెయ్యవలసిన విమర్శ ఎంతో వున్నది. కొత్త కోణంలో చూడవలసినవీ వున్నవి. ఇంతకు రెండింతలు యిప్పటికే వ్రాసివుంచాను. ఇంకా వ్రాస్తున్నాను. ముద్రణే కొరతగా వున్నది. పంతులుగారిపై ఎంతో పరిశోధన జరగవలసివుంది.

ఓం జ్ఞానానందార్పణమస్తు - ఓ వీరేశలింగార్పణమస్తు

# ఓం విశాలాంధ్ర పత్రికాయనమః

## — శ్రీ దిగవల్లి వెంకట శివరావు

వీరేశలింగం పంతులుగారిని గూర్చి పరిశోధించి వ్రాసిన గ్రంథానికి ఉస్మానియా విశ్వవిద్యాలయం వారు P.hd బిరుదును ప్రసాదించినందువల్ల సాహిత్యలోకంలో ఒకస్థానమేర్పడిందనే విశ్వాసం కలిగినందువలన వీరేశలింగంగారిపట్ల గురుభావంతో గ్రంథాలు వ్యాసాలూ వ్రాస్తూవున్న రమాపతిరావుగారిలో ఎలావచ్చిందో గాని గొప్ప మార్పు వచ్చినట్లుంది! ఇటీవల ఆయన పశ్చిమ గోదావరి జిల్లాలో గొరగనమూడి గ్రామంలో క్షత్రియ కుటుంబములో జన్మించి సన్యసించి ప్రాశ్చాత్యదేశాలలో విద్య నేర్చివచ్చి 1969లో సిద్ధిపొందిన జ్ఞానానందస్వామివారికి వారిమరణానంతరకాలపుశిష్యులై వారు ఆదిశంకరుల అపతారమూర్తియని మహాఋషియని అవధూతయని ప్రశంసిస్తూ 19-8-1984 తేదీ ఆంధ్రప్రభలో పెద్దవ్యాసం ప్రకటించి, 12-12-1985 తేదీన జరిగిన [స్వామివారి ఆరాధనోత్సవాలలో పాల్గొని] శ్రీమత్ జ్ఞానానంద ఆరాధనోత్సవాలలో పాల్గొని "శ్రీమత్ జ్ఞానానంద జీవిత చరితామృతమ్" అనే పెద్ద గ్రంథానికి సంపాదక పరిష్కర్త అయినారు!! స్వామివారిని గూర్చి ఉపన్యసించడము, పత్రికలలో వ్రాయడం, భజించడం ప్రచారం చేయడం వారి కొత్త ఉద్యోగముగా వున్నది.

"శ్రీస్వామి జ్ఞానానంద తెలుగుదేశంలో పుట్టడం తెలుగువాళ్ల గొప్ప అదృష్టం. మహద్భాగ్యం. దేవతలకు తెలుగుదేశంపై ఎంతప్రీతి ఉన్నదో అని అనిపిస్తుంది ఈ సంఘటన. భారతదేశ ఆధ్యాత్మిక పథయాత్రలో అపూర్వము, అతులితము అయిన సన్నివేశం జ్ఞానానంద అవతరణం.

ఒక వెయ్యి సంవత్సరాల చరిత్రలోనే ప్రాముఖ్యంగల ఘట్టం స్వామివారి జననం. విశ్వవిజ్ఞాన శాస్త్రీయప్రాముఖ్యంగల గొప్ప శాస్త్రవేత్త శ్రీస్వామి. అంతేకాదు, అలనాడు ఆదిశంకర భగవత్పాదులవలెను, ఆధునికులలో శ్రీరమణ మహర్షివలెను గొప్ప జ్ఞాని. ఆరూఢ పరతత్వాను భూతి సాధించిన సంయమి ఋషి పుంగవుడు. ఉన్నతోన్నత ఆధ్యాత్మిక తపోవిభవుడు. అవధూత" అని 19-8-1984తేది ఆంధ్రప్రభలో వ్రాశారు. ఇంతేకాదు, వారింకా ఇలావ్రాశారు:-

"హేతువాదులు, నాస్తికులు, ప్రత్యక్ష ప్రమాణవాదులు నిరీశ్వరవాద ప్రచారకులు, అజ్ఞేయవాదులు, కార్యకారణవాదులు ఎందరెంతప్రచారం చేసినా - భారతదేశంలో శంకర భగవత్పాదుల నాటినుండినేటివరకు తెలిసినచరిత్రలో ఈ కంటికి కనబడని మూలతత్వాని



వీక్షించి పరమార్థం తెలుసుకున్న మహనీయులెందరో ఉన్నారు. ఆధునికులలో రామకృష్ణ పరమహంస, స్వామి వివేకానంద, స్వామిరామతీర్థ మొదలైనవారి శ్రేణిలోని మహనీయులుస్వామిజ్ఞానానంద.వీళ్లకెవరికీలేని విలక్షణతకూడాస్వామిమూర్తిమంతంలో కనబడుతుంది. అది ఏమిటంటే-ఆధునిక ప్రపంచపు ఉనికిని నేడు శాసిస్తూన్న పరమాణు విజ్ఞాన (న్యూక్లియర్ ఫిజిక్సు) శాస్త్రవేత్తలలో శ్రీస్వామివారికి విశిష్టమైన స్థానమున్నది. ఇది అపూర్వము, అత్యద్భుతము, పరమాశ్చర్యకరమైన విషయం" అటుతరువాత రమాపతిరావుగారు జ్ఞానానందస్వామివారి మహిమలను, బోధలను గూర్చి ఉపన్యసిస్తూ 'జ్ఞానానందార్పణమస్తు' అని ముగించారు. కాని ఒక్కటేలోపము. స్వామివారు సాధించిన జ్ఞాన విజ్ఞాన సమన్వయ సూత్రసూక్ష్మలను [Synthesis of Empiricism and Transcendentalism] గూర్చి చెప్పడం మరచిపోయారు. ఆలోపాన్ని మున్ముందు పూరించుకొని మనకావిషయాలను కూడా బోధించడానికి వెనకాడరను కొంటాను.

శ్రీజ్ఞానానందస్వామివారు క్షత్రియులు. అసలు పేరు భూపతిరాజు లక్ష్మీనరసింహ రాజుగారు. 1921సం॥లో సన్యసించారు. కానిఅటుతరువాత పాత సన్యాసాశ్రమ సంప్రదాయమునకు విరుద్ధముగా పాశ్చాత్యదేశాలలో విద్య నభ్యసించి సేవకావృత్తి నవలంబించారు. అనగా ఉద్యోగస్థులై జీవయాత్ర సాగించారు.

స్వామి ఆంధ్ర విశ్వవిద్యాలయములో న్యూక్లియర్ ఫిజిక్సు అధిపతిగావుండేవారు. పశ్చిమగోదావరి జిల్లా గొరగనమూడి కాపురస్థులైన శ్రీభూపతిరాజు శ్రీరామరాజు గారి కుమారులు. వీరు 1896సం॥లో జన్మించారు. వీరు వీరవాసరం, తణుకు, నరసాపురం, పాఠశాలలలో చదివారు. ఒకమహారాష్ట్రి స్వామివల్ల 12వఏట శ్రీకృష్ణమంత్రోపదేశం పొందారు. చిన్నప్పుడేవివాహ మైనదిగాని సంసారజీవితం గడపలేదు. 1921సం॥లో ఆశ్రమం స్థాపించారు. వీరు అటుతరువాత పాత సన్యాసాశ్రమమునకు విరుద్ధముగా పాశ్చాత్య దేశాలలో విద్యనభ్యసించి ఉద్యోగముచేశారు. వీరు ఇంగ్లీషులో అనేక గ్రంథాలురచించారు. వీరు రచించిన దార్శనిక మహాప్రవచనగ్రంథానికి సర్వేపల్లి రాధాకృష్ణగారు పీఠికవ్రాశారు.

జ్ఞానానందస్వామి కుటుంబమువారుసంపన్నులు. వీరు గొరగనమూడిగ్రామంలో శ్రీరామ జ్ఞానమందిర పబ్లికేషన్ లీగ్ అనే సంస్థను స్థాపించి స్వామివారి గ్రంథాలను ప్రకటిస్తున్నారు.

ఇటీవల 'జ్ఞానానంద జీవిత చరితామృత' మనే మూడు వందల పుటల పైబడినగ్రంథాన్ని అనేక చిత్రపటాలతో హైదరాబాదులో రమాపతిరావు గారి సంపాదక పరిష్కరణ క్రింద ప్రకటించారు. దానివెల రు. 25/ లు. దీనికి రమారమి 25 వేల రూపాయలకు పైనే ఖర్చుపెట్టి వుంటారు. ఈ గ్రంథము 12-12-1985 తేదీన ప్రకటింపబడినది. దీనితోపాటు రమాపతిరావు గారు స్వామివారిని గూర్చి వ్రాసిన వ్యాసము' వారి

వర్ధంతి సభలలో చేసిన ఉపన్యాసములను కలిపి ఒక చిన్న గ్రంధముగా ప్రకటించారు. రమాపతిరావు గారు ఈ గ్రంధములను నాకు బహూకరించి యున్నారు. రమాపతిరావు గారి జీవితము ధన్యమైనది. ఆయన వీరేశలింగం గారి కృతక పరిశుద్ధాస్తిక మతము నుండి రాహుగ్రస్తమైన సూర్యుని వలె విముక్తి చెందారనుకొంటున్నాను.

రమాపతిరావు గారు జ్ఞానానందస్వామి మతంలచేరుటకు కుదిరిన తరువాత 1936 జనవరి నెలలో శ్రీ బమ్మెర పోతనామాత్యుని శ్రీ మదాంధ్ర మహా భాగవతంలోని శ్రీమన్నారాయణ కవచంను వ్యాసభగవానుని మూలంతో సరళార్థ తాత్పర్య సహితంగా తమతాతయ్యగారైన అక్కిరాజు చిన పేరయ్యగారికి పుణ్యలోక ప్రాప్త్యర్థం రచించి "ఓం శ్రీ జ్ఞానానందార్పణమస్తు" అని శ్రీరామ జ్ఞాన మందిర పబ్లికేషన్సు వారి జ్ఞాన విజ్ఞాన గౌరగనయూటి వారి పుస్తకంగా ప్రకటించారు. దీనివెల రు. 2లు. ఇందులో శ్రీ పోతనామాత్యుని పద్యాలు చాలాఉన్నవి. ఈ చిన్న గ్రంధానికి క్రోధన సంవత్సర సంక్రాంతినాడు 14-1-1936 తేదీన రమాపతిరావుగారు వ్రాసిన పరిచయంఅనే శీర్షికలో మన మత ధర్మాలను గూర్చి వ్రాసి శ్రీమన్నారాయణ కవచం పారాయణం చేసి ఇంద్రుడు తన కష్టాలన్నీ పోగొట్టుకున్నాడు: ఈకవచం పారాయణం చేస్తే శ్రీమన్నారాయణ మూర్తి ప్రీతుడై మానవులకు శుభం ప్రసాదిస్తాడు అని వ్రాశారు.

రమాపతిరావుగారికిప్పుడు ఏబదియేళ్ళ వయస్సు వచ్చింది కనుక ఆయనలో యిటువంటి సనాతనాధ్యాత్మిక భావోదయం కలిగితే ఆశ్చర్యంలేదు. కలగవలసిందే.

కాని రమాపతిరావుగారికేదైనా ఒకే ఒక మతంలో విశ్వాసం అంటూ ఒకటి వున్నదా అనేఅనుమానం కలుగుతున్నది. వీరేశలింగంగారిపరిశుద్ధఆస్తిక మతమెక్కడ? బమ్మెర పోతనామాత్యుని శ్రీమన్నారాయణ కవచమెక్కడ ? దానిని పఠించినట్లయితే యింద్రునికి కష్టాలు తొలగినట్లే మానవులమైన మనకందరకూ తొలగుతాయనట మెక్కడ ? ఇంద్రాది దేవతలలో విశ్వాసమేమిటి, పంతులుగారి ఏకేశ్వరారాధన మేమిటి ? తండ్రిగారిపుణ్యలోకాలేమిటి ? పంతులుగారి బ్రహ్మసమాజమేమిటి ? పరస్పరవిరుద్ధమైన విశ్వాసాలుగల వీరేశలింగం, జ్ఞానానందస్వాములవార్లనుగూర్చి ఈ 1986వ సంవత్సరం లోనే వ్రాస్తున్నారుగదా ! ఓం జ్ఞానానందార్పణమస్తు వరకు వెళ్ళిపోయారు ! అదే సమ యంలోనాస్తికులు హేతువాదులు అయిన కమ్యూనిస్టులకు కావలసినట్టుగావీరేశలింగాన్ని గూర్చి వారి పత్రికలకు వారి ప్రచురణాలయాలకు ఈ జ్ఞానానందార్పణమస్తు అనేవారు వ్రాయుట ఎటువంటిది ? ఈ మహానుభావుడే "భాగవత సప్తాహాలు నిర్వహించ లేనని తప్పుపడతారా ? లేక పీఠాధిపతుల దగ్గరచేరి సత్యం శౌశీల్యం అద్వైత్వతం అని డప్పాలుకొట్టలేదని పంతులుగారిని విమర్శిస్తారా ? అంటూనాపై దూకి విశాలాంధ్ర వారిని సంతోషపెట్టుతున్నారు. ఇటువంటిరెండునాల్కల వారిచేత,ఇంతమూఢ విశ్వాసాలు గలవారిచేత కమ్యూనిస్టులు వీరేశలింగంగారిని గూర్చి వ్రాయించుకోవడమేమిటి ? అర్ధ



శతాబ్దంపైగా పంతులుగారిని తమ పార్టీ ప్రచారంలోపెట్టినట్టి కమ్యూనిస్టులకు తమ పార్టీ రచయితలెవ్వరూ లభించకపోయారా? ఇలా ఎవరికి కావలసినరీతిలో, వారికెల్ల వ్రాసేరాయసముగా తయారైనరమాపతిరావుగారికి ఫీజు చెల్లించుకొనివ్రాయించుకోవలసి నంత దుస్థితి ఏర్పడినదన్నమాటేగదా ! వీరేశలింగంగారిని గూర్చి సమర్థన వ్రాసుకో లేనికమ్యూనిస్టుపార్టీ,వారిరచయితల సంఘంవీరేశలింగంగారిని మూఢ భక్తితోఆరాధించు చున్నట్టుగా ఒప్పుకొన్నారని రుజువయినట్లేగదా ! నాస్తికులు-హేతువాదులు కావలసిన కమ్యూనిస్టులు ఇంద్రాది దేవతలను, శ్రీమన్నారాయణ కవచపు మంత్రాలను నమ్మి జ్ఞానానందార్పణ మస్తు అనునట్టి ఛాందసులకు పంతులుగారి విషయమై వకాలత్ యిచ్చుకొనరావటం ఎంతదుర్గతి పాలయ్యారోతెలుస్తున్నది. వారుచేసే వీరేశలింగంపూజ కూడా ఒక మూఢవిశ్వాసంగా మారిపోయిందనడానికి యింతకన్నా వేరేమికావాలి ? వీరేశలింగంగారిని సమర్థించడానికి శక్తిలేని కమ్యూనిస్టుల వద్దయిక వున్నశక్తి ఏమిటంటే వీరేశలింగ జీవితకృషి సమీక్షకులను అంగుష్ఠమాత్రులు, వెకిలివెంగళాయలు, కుక్కగొడుగులు అనే రొచ్చుకూతలు కూయటం మాత్రమేయని లోకానికి విశదమ యింది. జ్ఞానానందమతంవారినీ కమ్యూనిస్టుమతంవారినీ యిద్దరినీ క్లయింటులుగా పొందగలిగిన రమాపతిరావుగారి ప్రజ్ఞకు జేజేలు చెప్పవలసిందే !

# అశక్తుని ఆక్రోశము, అబద్ధాలు

వై. వి. హనుమంతరావు

**B. A. LL.B.**

విజయవాడ.

వందేమాతరం మహత్తరమైన వుద్యమం. తెల్లదొరతనాన్ని మొదలంటా మొదటిసారిగా కదిపివేసిన వుద్యమం. బిపిన్‌చంద్రపాల్ ఉపన్యాసాలతోనే ఆంధ్రలో జాతీయోద్యమం చురుకెక్కడం దీనివల్లనే. అప్పటి వుద్యమంలో సాటిలేనిమేటి హరిసర్వోత్తమరావే. అందులో తలమానికమైనఘట్టంఆయన పైమోపిన రాజద్రోహనేర విచారణ- శిక్ష. జిల్లా కోర్టు విధించిన ఆరునెలల శిక్షను, ప్రభుత్వం హైకోర్టుకు వెళ్ళి మూడేళ్ళకు పెంచుకొని తక్కువ శిక్ష చెప్పినందుకు ఇండియన్ పార్శీ జడ్జి పి.కెర్‌షాస్పు ఐ. సి. యస్. పదవిని తక్కువ చేయడం-అతడు అసలుకే రిజైన్ చేయడం.

ఆ ఘట్టం ఆంధ్రుల జాతీయ పోరాటంలో పెద్ద మలుపు. ఆ జడ్జి కెర్‌షాస్పు తీర్పు ఎంత గొప్ప విషయం అయ్యిందంటే, ఆంధ్రి జాతీయోద్యమకారులే దానిని 80 పేజీల పుస్తకంగా పావలా వెలపెట్టి ప్రచురించి, ప్రచారంలో పెట్టివున్నారు.

ఆ కేసులో ప్రాసిక్యూషన్ తరపున వీరేశలింగంగారూ, డిఫెన్స్ తరపున అనగా హరిసర్వోత్తమరావు తరపున సమర్ధి రంగయ్య చెట్టిగారు- వీరు మద్రాసు క్రిస్టియన్ కాలేజి ప్రొఫెసరు, పంతులుగారి మిత్రుడు - సాక్షులు. స్వరాజ్య పత్రికా వ్యాసాలు మూడింటిలో వాడిన పౌరాణికమైన దేవరాక్షసుల యుద్ధ గాధలవివరణకు వాక్యాల నిర్మాణపు తీరు, వాని అర్థతాత్పర్యాలు, ధ్వనులు వగైలను విశదీకరించడానికి, ఆనాడు ఆ వ్యాసాలు ప్రజలలో, పాఠకులలో, బ్రిటీష్ ప్రభుత్వంపై ద్వేషాన్ని కలిగించేవిగా వున్నవో, లేవో చెప్పడానికి పంతులుగారిని తెల్లదొర తనం పిలిచింది. మహిషాసుర మర్దని గాధ, భద్రకాళీమాత, లంకలోని వారంతా రాక్షసులే వగైరా గాధలు, విపరీత బుద్ధి వగైరా మాటలు, అన్నింటికి ఈపండితులు అర్ధ విశదీకరణ చేయాల్సివుంది. సాక్ష్యం పూర్తిచేసి వెళ్ళేటప్పుడు, రైలు ప్రమాదం జరిగి రంగయ్య చెట్టి చనిపోయారు.

ఇంత గొప్ప చారిత్రాత్మకమైన కేసులో తన పాత్ర ఏమిటో స్వీయచరిత్రలో నమోదుచేయడం పంతులుగారు తప్పకుండా చేయాల్సిన కనీసపుపని. అవి మనమిప్పుడు గాక అనుకోవచ్చిన సంగతిగా అనుకోరాదు. అది ఎంత గొప్ప ఘట్టమో ఆతీర్పును



పుస్తకంగా ముద్రించటం ద్వారా అప్పుడే లోకవిదితమైవుంది. అది అంత ప్రధానమైన సంగతిగా పంతులుగారు భావించలేదని అనుకోవాలే గాని, ఆ ఘట్టాన్ని దాటవేశారని తప్పు పట్టకూడదని రమాపతిరావు రాయటం సరికాదు. రంగయ్య చెట్టిగారి మరణం విషయంలో కేసు విచారణ ప్రసక్తి అవసరమై జాతీయోద్యమంలో తన ప్రవర్తన ఏమిటన్న విషయంలో అవసరం లేకపోయినదా? ఇదేమి విమర్శనా ధోరణి? కందుకూరి స్వీయచరిత్ర దేశ చరిత్రగా వుందని చెప్పేవారి విమర్శేనా యిది ?

పైగా పంతులుగారి సాక్ష్యం వల్లనే అంత తక్కువ శిక్ష జడ్జీ చెప్పాడేమోనని ఎందుకనుకోరాదు అని ప్రశ్న లేవదీసి ముగింపడమేనా మన విమర్శనా శక్తీ పరిశోధనాను ? పంతులుగారు నిజంగానే అల్ప శిక్షకు తగినట్టి వివరణే చెప్పివుంటే, అందుకే అంత చిన్న శిక్షఇవ్వవలసి వచ్చినట్లయితే పంతులుగారు జాతీయోద్యమానికి తాము ఎలా తోడ్పడినారో చాటుకోకుండా, స్వీయ చరిత్రలో వ్రాసుకోకుండా వదిలేస్తారా ? ఆ కేసులో సాక్ష్యం సంగతి అవతల పెట్టి కూడా వారి సంఘ సంస్కరణకు 1908 లో సన్మానంచేసిన జాతీయవాదులు ఆకేసులో తమకు అనుకూలంగా చెప్పిన తరువాత మళ్లీ 1909 లో ఆకాశానికి ఎత్తకపోయేవారా ? జాతీయవాదులు మిన్నకున్నా పంతులుగారి అభిమానులు ఆ సంగతి వ్రాయక పోయేవారా ? అసలు పంతులుగారి సాక్ష్యం వల్లే చిన్న శిక్ష చెప్పాల్సివస్తే జడ్జీని క్రింది పదవికి దిగలాగడానికి వీలు ఎక్కడ వుంటుంది ? ఇలా ప్రశ్నలు వేసి కోలేని పరిశోధకత్వం ఒక పరిశోధకత్వమా ? అది విమర్శా ? అశక్తతకాదా ?

అంతా ఎందుకు ? తీర్పు దొరుకుతున్నది. పంతులుగారి డిపోజిషన్‌తో సహా అచ్చువేస్తే యింకా పంతులుగారి కథరక్తికట్టుతుంది.

పంతులుగారు కెరషాస్పు ముందు సాక్ష్యం చెప్పలేదు. డిప్యూటీ మాజిస్ట్రేటు ముందు ఆయన డిపోజు చేశారు. దాన్ని కాగితాల్లో కెర్‌షాస్పు చదివారు. జడ్జీపేరు కెల్సాల్‌కాదు. "ఆ రెండు పక్షాల పండితులు ఏమిచెప్పిందీ, నాకనవసరం. వారి సాయం లేకుండా ఆ వ్యాసాలను విని నేను అర్థం చేసికోగలను. అందులోని ఆ సంస్కృతమూ దక్షిణ భారత భాషలు ఆనాలుగూ ఆకేసులో వరకూ నేనర్థం చేసుకోగలను"అని సొంత బుద్ధితో స్వంత అవగాహనా శక్తితో ఆ వ్రాతలు ఆ పురాణ గాధలు అన్నీ 124 ఎ. సి. పి. సి. క్రింద నేరము అవుతాయని తీర్పులో వ్రాశాడు. దొరుకుతున్న దాన్ని సేకరించి చదివి వ్రాయాలిగాని అభిమానపూరితమైన ఊహగానంతో పరిశోధనను నింపరాదు. రెండో వైపుకు కూడా ఊహగానాన్ని కాస్త తిప్పాలి.

కందకు లేని దురద కసిందకు ఎందుకు, హరి సర్వోత్తమరావే తనకు జరిగిన అపకారమో, జరగని ఉపకారమో మరచి పంతులుగారి సంఘసంస్కరణను ప్రశంసించగా మధ్యలో శివరావుగారికే ఈ విమర్శ ఎందుకు అంటూ రమాపతిరావుగారు వ్రాశారు. ఎందుకంటే శివరావుగారు చరిత్రకారులు కాబట్టి.

ఐతే తిట్టినా, కొట్టినా తుడిచేసుకొనేవారుంటారు. హరిసర్వోత్తమరావు అటువంటివారు. అలాగే ప్రవర్తించారు. ప్రకాశం పంతులు గారు కోర్టులో నిలవేసి నిజం చెప్పించిన వారల్లా, పాపం పెద్దవారిని కష్టపెట్టానన్నారు. కామరాజు హనుమంతరావు పంతులుగారు తన పెళ్ళినిగూర్చి నిజం వ్రాయలేదన్నారు. కాని సంస్కరణకు గాను ఆయనను గౌరవించారు. కందకు లేని దురద కసిందకు ఎందుకంటే చరిత్రలో చాలా యథార్ధాలను కప్పిపుచ్చవలసి వస్తుంది.

నెపోలియన్ జీవితం 13 సంపుటాల్లో వ్రాసిన ఫ్రెడరిక్ మేసన్ మొదటి సంపుటాల్లో ఆయన గొప్పతనాన్ని చెప్పి చెప్పి, యిక ఆయన చెడ్డను సంపుటాలకి సంపుటాలునింప బోయే ముందు జీవిత చరిత్రలో బహిరంగ జీవితంఒక్కటే వ్రాసి వూరుకోరాదని ఏఏ విషయాలు ఎలా సేకరించి వ్రాయాలో వ్రాశాడు. అదే శివరావుగారి ఈ రచనకు మార్గదర్శక మయింది. "జీవితచరిత్ర రచన ఫ్రెడరిక్ మేసన్ ప్రమాణంగా విశ్వసించి చేసినప్రయత్నమే వీరేశలింగం గారి వెలుగునీడలు అనే ఈ రచన" అని చెప్పుకొన్నారు. ఈ దృష్టితో భేదిస్తే స్పష్టపరచాలి. మంచి వొక్కటే చెప్పడం జీవితచరిత్ర అంటే చెప్పాలి. కాని అదొక Myth అవుతుంది-చరిత్ర మట్టుకుకాదు. పంతులుగారి పేరనిలిచేదేమిటో, మంచి ఏమిటో శివరావుగారు చెప్పలేదంటున్నారు. 1975లో పునర్ముద్రించిన విస్మృతాంధ్రము విశాలాంధ్రము నుండి వారు చేసిన మంచి పనులనుఎత్తి ఇందులోముద్రిందారు. (5,6 పేజీలు) వారిగొప్పపనులను ఎందరో వ్రాయగా యిందులో పునశ్చరణ చేయలేదు. పెంచి వ్రాయలేదు. వారి పూర్వరచనల నుండి మంచి చెడ్డలు రెండూ ఇందులో యిచ్చారు. విమర్శను మాత్రము విస్తారంగా యిచ్చారు. అసలు ఫ్రెడరిక్ మేసన్ ప్రమాణాలను రమాపతిరావు ఆంగీకరిస్తున్నారా! లేదా ? అంగీకరిస్తే శివరావు గారి చేత పంతులగారి గొప్పను విస్తరించి మరికొంత చెప్పించి ఈ విమర్శకు జోడించితే రమాపతిరావు తృప్తి పడతారా ? హరిజనులకు ఫీజులేకుండా చదువు చెప్పారని కదా చెప్పించాలి ! అంతేగదా !

ఎంత చెడుగువున్నా మంచి ఇంతవుంటే చాలు, ఆయన కొకస్థానం వుంటుంది, గౌరవం వుంటుంది. కాని ఆయన స్థానం పేర, గౌరవంపేర ఆయన ప్రైవేటు చెడ్డను, పబ్లిక్ చెడ్డను దాయటం, దానికేవేవో సంజాయిషీలు సమర్ధనలు యితరుల పొగడ్తలను పోగుచేయటం సరికాదు. ఆనాడు తెగడ్తలు చాలావున్నవి. చెడుగునైతేనేమి, మంచి పనుల పరిమితులైతేనేమి, అనుకరించిన మంచి అయితేనేమి అంతా చెప్పుకొని, పబ్లిక్ గుడ్ యింత మాత్రం చేశాడని గౌరవిస్తానంటారు శివరావుగారు. రమాపతిరావు వంటి వారెందరో ఆయన మంచిని సంచికల్లో సంపుటాల కొలదిగా చెప్పారు. అందు చేత గ్రంథ భారం పెరుగుతుందని సూచనా మాత్రంగా గొప్పను మంచిని చెప్పి, ఎవరూ ఒక్కరుగా ఒక చోటచేర్చి పూర్తిగా చెప్పిచూపని పంతులుగారి పరిమితుల్ని, చెడుగుల్ని, నీడల్ని చూపించారు. దానికి గాను, చాలా గోల చేస్తున్నారు. అమెరికన్



కల్చర్ అని, అంగుష్ఠ మాత్రులని ఏమేమో వ్రాస్తున్నారు. ఈ వ్రాతలు వ్రాసిన వ్రాయించిన వారి ముందర ఎవరు అంగుష్ఠ మాత్రులు ? ఎవరు వెంగళాయలు ? ఎవరి ముందు ఎవరు అంగుష్ఠ మాత్రులో మరొకరో ఎవరికివారు ఆలోచించుకొంటే వీరికే తెలుస్తుంది. ఫ్రెడరిక్ మేసన్ కల్చర్ అమెరికన్ కల్చర్ కాదు. ఫ్రెంచి కల్చరు. ఇది రాజకీయపు పులుముడు. విషయాన్ని విషయంగా చర్చచేయాలి. ఉదాత్తంగా చేయాలి.

(1) వీరేశలింగంగారు ఇంగ్లీషు వారిని అక్కడక్కడా వివేకవర్ధనిలో విమర్శించక పోలేదని, ఆయనకు ఉద్యోగ మిచ్చిన మెట్కాఫ్ దొరగారిని ఎవరు పొగడినను పంతులుగారు పొగడలేదని రమాపతిఉవాచించారు. (8-9-86). ఎంత అబద్ధపు వ్రాతయిది ! నీతి చంద్రికలోని "సంధి"ని వ్రాసి ఆమెట్కాఫ్ దొరకు సొంతం అంకితమే యిచ్చి దానిని వాచకం చేయించు కొని వుండగా యింకా ఏమి పొగడవలసి వుంనో తెలియుట లేదు. ఆ అంకితం విషయం పంతులుగారే రెండో సంపుటిలో వ్రాసుకొన్నారు. అంతకంటే యింకేంకావాలి. ఈ విషయం శివరావుగారు వ్రాయనే వ్రాశారు. స్కూలు ఇన్స్పెక్టరుగా వుండి తర్వాత రాష్ట్ర విద్యాశాఖ డైరెక్టరైన ఆర్. యమ్. మాక్డొనాల్డు గారికి తెలుగు రాజశేఖర చరిత్రను అంకితమిచ్చానని వారే వ్రాసుకున్నారు. వారి పేర పురమందిరమునే కట్టించ దలచినారు కూడాను. స్వీయ చరిత్రలో పంతులుగారు చెప్పుకొన్న సంగతులే పరిశోధకులు కానరాఏమిటి?

(2) 1911 డిసెంబరులో ఐదవజార్జి మీదఎందరోపద్యాలు వ్రాయగాపంతులుగారు వ్రాయలేదని,అదిఆయనదేశభక్తికిగొప్పనిదర్శనమని కాబోలువ్రాశారు. వందేమాతరాన్ని వ్యతిరేకించి, అల్లరిపాలై వుంటుండగాజార్జి చక్రవర్తిసంకీర్తనం యింకాఏమివ్రాసేట్టు?

తెల్లదొరలను పొగడటంలో ఇలా కొన్ని సందర్భాలు'మిస్'అయితే, వాటినిచెప్పి పంతులుగారి బ్రిటీష్ వ్యతిరేకతను నిరూపించ బూనటం హాస్యాస్పదమైన విషయం. అలాగే బ్రిటీష్ వారి అబ్కారీ విధానాన్ని విమర్శించటము, వారి పాలనలో త్రాగుడు పెరిగిందనటం కూడా బ్రిటిష్ వ్యతిరేకతగా వ్రాయమంటే ఎలా ? ఏ ఒక్కడైనా బ్రిటిష్ అబ్కారీ పాలసీని సమర్థించిన భారతీయ మేధావి వున్నాడా అసలు ? ఆనాడు బ్రిటిష్ ప్రభు భక్తి పరాయణులుగా వున్న భారతీయులందరూ దాన్ని కాదన్న వారే. 'టెంపరెన్స్ మూవ్‌మెంట్' లో అందరూవున్నారు. దానిని ప్రభుత్వం ఒక వ్యతిరేకోద్యమంగా చూడలేదు. దానిని నిరుత్సాహ పరచలేదు. ఆనాడు అది అంతర్జాతీయోద్యమం కూడాను. వీరేశలింగంగారు వ్యాసాలు వ్రాసి వూరుకొన్నారేగాని ఈ ఉద్యమంలో పాల్గొన్నవారు కాదు. దీనికే పంతులుగారి దృష్టి త్రాగుడు ఎడల సరళంగా వుందని నిడదవోలు వారు వ్రాశారు. వేశ్యల యెడల వారి దృష్టి తీవ్రమైనదిగా వుండి, త్రాగుడు ఎడల సరళంగా వుండటానికి కారణం ఆలోచించవలసిన విషయం. వేశ్యలనుంచుకొన్న వారినిగూర్చి పత్రికలలో పట్టుకొని ఏకిన పంతులుగారు

సీమసారా సేవకులైన పెద్దల గుట్టు రట్టు చేయకపోవడం విపరీతం. అది ఆయన స్వభావానికి భిన్నంగా వుంది. రమాపతిరావుగారి వంటి పరిశోధకులే ఈ ప్రశ్న వేసు కొని వివరణతో రావలసిన విషయం. మరి రాలేదు. దీన్నే గట్టిగా విశ్లేషిస్తే, బ్రిటీష్ దొరతనపు ప్రయోజనం దాకా వెళ్ల దీయవచ్చు. ఆయన స్నేహాలలోకీ వెళ్ళవచ్చు.

(3) రమాపతిరావు గారిని గూర్చి నాకొక సందేహం వుంది. అమెరికన్ పరిశోధకుడైన లియోనార్డు పంతులుగారు మెట్రిక్ ప్యాసుకాలేదని వ్రాస్తే, వీరేశలింగ పరిశోధకులై వున్న రమాపతిరావు ఎందుకు మిన్నకుండి పోయారో తెలియడంలేదు. అవాంతరంగా మరణించిన బంగోరె గవర్నమెంటు గజేట్లు వెదకివెదకి మెట్రిక్ ప్యాసయ్యారని లియోనార్డును ఖండిస్తూ ఆంధ్రప్రభలో వ్రాశారుగాని రమాపతిగారు శోధించి అలాంటిదేమీ వ్రాసినట్టు లేదు. కాని, బంగోరె పరిశ్రమను ప్రస్తుతిస్తూ శివరావుగారు వ్రాసినందుకు వెక్కిరించగలిగారు. వీరేశలింగం వంటి లబ్ధప్రతిష్ఠుడు మెట్రిక్ ప్యాస్ కాకపోతే ఏమిటి లెమ్మని సరిపుచ్చుకొన్నామని ఇలా ఇతరుల శ్రమను చులకన చేయడం ఏంబాగుంది ? లియోనార్డు రమాపతిగారికి తెలుసునంటున్నారు కదా ! పంతులుగారి విషయమై అతనితో ఈయన ఏమైనా విభేదించి వివాదం నడిపి వున్నారా? అతని థీసిస్‌మీదఖండనం యిప్పటికీ ఎందుకురాయలేదు. అతనితో అప్పట్లో చేయలేకఇప్పటికీ మున్సిపల్‌రికార్డులు చూచి అతడు పంతులుగారిలోచూపిన దోషాలను దోషాలు కావనిగాని, మున్సిపాల్టీలోవారు చెప్పుకోక వదిలేసిన సేవల్నిగానికొత్తగా రమాపతిరావు చెప్పలేకపోగా, ఏదేదో ఉడికిలించి పోయి గోలపెడుతున్నారు. ఇది పరిశోధనకాదు. ఇలాంటి వ్రాతలు లియోనార్డుముందు చెల్లవు.

లియోనార్డుతో ఏమీ వివాదం చెయ్యలేక పోయిన రమాపతి దిగవల్లి, త్రిపురనేనిగార్లతో వివాదం చెయ్యడమే వింత. అందులోమచ్చరం కని పింపుతున్నది. అది రమాపతిరావును దారి తప్పిస్తున్నది. ఉద్రేకింపచేసి మాటలు ఘోరుగా విడిపిస్తున్నది. అబద్ధాలు వ్రాయిస్తున్నది. అది చూశారా, ఇది చూశారా అని సవాళ్ళు వేయిస్తున్నది. వాళ్ళు అవి చూడకపోయి ఈయన వాటిని చూసి నందున రిజల్ట్సు మాత్రం కనిపించ లేదు. స్వవచన వ్యాఘాతాలున్నవని పట్టిపైకి తీసి - చూపినట్టివి నిష్ప్రయోజకమైన అసత్యాలు. రమాపతిరావుగారెంత మత్సరగ్రస్తులై వ్రాస్తున్నారో మాత్రం తెలుపుతున్నాయి.

(4) వితంతు వివాహంపై తమ తొలి ఉపన్యాసం వ్రాయడానికిగాను "తత్వబోధిని" పత్రికను "పురుషార్ధప్రదాయిని"ని చూడలేదని, అందులో విధవా వివాహ వ్యాసాలు తమకు ఉపయోగపడలేదని పంతులుగారు వ్రాశారని శివరావుగారు వ్రాయ లేదు. అలా వ్రాసిన రమాపతిరావువ్రాత ఒకపెద్ద అబద్ధం-తెలుగు నీడలు 67వ పేజీ, గ్రంధచౌర్యంలో "స్త్రీ పునర్వివాహమును గూర్చి ఏమి గ్రంథములున్నవో తెలియదట. ఈశ్వర చంద్ర విద్యాసాగరుల వారి గ్రంధమున్నట్లు తెలియునుగాని, అది లభ్యము కాలేదు ! మను, యాజ్ఞ వల్క్య పరాశర స్మృతులు తమ వద్ద నున్నవట. తత్వబోధినిలో ప్రకటింపబడిన ఉపన్యాసమొకటియు, పురుషార్థ ప్రదాయినిలోని ఉపన్యాసమొకటియు లభ్యమైనవట" అని శివరావు గారువ్రాయనే వ్రాశారు. ఈ వాక్యాలు రమాపతిరావు ఇంత రాద్ధాంతంలోకి దిగుతూ చూడలేదంటే ఏమనుకోవాలి ? "ఇంత అబద్ధమా!" అని ఆక్రోశించడమేనా ? అబద్ధమాడుతున్నది రమాపతిరావు.



(5) విద్యాసాగరుడు విధవా పునర్వివాహం హిందూశాస్త్ర సమ్మతమని గ్రంధం వ్రాశారు. ఆ గ్రంధం వారికి దొరకలేదన్నారు. అందువల్ల శాస్త్ర సమ్మతమని చెప్పిన విద్యాసాగరుని వాదం తానెరగనన్నట్లు అయిందని, కాని పురుషార్థ ప్రదాయిని వ్యాసంలో దాని సారం ఇచ్చినట్టు చెప్పకుండా అందులోని వ్యాసమొకటి దొరికిందనటం అదంత ముఖ్యవిషయం కాదన్నట్లయి, విద్యాసాగరుల వాదం తెలియ కుండానే యాజ్ఞ వల్క్య, పరాశరస్మృతులనుండి ఆధారాలు పోగుచేసుకొని సొంతవాదంగా తయారు చేసినామని చెప్పినట్లయిందని- విద్యాసాగరుని వాదం అందులో వెలువడిందని - అనగా పురుషార్థ ప్రదాయిని లోసని-పంతులుగారదంతా చదివి వున్నారని తెలియు చున్నది. దానిని (విద్యాసాగరుల వాదాన్ని) తాము చూడలేదని వ్రాశారు" అని 47వ పేజీలో దిగవల్లి వ్రాశారు. దానిని సరిగా అర్థం చేసుకోకుండా గాని, బుద్ధి పూర్వ కంగాగాని పెడర్థం చెప్పి దురారోపణలతో ఎగతాళితో గయ్యాళించడం తప్పు పద్ధతి.

(6) అలాగే విధవా పునర్వివాహం గూర్చిఉపన్యసించినవిశాఖపట్నం శ్రీమాన్ పరవస్తు రంగాచార్యులు, వ్యాకరణ విషయంలో వివాదం చేసిన గుంటూరు పరవస్తు రంగాచార్యులు వేరే వారని తెలుసుకోకుండా శివరావుగారు పెద్ద పొరపాటు పడ్డారని వ్రాశారు. బారోస్‌దొర గోదావరి విద్యాప్రబోధికలో వ్యాకరణ విషయమైవివాదంకూడా నడిచిందనివెలుగునీడలలో(33వపేజీ)వ్రాస్తే కూడా రంగాచార్యులతోవ్యాకరణ వివాదం ఏ పత్రికలో మొదలయిందో శివరావు గారికి తెలియదని ప్రగల్భించారు. శివరావు గారిలో ఎలాగైనా తప్పు చూపాలనే తపన ఫలితంఇలాటి అబద్ధాలు !

వీరేలింగం డైరీలు - లేఖలు అంటూ రమాపతిరావుగారే సంకలితం చేసి, 'విశాలాంధ్ర' వారిచే 1978 నాటికే రెండు సార్లు ముద్రించిన పుస్తకంలో "అయ్యా! 1870వ సంవత్సరం ఆగస్టు నెల గోదావరీ విద్యా ప్రబోధికా పత్రికయందు సంధి విషయమై నేను వ్రాసిన ప్రచురపరచిన అంశములు అని —— గుంటూరు ఆంగ్లో — వర్నాక్యులర్ స్కూలు — సహోపాధ్యాయులు ప॥ వెంకట రంగా చార్యులు" అంటూ పురుషార్ధ ప్రదాయిని ఎడిటర్‌కు వ్రాసిన పంతులుగారి లేఖను- చదవకుండానే శివరావుగారు వ్రాశారని భావించడం అవివేకం; అహంకారం. పెద్దలపట్ల నిష్కారణంగా అపరాధం చేయడం. ఆ పురుషార్థప్రదాయినిలేఖ శివరావుగారేయిచ్చారట

(7) రాజగోపాలరావుగారు హిందూ సంఘ సంస్కరణ చరిత్రను త్రిపురనేని, దిగువల్లి యిద్దరూ చూడలేదేమో అయినా 1837కి ముందే విధవా పునర్వివాహచర్చ

తెలుగువాళ్ళు చేశారని వెలుగునీడల పీఠికలో త్రిపురనేని వ్రాయనే వ్రాసి యున్నారు. టి. రాజగోపాలరావు గ్రంథంలో ఏవోవుంటని దాచి పెట్టుకుంటూ ఉటిస్తారా ? పిల్లి తనపు వ్రాతలుగా వున్నాయి. వారు చూడనివి వీరుచూచి వీరేశలింగం విషయంలో వీరు సాధించనదేమిటో యీ వ్రాతలో బైటపడలేదు. శివరావుగారు తమ వద్ద సమాచారాన్ని కాపీలు చేయించి పరిశోధకులకిస్తుంటారు. వీరు దాచు కొంటున్నట్టుంది. కొంచెం కొంచెంగా పత్రికలకు అమ్ముకొంటున్నట్టుంది? అందరికీ అందుబాటులో వుంచితే దేశానికి ఉపకారం. ఈ విషయంలో శివరావుగారి ఆదర్శాన్ని కాస్త పాటించాలి.

8) 1874లో ధవళేశ్వరంలో ఒక సమాజంపెట్టి (దానికి పేరు లేదు) ప్రతి ఆదివారం పంతులుగారు ఉపన్యసించే వాడని వ్రాసిన శివరావుగారు, సమాజములు స్థాపించి వాని ద్వారా సంఘ సంస్కార ప్రచారం చేయడానికి గవర్రాజుగారే పంతులుగారికి మార్గదర్శి అని వ్రాయడం ఒక పెద్ద స్వవచన వ్యాఘాతం అంటూ రమాపతిగారు వ్రాశారు. యిదేమీతప్పిదంగా పరస్పర విరుద్ధ విషయంగా కనిపించడం లేదు. ధవళేశ్వరంలో వారివి ఉపన్యాసాలేగాని, అదొక సమాజంగాలేదు. దానికొక పేరు లేదు, దానికి అధికార వర్గంలేదు. ఖర్చులేదు. అదొక సంస్థగా నిర్వహించబడ లేదు. ఏకవ్యక్తి వ్యవహారం. గుర్నో పురాణం చెప్పినట్లు. అందులో ఆశు కవిత్వం-అవధానాలు కూడా జరిపారు. ఈ కారణాల చేత అదొక సమాజం - సంస్థా నిర్మాణం అనుకోవలసి లేదు. బసవరాజు గవర్రాజుగారు కార్యదర్శిగా రాజమండ్రి ప్రావిన్షియల్ స్కూలు క్లబ్బు ఏర్పడి, సభ్యత్వము, అధికార వర్గముతో నిజమైన సంస్థ. దానిలో పంతులుగారే సభ్యుడుగా చేరారు. చేరింది మొదలు 1875 ఆగస్టు 22 నుంచి ధవళేశ్వరంలో ఆదివార సభలు అడుగంటినై. పంతులు గారు రాజమండ్రి విద్యార్థుల సంస్థ సభలకే తమ ఆదివారాన్ని కేటాయించారు. కాబట్టి బసవరాజుగారే సంఘ సంస్కరణ సంస్థలకు పంతులు గారికి మార్గదర్శి అనటంలో తప్పులేదు. "ఆనాడు సమస్తమైన సామాజిక వికాస కార్యక్రమాలలోను, బసవరాజుగారు వీరేశలింగం గారికి సారథిగా సచివుడుగా వున్నారని లోగడ ఈ రమాపతిరావే పాద విపరణ రాశారు వారి పరిశోధనా గ్రంథంలో. ఇప్పుడిలా ఫిరాయించడం దేనికి ? శివరావుగారి పై గుడ్డి ద్వేషం వల్ల కాదా ?

కాదంటే, ధవళేశ్వరం వంటి ఆదివార సమావేశాల మాట అంటారా, ఆత్మూరి లక్ష్మీ నరసింహం 1868-1870 వరకూ అలాంటివిచేయించి వున్నారని చూప వలసి వుంది. అది మరీ మింగుడు పడనిపని. కాని ఈ రెండింటిలో రమాపతిరావు కేది యిష్టమో అదే చెప్పుదాం. ఆత్మూరిని గూర్చికూడాశిరాయించారు. లోగడ వీరేవ్రాశారు, చూడండి



ఆత్మూరి లక్ష్మీ నరసింహం (1845-1901) : కిందటి శతాబ్దిలో జన్మించిన ప్రతిభావంతులైన తెలుగు వాళ్ళలో ఈయనకూడా ఒకరు. ఫ్రెంచి, లాటిన్, జర్మన్, ఇంగ్లీషు భాషలను స్వయంకృషితో సాధించిన మేధాశాలి. మొదట్లో ఈయన బ్రాహ్మ మతాభిమాని. అటు తరవాత పూర్తిగా మారిపోయినాడు. వైశ్యులలో ఈయనవలె యజ్ఞ యాగాదులు చేసి సోమయాజి బిరుదును వహించిన వారు మరొకరున్నారో లేదో ? ఉన్నా చాలా అరుదుగా ఉండేవుండవచ్చు. బరంపురంజిల్లా కోర్టులో 1873-77, ప్లీడరుగా ప్రాక్టీస్ చేశారు. ఆ తర్వాత జిల్లా మున్సిఫ్‌గా బందరు, అమలాపురం, రాజమండ్రి, గుత్తి, విజయనగరం, శ్రీకాకుళం, నంద్యాల, చిత్తూరులలో పని చేశారు.

9) "పారదారిక శృంగారం, తారా చంద్రుల శృంగారంవంటి అశ్లీలాలున్న గ్రంథాలనుతిట్టడం తప్పా?" అని రమాపతిరావు ప్రశ్నించారుగాని వీరేశలింగం వెలుగు నీడల్లో ఆ ప్రసక్తేలేదు. అయినప్పుడిటువంటి లోకాభి రామాయణంతెచ్చి శివరావుగారు ఇటువంటివి వ్రాశారు కాబోలు అనిపించి వారిపై దురభిప్రాయం ఏర్పరచడం తప్ప ఎందుకీ అప్రస్తుత విషయాలు.

10) లియోనార్డుని నేను చదవలేదు. కానిరమాపతిరావువ్రాసినదాన్నిబట్టి చూస్తే, రాజమండ్రి మున్సిపాల్టిలో పంతులుగారి ప్రవర్తనను అతడేమి విమర్శించాడోగాని, దానికి రమాపతిరావుగారి వద్ద సమాధానం లేదని స్పష్టపడుతున్నది. అందుకు సమాధానం లేకపోగా, "విధవరాలికి జుట్టు గొరిగించడంలోని అమానుషత్వం అతడు అర్థం చేసుకోగలడా? వెధవ ముండ కావాలా వెయ్యిరూపాయలు కావాలా అని ఆస్తి వాటాల్లో అడిగే వారంటే ఆమె యావజ్జీవనాకిరీ లియోనార్డుకి అర్థం అవుతుందా ?" అంటాడు. మున్సిపాలిటీ వ్యవహారాల్లో నోరెత్త వీల్లేకుండా వ్రాసినట్టే, విధవాసమస్య పరిశోధస్తే గనక అంతపకడ్బందీగాను చేయగలడనీ, స్త్రీని బోడిచేసి వెయ్యికి అమ్మితే పరాయి పరిశోధకులకన్న మనము ఘోరంగా తలంచలేమని చెప్ప గలను. మన చరిత్ర మీద, మన సమాజం మీద మన పి. హెచ్. డి. ల కంటే ఎంతో గొప్ప పరిశోధనలు అమెరికన్లు, రష్యన్లు, యితర పాశ్చాత్యులు చేసి గొప్ప గ్రంథాలు ప్రచురిస్తున్నారు. అవైనా కాస్త చదివితే పరిశోధన ఎలా వుండాలో రమాపతిగారికి తెలుస్తుంది. కొన్ని నావద్ద వున్నవి.

11) వేమనను గురించి Encyclopaedia Brittannica(1982)లో Foot note లో వ్రాశారని వ్రాసే రమాపతిరావు అజ్ఞతకు జాలిపడాలిసుమీ ! ఆ ఎన్‌సైక్లోపేడియాను ఈ పరిశోధకాగ్రణి తెరచి చూడ లేదని నేను చెప్పనక్కరలేదు. ఇలాగే శివరావుగారి రచనపై కావాలని ఇంకా చాలా అసత్యాలు వ్రాశారు. ఇది వైనవైనాలుగా విశాలాంధ్ర పత్రికా యవనికాభ్యంతరమున వెక్కి వెక్కి రోదించిన గీతిక మచ్చు కింతమాత్రమే చెప్పాముగాని మొత్తము ఒకపెద్ద అబద్ధాలపుట్ట, శక్తితక్కువ - ఆక్రోశమెక్కువ.

— వై. వి. హనుమంతరావు

# కందుకూరిపై తమిళ మహాకవి వ్యంగ్య నవల

— డా॥ ప్రకాశచంద్ర శతపధి

తమిళ మహాకవి భారతియార్ 'చంద్రిక' అనే తమ అసంపూర్ణ నవలలో వీరేశలింగం పంతులు గారిని చిత్రించిన తీరు వ్యంగ్యచిత్రణగా వుందని శివరావు గారు వ్రాశారు. కందుకూరి మీద మాత్రం వ్యంగ్యం ఏమీలేదు గాని హిందూ పత్రికా సంపాదకుడు, విఖ్యాత జాతీయ వాది సంఘ సంస్కర్త అయిన సుబ్రహ్మణ్యఅయ్యరు గారి మీద మాత్రం వ్యంగ్యంవుందని నొక్కివక్కాణించారు శ్రీ రమాపతిరావు. సుబ్రహ్మణ్య అయ్యరు గారి మీదే అది వ్యంగ్య రచనగా కనపడి కందుకూరి మీద వ్యంగ్య రచనగా కనిపించకపోవటం దురభిమానం చేత ఏర్పడిన దృష్టిమాంద్యం తప్పమరేమీకాదు.

ఒక యువ వితంతువు తమ చెంతకువచ్చి తనకు తగిన వరుణ్ణి వెదకి వివాహం చేయించమని విధవా పునర్వివాహ సంస్కర్త అయిన పత్రికా సంపాదకుణ్ణి అర్థించింది. మూడేండ్లుగా ఉపాదాన మెత్తుకొని బ్రతుకుతున్నానని ఆమె తెలుపగానే జేబునుంచి వందరూపాయలు నోటుతీసి చేతిలో వుంచగా అది కాస్తా తీసుకొని మరి నాపెళ్ళిమాట ఏం చేస్తారని అడుగగా - ఒక వుత్తరం ఇచ్చి ఆ యువతిని కందుకూరి చెంతకు పంపినట్లు భారతియార్ చిత్రించారు, వరుణ్ణి చూడటం తన చేతనైన పని కాదు అంటూ వీరేశలింగం దగ్గరకు పంపడంలో విధవా వివాహాలంటే అయ్యరు గారిలో వున్న పిరికితనాన్ని చాటి చూపించారని, రమాపతి వ్రాశారు. వరులను సంపాదించడం మనువులు పొసగించడం అందరికీ చేతనైన విద్యకాదు. ఆ మాట ఆలోచించకుండ అయ్యరు భీరుత్వం గూర్చి అది వ్యంగ్యం అని సునాయాసంగా ఉద్ఘాటించారు.

కాని కందుకూరి అలావచ్చిన పిల్లకు సంబంధం చూడడంలోను పంతులు గారి పాత్రను చిత్రించడంలోను స్పష్టంగా ఉన్న వ్యంగ్యాన్ని నాకేమీ అగుపడ్డం లేదు. "లోకోభిన్నరుచిః" అన్నారు రమాపతిరావు. ఆ అయ్యంగారు డిప్యూటి కలెక్టరు. యాభై ఏళ్ళు. భార్యను కోల్పోయాడు. త్రాగుబోతు. మాంస భుక్కు. తిరుగుబోతు. అందుకు సరిపడినంత సంభాషణ నవలలో వుంది. యిన్ని సుగుణాలు అధికార దుర్వినీతుడైతేనే కుదురుతాయి కదా ! గొప్పమాటకారి. మనుస్మృతి కూడా పఠించిన వాడు. లోకానుభవం దట్టంగా గలవాడు. పెద్ద ముదురు. ప్రేమ మీదను, వర్ణాంతర వివాహాల మీదను, దిగువ కులాలకన్యలను సంస్కారులుగా మలచుకోవచ్చని, ఆ



అనులోమ వివాహాలు శాస్త్ర సమ్మతాలనీను అఖండంగా వుపన్యసించి కందుకూరినీ, రఘుపతి వెంకటరత్నం నాయుడు పాత్రగా వున్న బ్రహ్మ సమాజపు వెంకటాచల నాయుడునీ, ఆ గొల్లపిల్ల తండ్రినీ వశపర్చుకో గల గట్టి మాటకారి. అన్నీ తెలిసి అన్నియు వదిలేసినట్టి ఆ అధికారితో వీరేశలింగం గారి స్నేహం !! చదువు సంగీతం శౌచం సౌందర్యం గల బ్రాహ్మణ వితంతు యువతి కన్నా, పసిపిల్లను ముద్దాడుతూన్న మరొక యువతి యొక్క చుంబనా సంవిధానం చూచి, అటువంటిదే కావలెనను కొని, ఆమె గొల్లపిల్ల అయినా, ఆపిల్లే కావాలని, ఆమెనే మాట్లాడి పెట్టమనగా, పెళ్ళి వెంకటరత్నం నాయుడు గారి సహాయంకూడా పుచ్చుకొని, ఆ సంబంధం కుదిర్చి ఆ వధూవరులను బ్రహ్మ సమాజంలో చేర్చి బ్రాహ్మ పద్ధతిలో వివాహం నడిపించాడు. కందుకూరి. చివరకా వివాహం కన్యా శుల్కం యిచ్చుకొన్న వివాహం అయింది. అయ్యంగారు మూడువేల రూపాయిలు యిచ్చాడు. ఆ పైన అది తండ్రీ కూతుళ్ళ కున్నంత వయస్సు భేదంలో జరిపిన పెళ్ళి. ఈ వ్యవహార మంతా కందుకూరి పాత్రపట్ల గౌరవం నిండిన చిత్రణే నంటారా ? ఆయనలో ధైర్యమేగాని, విచక్షణ మాత్రం లేదనీ, ఎవరైనా, ఎట్టివారైనా, ఏలాగైనా బ్రహ్మ సమాజ విధిలో పెళ్ళి చేయించి సంస్కరణ అనిపించడమే ఆయన వ్యాపకం అనీ-కులాంతర (అనులోమ) వివాహ విషయంలో నాయుడుగారి కంటేను అయ్యంగారి కంటేను బాగా వెనుకబడి యున్నారనేవిమర్శను కూడా ఈచిత్రణలో నిక్షేపించినారంటే ఆక్షేపణ ఏమైనావున్నదా! ఇది "లోకోభిన్నరుచిః" అనుకొనే విషయమా! పంతులు గారిపై ఇది మర్మ భేదకమైన వ్యంగ్యం కాదా ?

"ఈ చంద్రిక నవలను భారతియార్ 1908కి ముందే మొదలెట్టి వుండ కూడదా? అలాతేలితే అప్పుడు నాలుక కరచుకుంటారు కాబోలు" అంటూ చాలా చదివారు రమాపతిరావు. కాని దానిని 1908 కంటే ముందుగా వ్రాశారనే మాట ఆయన జీవిత చరిత్రకారులెవరూ అనలేదు అని బంగోరెవల్ల తెలుస్తున్నది.

అసలింతకూ రమాపతిరావు బంగోరె ప్రచురించిన చంద్రిక కథ చూడనట్టుగానే నవలా కాలం చర్చించటం ఆశ్చర్యంగా వుంది. భారతి జీవిత చరిత్రకారులు-తమిళులు, భారతి పాండిచ్చేరిలోవుండగా 1908నుండి 1918 లోగా వ్రాసినట్టు చెప్పారు. అంతస్సాక్ష్యాన్ని బట్టి భారతిగారు చనిపోవుటకు కొద్ది నెలల ముందు అంటే 1920 కి కొంచెం అటూ ఇటుగా ఈ "(చంద్రిక) నవలను ప్రారంభించి కొంతవరకు సాగించి అట్టి పెట్టారని బంగోరే తేల్చాడు. భారతి పాండిచ్చేరిలో వుండగా వ్రాసినా, ఆ తర్వాత మద్రాసులో వుండి వ్రాసినా, హరిసర్వోత్తమరావుకేసు తర్వాతే చంద్రిక వ్రాసినట్టు అవుతుంది.

# మంగమ్మ కథ కెలికింది రమాపతిరావే

దామెర్ల వెంకటరమణరావు కందుకూరి గృహవైద్యులు సన్నిహితులు. రాజ్యలక్ష్మమ్మగారు రాత్రి నిద్రలో చనిపోగా వెంటనేవచ్చి చూచిన డాక్టరు వీరే. కాని కందుకూరి మీద టంగుటూరి శ్రీరాములు వేసిన నూననష్టపు వాజ్యంలో ప్రసిద్ధ చరిత్రకారులైన చిలుకూరి వీరభద్రరావుతోపాటు ఈ రమణరావు కూడా 1913లో శ్రీరాములు తరఫున సాక్ష్యం చెప్పివున్నారు. చిలకమర్తి వారే స్వీయచరిత్రలో వ్రాశారు: "శ్రీరాములుగారి పక్షమున దామెర్ల వెంకటరమణరావుగారు, చిలుకూరి వీరభద్రరావు మున్నగువారు సాక్ష్యమిచ్చిరి. ఆ సాక్ష్యములు వీరేశలింగముగారికి వ్యతిరేకముగా నుండెను. నా సాక్ష్యము వీరేశలింగముగారికి అనుకూలముగా నుండెను." (313 పేజీ)

ఈ రమణరావుగారి కుమారుడు వెంకట్రావుగారు లెక్చరరు. నాకూ తెలుసును. వారిటీవలనే దివంగతులయినారు. సభలు సమావేశాలకు వెళ్ళినపుడు రాజమండ్రిలో పలుసార్లు కలిసియున్నాను. ఈ కేసుల ముచ్చట కూడా మా సంభాషణలలో వుండేది. మంగమ్మతో కందుకూరికి అక్రమ సంబంధముండేదని దృఢంగా నమ్మినవారిలో దామెర్ల రమణరావుగారొకరు అని వెంకట్రావు చెప్పేవారు. అంతేగాక, కేసులలో పడవద్దని Pocket the insult and keep Quiet అని కూడా కందుకూరిని నిగ్రహించారని, అయినా పెడచెవినబెట్టి కోర్టుకెక్కి ప్రకాశంగారి క్రాసు పరీక్షలోపడి మంగమ్మ వీపుగోకేవాడినని, బెంగుళూరులో (ఆమెభర్త వేరేపరుండుచుండగా) తానూ ఆమే మూడునెలలు ఒకే గదిలో పరున్నామనేమాట యథార్థమేనని ఒప్పేసుకొనే ప్రవర్తన న్నారనిచెప్పేవారు. దానితో కేసులో ఓడిపోయినప్పటికీ వూరుకొనక అట్టి పాశ్చాత్యుల ఆచారం ప్రకారం జడ్జి తలంచినట్లుగా తప్పుకావచ్చుగాని హిందూ ఆచారం ప్రకారం తప్పుకాదనే ఘోరమైన వాదన వకటి లేవనెత్తి పైకోర్టులో రివిజన్ వేశారని, ఆ రివిజన్లో కూడా ప్రకాశంగారి ముందు మళ్ళీ ఆ అనుచిత చర్యలన్నీ ఒప్పేసుకోవాల్సివచ్చి ఇక అక్కడ కూడా కేసు నిలవదని ఎత్తివేసుకొన్నారని, అలా ఎత్తివేసికొనికూడా వూరుకొనకుండ కొత్తగా 1916లో శ్రీరాములు పైన మరొక కేసు పెట్టి ఓడిపోయాడని వెంకట్రావుగారు చెప్పేవారు.

వెంకట్రావుగారు మాకేదైతే చెప్పేవారో దిగవల్లివారు దానినే రికార్డు దాఖలా పకడ్బందీగా వ్రాసినారు. అంతే. రమాపతిరావు ఆ వెంకట్రావుగారివద్దకేవెళ్ళి భోగట్టా చేశామన్నారు. దామెర్ల వెంకటరమణరావుని తనపక్షాన సాక్ష్యం చెప్పవలసిందిగా 'ప్రచండకోపిష్ఠియైవెళ్ళి నిగ్గదీసి అడిగి'యున్నాడని, ఎన్నోసార్లు అడిగినప్పటికే 'నీకు



అనుకూలంగా చెప్పనని కందుకూరితో నిష్కర్షగా చెప్పివేశారని' ఆంధ్రజ్యోతి వారపత్రికలో కొన్నినిజాలు, కొంత అదనపు సమాచారము ఈ కేసు సందర్భంలో ప్రచురించియున్నారు! కందుకూరిని కాపాడబోయి యిదివరలో తెలియని ఈ భోగట్టాలు దేశానికి వెల్లడిచేశారు. కందుకూరే ప్రకాశంగారి రాజీప్రయత్నాలను తిరస్కరించారని కూడా రమాపతి అంగీకరించారు. విశాలాంధ్రలో యిలాంటి సంగతులేవీ చెప్పకుండా వారికి కావలసిన బుకాయింపులు అఖండంగా రమాపతిరావు వ్రాసివున్నారు. ఒక్కొక్కపత్రికలో ఒక్కొక్కవైఖరి అవలంబించి ఎవరికికావలసిన మోతాదులో వారికి వ్రాయుచున్నారు.

కోర్టులు నిజముతేల్చవని ఆదిభట్ల అన్నాడనీ, కోర్టులో కందుకూరి గెలిస్తే శివరావుగారేమి వ్రాశేవారనిఅడిగి రమాపతిరావు కందుకూరిని ఏదో కాపాడుతున్నానను కొంటున్నారు. అలాగే కృష్ణాపత్రికకూడా ఈ కేసువిషయంలో దిగువకోర్టు కందుకూరిని వినిపించుకోలేదని వ్రాసియున్నదని దాని వార్తలను చూపించినారు. ఈ కేసులలో తేలిన తిరుగులేని సత్యము (బెంగుళూరులో ఆ యింటిలోనే భర్తవేరే పడుకొనుచుండగా) తానూమంగమ్మా ఒకే గదిలో 3మాసములు పడుకొన్నామని, ఆమెవీపును గోకేవాడినని కందుకూరే క్రాసుపరీక్షలో స్వయంగా అంగీకరించియున్నారన్నది ఆ విషయము ఒక్కసారికాదు; రెండుసార్లు ఒప్పుకొన్నారు.

ఆ పనులు హిందూఆచారంప్రకారము, తండ్రీ కూతుళ్ళవంటి వారిమధ్య తప్పు పట్టరానివని ఏ పెద్దలు ఏ శాస్త్రప్రమాణాలు ఏ దేశాచారము వున్నదని చెప్పగలరు? ఆలోచించుకొని అకస్మాత్తుగా కేసు ఎత్తివేసుకొన్నాడుకందుకూరి. స్వయంగావొప్పుకున్న చనవులు అబద్ధమనడానికి అదేమీకోర్టుతీర్పుకాదు-కన్వెషను. శతపోరి పెట్టించుకొన్న పునర్విచారణకు నిలవలేకజారుకొన్నది కందుకూరి డైరీలో వున్నమాటే. కోర్టుతీర్పుతో సంబంధంలేనట్టివి; ఇవి మాయనిమచ్చలు. శిలాక్షరసమసత్యాలు. పునర్విచారణ ఏమయిందో ఎలాజరిగిందో కృష్ణాపత్రికమళ్ళీ ఏమైనా వ్రాసినదో, వ్రాయలేదో, వ్రాస్తే ఏమివ్రాసివున్నదో రమాపతిరావు చెప్పకుండా దాటవేసి విశాలాంధ్ర చదవర్లను మాయజేశారు. ఆ పత్రికాధిపతులు అలా మాయచేయించారు. రమాపతిరావు సమగ్ర పరిశీలన, పరిశోధన అంటే నవ్వవలెనో ఏడవవలెనో తెలియదు. లోకజ్ఞానంలేని వ్రాతలకు రమాపతిని చెప్పినపిదపే మరొకరిని చెప్పాలి.

మంగమ్మ 16మాసాలకుపైగా కడుపుతూ కనకుండా కాలంచేసిందని వ్రాసిన గొప్పవాడు! కందుకూరి బెంగుళూరు వేసవిక్యాంపులో సపర్యలు చేయడానికివెళ్ళబోయే ముందే—1912మార్చికే-మంగమ్మ గర్భిణిగావుండెను. 1913 జూలైలో ఆమె సంబంధమైనకేసులు మొదలయ్యేవరకు జీవించివుండెను. కేసు 1915 మార్చిలో ఎత్తి వేయబడెను. కేసుమధ్యలోకదా మంగమ్మ చనిపోయినది. కాబట్టి మంగమ్మ గర్భిణి

అని కందుకూరి వ్రాసిందే నిజమయితే (పుత్రికాతుల్యమయిన మంగమ్మ మరణం గూర్చిగాని, ఆ గర్భాన్నిగూర్చిగాని కందుకూరివ్రాయలేదు)ఆమె ఆపైన రెండుమూడేళ్ళు జీవించివుంది. కాని రమాపతిరావు కడుపుతూనే చచ్చిపోయిందని కట్టుకథ చెప్పుచున్నాడు.

ఏమిచెప్పవలెనో ఏమి చెప్పరాదోకూడా తెలియని వ్రాతగాడు రమాపతిరావు. కందుకూరి చనిపోగానే ఒకరాజమండ్రిపురవాసి తనపేరు ప్రకటించుకోకుండా కందుకూరి సేవలను కొనియాడుతూ ఆంధ్రపత్రికకువ్రాసిన ఉత్తరమొకదానిని ప్రకటించాడు. అది ఎందుకుపనికివస్తుంది ? చనిపోయినప్పుడుకూడా నాలుగుమంచిమాటలు చెప్పుకోగల వాతావరణం రాజమహేంద్రవరంలో లేకపోయిందని చెప్పుటకు ఆలేఖ పనికివస్తుంది. అక్కడ కందుకూరి అంతగా పరువుకోల్పోయినందున రాజమండ్రి పురవాసి తనపేరు చెప్పుకొనవెరచి, అజ్ఞాతుని శ్రద్ధాంజలి వ్రాయవలసివచ్చిందని అది రుజువు.

అసలీరమాపతిరావు మంగమ్మకథనింతగా చర్చించి ఏమితేల్చినట్టు ? శివరావు గారిని పూర్వపక్షం చేసినాడా? 'మంగమ్మతో అక్రమ సంబంధం సంగతి ఇదమిత్థమని ఎవరుతేల్చగలరు' అని కళ్ళుతేలవేశాడు. యింతచర్చ, యీ అబద్ధాలు, అజ్ఞాతునిలేఖలు, మంగమ్మ సంవత్సరాలు సంవత్సరాలుగా కడుపుతూ చనిపోయినదనడము ఈ మాట చెప్పడానికేనా ? శివరావుగారు తమ అభిప్రాయం ఏమీ యివ్వకుండా, కోర్టులో కన్ఫెషను చూపించారు. ఇతరులువ్రాసినదే తెలిపారు. కోర్టులో పరిణామాలు వ్రాశారు. చివరకు ఇలాగన్నారు :

"ఇంతకును ఒకవేళ మంగమ్మతో వీరేశలింగంగారికి సంబంధంవున్నదను కొన్నను అది ఆంధ్రదేశానికి ఆంధ్రబాషకూ ఆయనచేసిన సేవకు భంగంకలిగిస్తుందా ? కాని ఆయనజీవితచరిత్ర వ్రాసినవారు ఆయనవలెనే నిష్కారణంగా భయపడి ఈ ఘట్టమును వ్రాయుటకు జంకుచున్నారు ? పైగా అయనపై అపవాదులు, నమ్మినవారిని గర్హిస్తున్నారు"
(వెలుగునీడలు, పేజీ-109)

శివరావుగారు వ్రాసిందే రమాపతిరావు వ్రాశారు.

"చివరిదశలో కందుకూరి మానవీయమైన బలహీనతకు లోనైనాడని వాదం కోసం అనుకొన్నా, 50 సం॥రాలు సంఘ సంస్కరణకు ఆయన చేసినకృషి కొట్టుబడి పోతుందా?" అని శివరావుగారు వ్రాసినదే వ్రాసినరమాపతిరావు ఎందుకు రగడచేశారు?

మంగమ్మవీరేశలింగాల అక్రమ సంబంధము కథ నమ్మేవారున్నారు; నమ్మని వారున్నారు. నమ్మినవారుకూడా దుర్మార్గులంటూ నిందిస్తూవ్రాశారు రమాపతిరావు. వట్టిపుకారు పుట్టిస్తే దుర్మార్గం. పుకారునమ్మినవారిని దుర్మార్గులనడమేమిటి ? ఇంటి వైద్యులు నమ్మారు. చిలుకూరి వీరభద్రరావు నమ్మినారు. టంగుటూరి సోదరులు



నాళంకృష్ణారావునమ్మారు. కొమరరాజుహనుమంతరావుగారు, దుగదలేనికంఠ అన్నారే వారేనమ్మారు, నమ్మి తామునడిపిన బ్రహ్మసమాజ పత్రికధర్మసాధనిలో కందుకూరిని పబ్లిక్‌రంగంనుంచి తప్పుకోమని వ్రాశారు. చిరకాలం సంఘ సంస్కరణకు ప్రసిద్ధి పొందిన కాంగ్రెసుసంస్కర్త నటరాజన్ సోషల్‌రిఫార్మర్‌లో (ఆలిండియా పత్రిక) అదే వ్రాశారు. వీరంతా ఆ కథనమ్మినారు గాని పుట్టించినవారుగారు: నమ్మివ్రాసినవారే కందుకూరిచే కోర్టు కీడ్వబడినారు.

"అట్టివ్యర్థాలాపాలను కొందరు విశ్వసించటం ప్రచారం చేయడం దుర్మార్గమని చెప్పవలసివుంటుంది" అని (డైరీలు-లేఖలపీఠికలో) యింతమందిని దుర్మార్గులని గుడ్డినమ్మకంతో వీరపూజలోపడిన రమాపతిరావు, వీరేశలింగం లోతుపాతు లెరుగని రమాపతిరావు వ్రాయడంతో సుప్రసిద్ధులు శక్తిమంతులయిన శివరావుగారు మంగమ్మ కేసురికార్డు బైటికితీసి చూపించారు; ఎవరేమిఅన్నారో కొంతవరకు యిచ్చారు. గుడ్డి సంకీర్తనాపరులు తమదేవతలకు తెచ్చిపెట్టేముప్పు ఇలాగే వుంటుంది.

అసలు రాజమండ్రిలో వినపడేమాటలు యీ కథనుగూర్చి యింకా చాలవున్నవి. వెంకట్రావుగారు చెప్పినవేవున్నవి. అక్కడ స్థానికపత్రిక నడిపేవారికెన్నో తెలుసు- కందుకూరి స్వీయచరిత్రలో తమసతీమణి పాడుచుండేదని యిచ్చినపాటను, దానిని గూర్చి కందుకూరివ్రాసిన జిలుగువ్రాతను కలిపి విచారిస్తే కథలో అనేక క్రొత్తమలుపు తిప్పినదవుతుంది. ఇకదానిజోలికి వెళ్ళవద్దు.

# కందుకూరి బ్రిటిష్ భక్తుడు కాడా?

కందుకూరిని గూర్చి రమాపతిరావు ఆంధ్రజ్యోతి వారపత్రికలో చాల వారాలు వ్రాశారు. కందుకూరి "బ్రిటిష్ ప్రభు భక్తుడా, ?" "జాతీయవాది" కాకపోరు అంటూ రెండు వారాలు వ్రాశారు. ఆ వ్రాతలు చాలా అసందర్భముగాను, అసత్యాలతో నిండినవిగాను, కక్కురితి వాదంగాను వున్నవి.

1) రమాపతిరావు కందుకూరిని గూర్చి వీరేశలింగంపంతులు-సమగ్రపరిశీలన వ్రాసే Ph.D. పొంది వున్నారట ! కాని హరిసర్వోత్తమరావు కేసు తీర్పును చదవకుండానే దిగవల్లి శివరావుగారివంటి ప్రసిద్ధ చరిత్రకారులతో వివాదము చేస్తు న్నారు. "విప్లవోద్యమంలో హరిసర్వోత్తమరావు పాల్గొన్నాడా లేదా అనే విషయం సాక్ష్యం చెప్పటానికి" "రాజమండ్రి ట్రయినింగుకాలేజి పాలక వర్గ సభ్యుడిగా వుండిన

కందుకూరిని (బ్రిటిష్) ప్రభుత్వం కోరివుంటుంది" అని రమాపతిరావు వూహాగానం చేశాడు. తప్పుడు, కేసునుగూర్చిగాని, తీర్పునుగూర్చిగాని ఇప్పటికి కూడా చదివి వ్రాయలేదు; విని వ్రాయలేదు. తన పి. హెచ్‌డి. గ్రంథంనాటికి ఆ కేసు సంగతే వినలేదు.

హరిసర్వోత్తమరావుకు విధించిన శిక్ష ఆరుమాసాలయితే మూడునెలలేయని వ్రాశారు. కేసు విచారించిన జడ్జిపేరు పి. కెర్‌షాస్పు అయితే కెల్‌సాల్ అని వ్రాశారు. కాబట్టి కేసును తీర్పును చదవకుండానే మన పరిశోధకుడు ఖండన మండనలకు దిగినాడని రుజువవుతున్నది.

2) పైగా కందుకూరి బందరువెళ్ళి ఆ కేసులో సాక్ష్యం చెప్పానని స్వీయ చరిత్రలో వ్రాశారని రమాపతిరావు పెద్ద అబద్ధం వ్రాశారు. (27-6-86)వార ఆంధ్ర జ్యోతి. స్వీయచరిత్రను ఎంత వెదకినా ఈ కేసులో ఆయనసాక్ష్యంగూర్చి కనిపించలేదు. పూర్వముద్రణలను కూడా చూచివున్నాను. కాని కేసులో సాక్ష్యం ఇవ్వవచ్చి, తిరిగి వెళుతూ "అయోమార్గ మహావిపత్తులో" మరణించారని (సమర్ది రంగయ్య చెట్టినిగూర్చి) వ్రాసి తనసంగతిని దాటవేశారు. అంత చరిత్ర సృష్టించిన కేసులో తన పాత్ర సమర్దనీయంకానందుచేతనే అలాదాటవేసి యున్నారని తలంచవచ్చును.

కాని దాచిన సంగతిని దాయలేదని, దాన్ని వ్రాశారని పచ్చిఅబద్ధం వ్రాసే రమాపతిరావు వంటి పరిశోధకులు దొరకడం కాలమైపరీత్యము, దేశదురదృష్టముగదా! అందరికీ లభించుతున్న స్వీయ చరిత్రను గూర్చే యిలా అసత్యము వ్రాస్తే, తేలికగా దొరకని పాతపత్రికలను గ్రంధాలను గూర్చి వీరు నిజం వ్రాస్తున్నారను కోగలమా?

3) పైగా, హరిసర్వోత్తమరావుకు "తలగొరిగించి, గోచీపెట్టి, కాళ్ళు చేతులకు బేడీలు వేయించినట్టి" శిక్ష "మూడునెలలు మాత్రమే విధించారన్న సంగతి వీళ్ళు మరచి పోతున్నారు. అంచేత వీళ్ళిప్పుడు కార్చేవి మొసలి కన్నీరనే అనాలి" అని వ్రాసియున్న రమాపతిరావు వ్రాత మానవ మాత్రుడు వ్రాసే వ్రాతకాదు. అటువంటి శిక్ష మూడునెలలుగాదు, మూడురోజులుగానీ మూడు గంటలుగానీ అయినప్పటికీ దారుణమైనది. కాని అటువంటి శిక్ష మూడు నెలలేకాబట్టి శివరావుగారు మీరు నేనూ తనలాగునే కన్నీరు కార్చకూడదన్నారు రమాపతిరావు ! కార్చితే అవిమొసలి కన్నీరట ! రమాపతిరావుకి ఆశిక్ష బాధాకరమనిపించలేదన్న మాట ! ఇది మానవత్వం లోపించిన క్రూరుని వ్రాత. జీవితపు విలువలు ఇంత దొత్తిగా లోపించిన విమర్శకుడు విమర్శనా ప్రమాణాలను మాత్రం ఎలా పాటించగలడు ? అందుకే ఈ పత్రికలో యిలా వ్రాస్తాడు, మరొక పత్రికలో కందుకూరి సాక్ష్యం వల్లనే అంత తక్కువ శిక్షపడిందని ఎందుకనుకోరాదని ప్రశ్నిస్తాడు; ఈ విషయం ప్రధానం కాదను కాని స్వీయ చరిత్రలో వ్రాయలేదంటాడు. పంతులుగారు సాక్ష్యమే చెప్పలేదని అనుకోరాదా అని అడగటమే యికమిగిలింది ! గంతకుతగిన బొంత రమాపతిరావు.



4) ఆ హరిసర్వోత్తమరావే జార్జి చక్రవర్తి ఢిల్లీదర్బారు గ్రంథం వ్రాశారనే గొప్ప విషయాన్ని రమాపతిరావు కనుగొన్నారు. వందేమాతరోద్యమానికి కారణమైన బెంగాలు విభజనను రద్దు చేస్తూ జార్జి చక్రవర్తి ప్రకటన చేయుట వలన సర్వభారత దేశము సంతోషించి వేడుకలు జరుపుకొన్నది. అందుకే వందేమాతరం వీరునిచేత ఢిల్లీ దర్బారును బలవంతంగా నిఘాపెట్టికొమర్రాజు వ్రాయించినారు అని తెలియదా ? కందుకూరి ప్రశంసాపద్యాలు "వ్రాసినట్లులేదు" అన్నారు. తెల్ల దొరతనం మీద, ఐదవ జార్జిమీద యిష్టంలేకనే పద్యాలు వ్రాయలేదంటారా ? బెంగాలు విభజన చేసినప్పుడు చెదరని బ్రిటిష్ రాజ భక్తి తిరిగి ఏకరాష్ట్రం చేయడాన కందుకూరిలో అదృశ్యమయినదంటారా ఏమిటి ?

5) కందుకూరి ఇంగ్లీషు వాళ్ళ కొమ్ముకాశాడా అని రమాపతిరావు ప్రశ్నించటమే ఆశ్చర్యంగావుంది. స్పష్టంగా బ్రిటిష్ ప్రభుభక్తి పరాయణత కనపడుతుండగా యింకా ప్రశ్న ఏమిటి ? బెంగాలు విభజనను తప్పన్న ఒక్క మాటను స్వీయ చరిత్రలో చూపగలరా ? స్వదేశీ అంగడి పెట్టిన వైశ్యులతో ఇంగ్లీషు ప్రభుత్వము వలన కలుగు లాభములను చెప్పి వాదించానని వ్రాసుకొనలేదా? వందేమాతరంయొక్క కారణముతో నాకు పేచీలేదుగాని, దానిచే హింస ప్రజ్వరిల్లరాదని మాత్రమే నా ఆకాంక్ష అని ఒక్కగానొక్కమాట ఆయన వ్రాయలేదు. వందేమాతరం బాడ్జీతగిలించు కొనుటేతప్పు అంటూ ప్రారంభించినారు, అలాగే ముగించారు. ఇలా వందేమాతరానికి వ్యతిరేకంగా వేదికలపై ఉపన్యసించారు. వీరిని గాకుండా యింకొకరెవ్వరిని బ్రిటిష్ భక్తుడని దేశద్రోహియని పేర్కొనగలరు ? అట్టి వారు కందుకూరి కన్నా ఆంధ్రదేశంలో ఇంకొకరున్నారేమో తెలుపగలరా ?

# కందుకూరి గ్రంథచౌర్యం

ఎన్ని పదుల గ్రంథములురచించినా- ఎన్ని వేల పుటల సాహిత్యం లోకాన విరజిమ్మినా, ఆడిన అబద్ధాలు చేసుకున్న స్వోత్కర్ష వెలుగునందకపోదు. చేసిన గ్రంథ చౌర్యం మాసిపోదు. వీరేశలింగంగారు అవకాశవాది. ఎప్పటికేది లాభించగలదను కుంటే అప్పుడా వేషధారణచేసేవారు. అది ఆయన స్వీయచరిత్రలోనే అడుగడుగునా గోచరిస్తుంది. ప్రవిమల చిత్తంతో దురభిమానం వీడి- ఆయనచేతలను విలోకించి విశ్లేషణ చేస్తే గోచరిస్తుంది. వీరేశలింగంగారు తమ స్వీయ చరిత్రలో-ఇంగ్లీషు

భాషరానందున కొక్కొండ వారిని మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీనుండి రాజమం బదిలీ చేశారని వ్రాసినారు.

శ్రీ రమాపతిరావుగారే కొక్కొండవారికి ఇంగ్లీషువచ్చునని విశాలాంధ్ర వా ఇటీవల ముద్రించిన కందుకూరి స్వీయచరిత్రలో అధోజ్ఞాపికగాచేర్చారు ఇలాంటివెన్నో దిగవల్లివారు సునిశిత పరిశీలనజేసి వెల్లడించారు. విమర్శకులనబడువారు ఇందు గింజవంటివారుగా నుండాలి. ఇందుపగింజగంధం మురికినీటిలోనేసిన మురికి నిర్మలతను వేరు చేసినట్లుగా వ్యక్తులు తమ ఆధిక్యత కోసం లేని ప్రజ్ఞవున్నట్లు భావింపచేయుటకొరకు అల్లిన కల్లబొల్లి పలుకులను పసికట్టి పదిమందికి తెలి జెప్పాలి. అప్పుడే చరిత్రకు న్యాయం జరుగుతుంది. గొప్పవారుగా చలామణీఅయి వారిని గూర్చి అందునా గతించిన వారిని గూర్చి- ఏనాడో జరిగిన విషయాలను గూ యిప్పుడెందుకని- ఆ చరిత్ర త్రవ్వి తీయడం మంచిదికాదని అనడం చారిత్రకులకుం వలసిన లక్షణంకాదు. కొందరు కీర్తి పరులు ఎలాంటి గ్రంధచౌర్యంచేసి లోకవంచన పాల్పడు తుంటారో తెల్పుడు చేయు సంఘటనవివరిస్తాను.

## చలం గ్రంధచౌర్యం

ఆంధ్ర దేశంలో రమాపతిరావుగారిలాంటి వారి కెందరికో ఆరాధ్య గుడిపాటి వెంకట చలంగారు. విశృంఖలత్వాన్ని యధేచ్ఛగా వ్యాప్తిచేశారు. కా కత్వానికి వావి వరసలక్కరలేదని ప్రబోధించిన వ్యక్తి. రచనలో గల బిగివలన శైలివలన, భాషా సొగసును చిత్రాతిచిత్రంగా చిత్రీకరించే నేర్పువలన ఎందరి ఆకట్టుకున్న వ్యక్తి చలం. వెలసి కొన్నిపదుల గ్రంధాలు రచించారు.

అవి జాతీయోద్యమం ప్రబలంగా వున్నరోజులు. 1935 ప్రాంతమున హిం భాష అభ్యసించడం జాతీయకార్యక్రమములో నొకటి. దక్షిణభాషా హిందీ ప్రచారస మద్రాసువారి "మధ్యమ" పరీక్షకు కట్టి దాని పాఠ్యగ్రంధాలు తెప్పించి పఠిస్తున్నాను అందులో ఒక గ్రంథంపేరు "చార్ యేకాంకి". ఈ గ్రంధకర్త పండిట్ అవధనందన్ అందులో ఒక ఏ కాంకిక పేరు పూజారి" ఇది విక్టర్‌హ్యూగొ "లేమిజరబుల్స్" అనువాదమని అవధనందన్‌గారు తెల్పినారు. చక్కని రచన. కొన్నాళ్ళదాకా హృదయ పేటికలో భద్రపర్చబడిన రచనది. అలంపురం రాజని ఆరోజుల్లో చక్కని కథ డుండే వారు. వారికథలు ఆనాటి పత్రికలలో విరివిగా వస్తుండేవి. ఆయన ఒక కథ చలంగారి రచనను మక్కికి మక్కిగా కొంత, మరికొంత భాషమార్చి వాడినాద అది గ్రంధచౌర్యమని ఆయన్ని దుయ్యబట్టినారు. చలంగారి రచన నాకుతెలియద ఆ రచయిత మొత్తుకున్నా- కొడవటిగంటి ప్రభృతులు వినిపించుకోలేదు. అప్పుడ "ప్రజామిత్ర" వారపత్రిక విజయవాడ నుంచివచ్చినది. మద్రాసు నుండి గూడవల్లి రా



బ్రహ్మంగారి నుండి గొల్లపూడి రామకృష్ణశాస్త్రిగారికి సంక్రమించి వారి ఆధ్వర్యంలో విజయవాడ గవర్నరుపేట నుండి వెలువడుతుండేది. దాని సంపాదకత్వము ఏడిద కామేశ్వరరావుగారు నెరపుతుండేవారు. వారి ఆఫీసుకు తరచూ వెడుతుండేవాడివి. ఒకసారి 'ఆయన' టేబుల్‌పైనమ్మాళ్వార్స్ ప్రచురణ (ఆరోజుల్లో చాలా నవలలు నాటికలు వెలువరించిన సంస్థ) గుడిపాటి వెంకటచలంగారి "నాటికా గుచ్ఛం" వుండగా, తీసి చూశాను. అందు మొదటి నాటిక "పూజారి" పేరుగలది. అది చదివాను. ఎక్కడో యిదివరకే చదివినగుర్తు వచ్చినది. కొంత మదనపడ్డాక అవధనందన్‌గారి హిందీ పొత్తము గుర్తుకొచ్చి రెంటిని దగ్గరపెట్టి పుటపుటనూ చూచాను. హిందీ నాటికకు మక్కికి మక్కి అనువాదం. విక్టర్ హ్యూగో "లేమిజరబుల్స్" చూచాను. చలంగారి పొత్తంలో అనువాదమనిగాని, అనుకరణ అని గాని ఎక్కడా తెల్పబడలేదు. అప్పుడు నేను చలంగారి గ్రంధచౌర్యమును గూర్చి ప్రజామిత్రలో వ్రాశాను. అది చూచి చలంగారు తోకతొక్కిన త్రాచులా లేచారు. ఆంధ్రలో ప్రసిద్ధిచెందిన వారి ఉన్నతిని చూడలేక దిగ జార్చడానికి కొందరు కుట్రజరుపుచున్నారని అందులో యిదొక భాగమని-నాది స్వంత రచనని, అనువాదంకాదని- అనువాదంచేసి రచనలు చేసే కర్మ తనకుపట్టలేదని బూకరించారు, దబాయించారు. గాండ్రించారు. అంతకు యిబ్బడిగా ముబ్బడిగా ఎదురు గాండ్రించాను. కొన్ని వారాలు మా ఇరువురి వాద ప్రతి వాదాలు, విమర్శ ప్రతి విమర్శలు కొనసాగినవి. నేను ఒక్కొక్కపేరా వివరించ పూనుకున్నాను. దాంతో దబాయించిన, బూకరించిన చలంగారు పత్రికాసంపాదకులకు ఒక లేఖవ్రాశారు. అవును నాది అనువాదమే. సొంతంకాదు. ఈ విషయంనమ్మాళ్వార్స్ సంస్థకప్పుడే తెలిపాను. వారు ముద్రించలేదు. పొరపాటు జరిగింది. నాది అనువాదమే. మన్నించండి. ఇక ముందు నా గురించి మీ పత్రికలో వినియోగంచేసిన, స్థలం మరేదైనా ప్రజోపయోగకార్యానికి వినియోగించండి, అంటూ లేఖ యధాతధంగా ప్రజామిత్రలో ప్రచురించారు.

చలంగారి రచనలలో అనేకం ఆంగ్ల, హిందీ రచనలనుండి పరిగ్రహించినవే. ఆ విషయం ఆయన వీరాభిమానులకు తెలియదు. చలం ఒప్పుకున్నా వీరు ఒప్పరు. ఆయన రచనలు సంపుటాలుగా సంపాదకత్వం వహించి ప్రచురిస్తారు. ఈ సత్యాన్ని ఉదాహరించరు. రెండేండ్లక్రిందట ఈనాడు దినపత్రికలో కూడ యీ విషయం ప్రచురించబడినది. వీరేశలింగంను నవయుగ వైతాళికునిగా కీర్తించు భజనపరులది కూడా యిదేబాట.

## వీరేశలింగం గ్రంధ, భావచౌర్యాలు

వీరేశలింగంగారు రాజశేఖర చరిత్ర, ఈసబునీతికథలు మున్నగు ఆంగ్ల రచనల నుండి అనువదించిన వాటిని ఆయా పొత్తములందు ఉదాహరించారు. ఆంధ్ర

దేశంలోని తనకన్న ముందువారివి, తన సమకాలికులైన వారి రచనలనుండి పొందిన ప్రేరణగాని, గైకొన్న విషయాలు గాని, భావాలుగాని ఎక్కడా ఉదాహరించలేదు. అంతా తన సొంతమయినదనే భావన లోకంలో ప్రాచుర్యమందాలని ఆయన దురాశ. సత్యాన్ని మరుగుపర్చడం, అసత్యాన్ని అందలమెక్కించడం శాశ్వతంగా ఎవరి తరమూకాదు. అసత్యం అణగారడం-సత్యం ఉన్నతి నందడం తప్పదు. వీరేశలింగం గారు, రాజశేఖర చరిత్రము, ఈసబునీతి, కథలు అనేకానేక ప్రహసనములు మున్నగు పొత్తములను ఆంగ్లమునుండి గైకొనిన వాటినన్నింటిని ఆయా మూలగ్రంథములకను వాదములనియో, అనుసరణలనియో కందుకూరి తెల్పియేయున్నారు.

ఒక్క తెలుగువారి రచనల నుండి సంగ్రహించినవాటిని గూర్చి యేమాత్రము ఉదాహరించలేదు. ఆయా రచనలు తనను ప్రేరేపించినవైనా తెలుపలేదు. ఇది చాలా దారుణమైన విషయం.

అన్నింటా తానే ఆద్యుడనని తనుచేపట్టిన కార్యములు అంతకుముందెవరూ చేపట్టినవి కావని లోకాన్ని నమ్మించి తన యశస్సును చిరస్థాయిగా చేసుకుందామనే తాపత్రయం ఆయన చరిత్రలో అడుగడుగునా గోచరిస్తుంది.

శ్రీరమాపతిరావుగారు-సామినేని ముద్దు నరసింహనాయుగారు కందుకూరికి మార్గదర్శకులని తానే వ్రాశానని అన్నారు. బెంగుళూరులోని జియ్యరు సూరి (బాలికా పాఠశాలలో పనిజేసినవారు వ్రాసిన "స్త్రీ కళాకల్లోలిని" అనే గ్రంథములోని విషయాలు శీర్షికలు వీరేశలింగం పంతులుగారికి నచ్చాయి. వాటినాయన అనుకరించారు. ఆ భావాలను బలపరిచారు, అని నేను (రమాపతిరావు) పరిశోధన గ్రంథంలో వ్రాయడం జరిగింది (1972)అన్నారు. మరివీటిని కందుకూరి వారు తమ స్వీయచరిత్రలో ఉదహరించనేలేదన్నది రమాపతిరావుగారు ఒప్పుకొంటూ—సూరిగారి గ్రంథాన్ని పేర్కొనలేదనడం నేరమూకాదు. గ్రంథచౌర్యముకాదు అని అన్నారు. మరేమనాలి దీనిని! ఒకరి రచనల నుండి గైకొన్న విషయాలను గైకొన్నానని ఉదహరించనక్కరలేదా? రచనకు తోడ్పడిన, తనకు ప్రేరణనిచ్చిన గ్రంథాన్ని వ్యక్తుల్ని పేర్కొనడం సంస్కారయుతమైన చర్య.

ఆనాడు ఆ పని అలవాటు లేదనుటేమిటి ? కందుకూరే ఆ పనిచేశాడు. అయితే ఇంగ్లీషు అనుకరణని చెప్పుకొని తెలుగు అనుకరణలను చెప్పలేదు. కందుకూరి గారా పద్ధతిని బుద్ధిపూర్వకముగా విడనాడినారు. తెలుగులో తానే ఆద్యుడనిపించు కోవాలని అలా చేశారు. ఈ విషయమునే దిగవల్లివారు చెప్పారు. ఒకటి రెండుచోట్ల తాముదహరించినటువంటి విషయాలనేకం వక్రీకరించినారన్నారు. కినుకెందుకు దానికి ?



# వీరేశలింగం కవుల చరిత్ర

వీరేశలింగంగారు ఎంతో శ్రమించి రచించిన కవుల చరిత్ర ద్వితీయ ముద్రణ వెలువరించే కాలములోనే కాదు మొదటి ప్రచురణలోకూడా ఆయన అనేకం చూచి ఇతర రచనలనుండి గ్రహించినారు.

1. కావలివారి "హిష్టరీ అఫ్ దక్కన్ పోయట్సు"
2. బ్రౌను "ఎస్సె ఆఫ్ ది లాంగ్వేజిస్ అండ్ లిటరేచర్ ఆఫ్ తెలుగూస్.
3. గురజాడ శ్రీరామమూర్తిగారి కవి చరిత్రలు

కందుకూరికి ముందున్న ప్రయత్నములు మెకంజీ మాన్యు స్క్రిప్టులో చాలా కవుల కథలున్నాయి. అవన్నీ కందుకూరిగారు చూడకపోలేదు.

వీటినికూడా ఆధారం చేసుకొని ఆయన కవుల చరిత్ర వెలువరించారు. అయినా తన రచనకు తోడ్పడిన వీటి గూర్చి ప్రస్తావనేలేదు. అదే వారిలోవున్న తప్పు. మొదటి ప్రచురణలో ఎవరినీ తలవలేదు.

రమాపతిరావుగారే తమ విమర్శలో "కందుకూరివారు ఒక్క చేతిమీదుగా రెండువందల మందిని మించి కవుల చరిత్రలు సేకరించలేదా ?" అని పేర్కొన్నారు. మరి ఆ కవుల చరిత్రలు ఎలా, వేటినుండి సేకరించారో కవుల చరిత్ర ప్రథమ ముద్రణలో పేర్కొనలేదన్నది నిజమే గదా! ఆ మాటే దిగవల్లి వారంటే ఎందుకు దుగ్ధ ?

కందుకూరి తనకు ముందున్నవారి వ్రాతలనుండి సమకాలీనుల రచనలనుండి భావాలు, రీతులు, ఎన్నో సంగ్రహించి తనవిగా చేసుకున్నారు. అవి ఒక్కొక్కటి వరుసగా పేర్కొంటే చేటభారత మౌతుంది. ఆంధ్ర శేషగిరిరావుగారు ప్రసిద్ధ రచయిత. ఆయన ఒకసారి కందుకూరి గ్రంథచౌర్యం చేసిన దిట్టయని పేర్కొన్నట్లు నాకు గుర్తు.

పోతే రమాపతిరావు-చిన్నవి,పెద్దవీకందుకూరి 134పొత్తములు రచించినవారని, 8 వేల పుటలకు మించి పుస్తకరూపం పొందించినవారుఅనీ గ్రంథచౌర్యం చేశారనడం భావ్యమా అన్నారు. ఎందుకు కాదు ? చలం సంగతి ఏమి తెలుపుతున్నది? ఆయన రచనారంభంలోనే కాదు ప్రసిద్ధుడైన పిదపకూడా చౌర్యం చేశాడు. వీరేశలింగం ఆద్యంతమూ చేసాడు. ఒక పద్ధతి ప్రకారం చేశాడు. కవుల చరిత్ర పునర్ముద్రణ వరకూ చేస్తూనే వున్నాడు.

ఐతే వాసి ముఖ్యంగాని రాశి కాదు. రాశినిబట్టి చూద్దామన్న కవి సార్వభౌమ శ్రీ పాద కృష్ణమూర్తి శాస్త్రిగారు కందుకూరికి మించి గ్రంథాలు వ్రాసియున్నారు. కవిసామ్రాట్ విశ్వనాథ సృష్టించిన సాహిత్యం కందుకూరికి మించినది. అయితే వారు ఏవైనా దొసగులకు పాల్పడి యుండిన విమర్శించరాదనడం అదేమి హితోక్తి.

## డాంగేపై కనపర్చిన వైఖరి కందుకూరిపై చూపరేల?

డాంగే కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాతలలో ముఖ్యుడు. అనేక సంవత్సరములు ఆ పార్టీ నేతగా నుండిన వ్యక్తి. ఆయన 1942 ప్రాంతమున బ్రిటీష్ గవర్నరు జనరల్‌కు విధేయునిగా మెలగినాడని ఆయన వారికి వ్రాసిన లేఖను కనుగొని మిక్కిలి దీక్షతో ఢిల్లీ ప్రభుత్వ చారిత్రక పత్ర నిలయమునకు వెళ్ళి శోధించినవారు కమ్యూనిస్టు పార్టీవారు. మరట్టివారు - బ్రిటీష్ పాలకులకు వత్తాసుగా నిలచిన జాతీయాభిమాన శూన్యుడైన కందుకూరిని నవయుగ వైతాళికుడని, మహానుభావుడని ఎట్లా అనగలుగు చున్నారో అవగతమగుటలేదు.

తమ ఉద్యమాన్ని ఆయన్నాధారముగా చేసుకొని గతంలో పొగిడిన పొగిడి యుండవచ్చు గాక! అన్ని విషయములు తెలియని కాలమున ప్రస్తుతించి ఆయన్ని కొండమీద కూర్చుండబెట్టి యుందురుగాక! విషయములు ఒక్కటొక్కటి తెలిసిన పిదప కూడ - మొదటి తను మొండివైఖరిని, అనుచిత ప్రకీర్తనను విడనాడకుండడం సమంజసము కాదు.

## కందుకూరి పాండిత్యం

కందుకూరి చదువుకున్న వ్యక్తి అనడంలో సందియములేదు. ప్రజ్ఞావంతుడను టలో వివాదముండదు. సంస్కరణోద్యమము నడిపిన వ్యక్తనడంలో అభిప్రాయభేద ముంచనవసరములేదు. కార్యదక్షుడనడంలో అనంగీకారముండదు. వచ్చినచిక్కల్లా- ఆయన మహా పండితుడనడం, సంస్కరణోద్యమానికి ఆదునిగా ప్రకీర్తించడం, ప్రథమ నవలా రచయితగా ప్రస్తుతించడం, ఆంధ్రావనిలో స్త్రీ విద్యా ప్రథమ వ్యాప కుడనడం-తప్పు. ఆయన ప్రజ్ఞాపరాధుడు. ఆయన వ్రాసిన వ్రాతలు ఎన్నో దోషభూయి ష్ఠమైనవి. ఈనాటికీ ఆ దోషాలు ఒప్పులుగా వక్కాణింప వచ్చిన దుస్థితినుండి విజ్ఞ లోకము కోలుకోలేదు. మచ్చుకు ఒకటిరెండు.

## మేషమంటే మేకా?

మా చిన్ననాట ఎనిమిదవ తరగతి వరకు కందుకూరి వీరేశలింగంగారు రచించి-మాక్మిలన్ అండ్ కంపెనీవారు ప్రచురించిన వాచకములే పాఠ్య గ్రంథములుగా



వుండేవి. ఆ వాచకములలో మేషమంటే మేకని వ్రాయబడినది. ఈ విషయము పెద్ద బాల శిక్షలోకి కూడా ఎక్కినది. మేషమంటే గొర్రెకాని మేకకాదు.

ఛాగల, ఛాగ, బస్తక, అజ, లంబకర్ణ, బోళకములు మేకనామములు.

"మేషే శృంగిణ సంఫాల వృష్ణి పేత్వహాలు హ్రదాః-- ఏడ కోప్యూరణో మీఢ ఉరభ్రో రోమశోప్యవిః-- ఇవి గొర్రెపేర్లు.

వారన్నంతవరకూ ఎన్నెన్నో ముద్రణలు పొందిన ఆ వాచకాల్లో మేషమంటే మేకనే లిఖించబడినది. ఈ మాత్రం శబ్దానికికూడా అర్థము వారికి ధాత్రీదేవి అనుగ్రహించలేదు.

## భారతదేశ నామం శకుంతలా తనయుని పేర యేర్పడినదా?

కందుకూరివారి వాచకములలో భారతదేశమునుగూర్చి పేర్కొంటూ "శకుంతలా దుష్యంతుల కొమరుడైన భరతుని వలన యీ దేశానికి భారతదేశమని నామమేర్పడి నది" అని వ్రాయబడినది.

ఇది ఘోరమైన తప్పిదము. ఆర్ష వాఙ్మయమునం దేమాత్రము పరిజ్ఞానమున్న వారెవ్వరైనా ఇట్లు వ్రాయరు.

శకుంతలా దుష్యంతులకు పూర్వమూ ఇది భారత దేశమే. భరతుని వలన, దుష్యంతుని కొమరుని వలన, శ్రీరామ సోదరుని వలన యీ దేశానికి భారతదేశమన్న పేరు రాలేదు.

పదునాల్గురు మనువులలో మొదటివాడైన స్వాయంభువమనువు ఆర్యులను ఉత్పత్తిని బొందించి, పోషించి, పాలించి, భరించినందున అతనికి భరతుడు అనుపేరు కలిగినది.

"భరణాచ్చ ప్రజానాం వై మనుర్భవతి ఉచ్యతే"

ప్రజలను భరించినందున మనువు భరతుడని చెప్పబడుచున్నాడు. ఆయన పాలించిన దేశము గనుక భారతదేశముగా పేర్కొనబడినది.

శ్రుతి : "ఇమ ఇంద్ర భరతస్యపుత్రా అపపిత్వంచ
పితుర్న ప్రపిత్వం"
(ఋగ్వే 3-4-53-54)
"ఇదంతు మధ్య మంచిత్రం, శుభాశుభ ఫలోదయం
ఉత్తరం యత్సముద్రస్య, హిమవద్దక్షిణం చయత్
భరణాచ్చ ప్రజానాంవై, మనుర్భరత ఉచ్యతే
నిరుక్త వచనాశ్చైవ, వర్షం తద్భారతం స్మృతం"

మనువు పాలించిన దేశం కనుక భారతమైనది.

అటులనే విష్ణు పురాణమున—

“ఉత్తరం యత్ సముద్రస్య
హిమాద్రే శ్చైవ దక్షిణం
వర్షం తం భారతం నామ
భారతీ యత్ర సంతతి”

దేశపు ఎల్లలతోకూడ వివరింపబడినది.

మరీ దేశ నామం భరతుని వలన వచ్చినదనువారి పాండితీ ప్రజ్ఞలను గూర్చి యేమనాలి ?

మరియు “భరత”మన యజ్ఞము. ఈ దేశము యజ్ఞ దేశమయినందున భారత దేశమనబడినది. ఆర్యావర్తః యజ్ఞ భూమి” అని సూక్తి.

యజ్ఞములు నిర్వర్తింపబడు దేశమైనందున “భారతదేశమనబడినది.

“బ్రహ్మోదనాగ్నిర్భరతో యవిష్ఠస్సవనాహుతౌ”....

మరి వీరేశలింగంగారి వ్రాతకేమనాలి ? ఆ వ్యక్తి పాండితీ పాటవము లేపాటిదో అప్పటి విజ్ఞులకు తెలియును. వారి రచనలలో ఎన్నో దొసగులున్నవి. అవి భాషా పటిమగలవారు, పాండితీ ప్రపూర్ణులు అయితే వ్రాయవలసినవి కావు.

## నక్షత్రాల సంఖ్యలోనూ తప్పే

నక్షత్రాలు 27 అని వ్రాశారు.అదితప్పు.28 అని చెప్పాలి.‘అభిజిత్’ నక్షత్రాన్ని ఆయన చెప్పలేకపోయాడు. సాధారణులు 27 నక్షత్రాలని వాకొనడంవేరు. పండితులు, విజ్ఞులు అనదగువారు చెప్పవలసినది కాదు. నక్షత్రములు 28, దక్షుని కుమార్తెలు. వారి పతి చంద్రుడని శాస్త్రము.

“ప్రజాపతేర్హి దుహితృం రష్టావింశతిమం కుమాని
........” అగ్నివేశ సంహిత సుప్రసిద్ధమైన విషయాలందే తప్పులు వ్రాశాడు.

ఎంతో వాఙ్మయం సృష్టించాడు కందుకూరి అన్నారు రమాపతిరావుగారు. కానీ ఆయన సమకాలీకుడైన గురజాడ కందుకూరి సాహిత్యంపై ఎంతో తేలిక భావమునే ప్రస్ఫుటీకరించారని శివరావుగారు చూపించితే నీళ్ళు నమిలారుగదా ! ఇక వినవలసినది గిడుగువారిని.

1936 డిసెంబరు నెలలో శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు “రామ్మూర్తి పంతులుగారితో 36 గంటలు” అనిప్రకటించిన రచనలో గిడుగు రామమూర్తి పంతులు గారికి వీరేశలింగంగార్ని గూర్చి ప్రస్తావిస్తూ-

“వీరేశలింగం పంతులుగారు పండితులనడానికి వీల్లేదు; కాని పండితులే” అంటూవ్రాశారు. అభ్యుదయ సంచికలోనే వేసి వుంది.

# వీరేశలింగం గారినే వినండి !

## ఇంగ్లీషు ప్రభుత్వము వలని లాభములు

వీరేశలింగ సంపూర్ణగ్రంథావళి - 8వ సంపుటం

“ఇంగ్లీషువారు హిందూదేశమును జయించుటకు పూర్వము మహమ్మదీయుల దుష్టపరిపాలనముచేత దేశముయొక్కస్థితి మిక్కిలి చెడియుండినది. అక్బరు మొదలైనవారి కొందరి పరిపాలనములోతప్ప సామాన్యముగా నిరంకుశప్రభుత్వము దౌర్జన్యమునకు దేశము చిరకాలము లోబడి యుండుటచే పాడి పంటలకు లోపముకలిగి తరుచుగా క్షామములు వచ్చుచు, తిన్నగా ధనప్రాణములకు సంరక్షణము లేకపోవుటయే గాక చిరకాలదాస్యమునకును స్వేచ్ఛావిహారుల నిరంకుశాధికారమునకును లోబడి యుండుటవలన జనులును, మొత్తముమీద పురుషులకు సహజమయిన ధైర్యసాహసములును, సత్యము ఋజువర్తనమును పోగొట్టుకొని పిరికితనమునకును మోసమునకును సత్యానాదరమునకును నందున ఈ భరతఖండమిటువంటి దుస్థితి యందుండగా భాగ్యవశముచేత న్యాయపక్షావలంబులును ప్రజాక్షేమాచరణ పరాయణులునయిన ఇంగ్లీషువారు మనకు ప్రభువులుగా తటస్థించినది.” అని పంతులుగారు వ్యాసమును ప్రారంభించి ఇంగ్లీషుపాలనలో శాంతిభద్రతలుండుటను గూర్చి అనేక ప్రజోపయోగకరములైన సౌకర్యములు కలుగుటను గూర్చి వివరించి—“ ఇంగ్లీషువారు దేశక్షేమకరములయిన సాధనములను మితిమీరి చేయుటయేగాక జనుల జ్ఞానాభివృద్ధికిని నీతి వృద్ధికిని శ్రద్ధవహించి అనేక పాఠశాలలు స్థాపించిరి.... అన్నిటికంటె ముఖ్యముగా ఈ దొరతనమువారు మనకు కావలసినంత స్వేచ్ఛను కలుగజేసియున్నారు. అపరాధము చేయకపోయిన పక్షమున ఎల్లవారు మహారాజులవలెనుండి స్వాతంత్ర్యములు సమస్తసుఖములు ననుభవింప వచ్చును.

పూర్వము కొన్ని జాతులవారు పల్లకీలెక్కకూడదని, గోడలకు వెల్లవేసికొనకూడదని యుండెడు నిర్బంధము లేవియులేవు. ఇటువంటి సత్పరిపాలనము మరియే ప్రభుత్వము నందును లభింపదు. మనుష్యులకు భ్రమప్రమాదాదులు సహజములగుట చేత వీరి దొరతనము నందును గొన్నిలోపములున్నవి గాని యివియంతగా పాటింపదగినవికావు.

కాబట్టి మనదేశము యొక్క పురోభివృద్ధికయి యీ ప్రభుత్వమే చిరకాలముండవలెనని జగదీశ్వరుని ప్రార్థించుచు జనులు కృతజ్ఞులయి ప్రభుభక్తికలవారయి యుండవలెనని.”

# రాజ్యాంగ సంస్కరణము, కులాచార సంస్కరణములు

(వీ-సంపూర్ణగ్రంధావళి) 8వ సంపుటం

బొంబాయి నగరమునుండి యొకానొక లండన్ పత్రికకు వ్రాయుచు రాజ్యాంగ విషయములయందు మార్పులను గోరి పాటుపడెడు హిందూ ప్రముఖులు కొందరు రాజ్యాంగవిషయముల యందే తమకాలమును వ్యర్థపుచ్చుట కంటె కులాచారవిషయము లందు మార్పులు కలుగజేయుటకు శ్రద్ధచేసి పాటుపడుట సర్వోత్తమమనియు, నీతి విషయమున మాత్రమే గాక శరీరదార్ఢ్య విషయమున గూడ మితిమీరిన నష్టముల నాపాదించుచున్న అతిబాల్యవివాహములను వివాహములయందు తప్ప భర్త యయినట్టి వాని మొగమెట్టిదో యెఱుగని పసిబాలికలకు సహితము సంతత వైధవ్య దుఃఖము ననుభవింప నిర్బంధించుచు బలవంతపు విధవాత్వములను జాతిమత ద్వేషాదులవలన కలిగెడు సకలానర్థదాయకములయిన క్రౌర్యములను, పరిశుద్ధాస్తిక మతమునుండి నీచ మయిన శుద్ధవిగ్రహారాధనమునకు మారిన మతక్షైణ్యములను జనసామాన్యమునందు విద్యావిహీనత వలన గలుగుచున్న మోసములను మాన్పుటకయి ప్రయత్నించుట దేశమున కెంతయు శ్రేయస్కరమని వ్రాయుచున్నారు. వారువ్రాసిన యంశముల యొక్క సత్యమును మేముపూర్ణముగా నెఱిగియున్నాము. రాజ్యాంగ విషయముల యందు, స్వాతంత్ర్యములను పొందుటకు ప్రయత్నించుట యత్యంతావశ్యకమే యయినను, కులాచార సంస్కరణముల నిమిత్తమయి పనిచేయక యొక్క రాజ్యాంగ విషయములందు మాత్రమే పాటుపడుచుండుట దేశమునకు క్షేమకరము కాదని మేము భావించుచున్నాము.

తనకులమువానికిని తనకుటుంబమందలి యనాథలైన నిర్భాగ్యకాంతలకును వారి స్వాతంత్ర్యములనిచ్చి వారిని సుఖపెట్టనేరక కలకాలము దుఃఖపెట్టుచుండెడువారు జన సామాన్యము యొక్క సుఖమునకెట్లు తోడుపడగలరు ? ఇంట గెలిచి రచ్చగెలువ వలెను. ముందుగా తమ గృహముల యందును తమ కులముల యందును గల లోపములను నివారించుకొని వారికి సౌఖ్యానందములుకలుగజేసికదా దేశముయొక్కయు జనసామాన్యము యొక్కయుసుఖాభివృద్ధినిమిత్తమయిపనిజేయవలెను! అతి బాల్యవివాహ ములచేతను నిర్బంధవైధవ్యము చేతను ఇతరక్రూరాచారముల చేతను ప్రతికుటుంబము నందును సుఖములు గానక యెల్లవారును బాధపడుచుండగా వారికి రాజ్యాంగ విషయ మయిన స్వాతంత్ర్యములెన్ని వచ్చిన నిజమైన సౌఖ్యము కలుగును ? కాబట్టి మనవారి పుడు పరిపాలన నిమిత్తమయిన స్వాతంత్ర్యముల నిమిత్తమెట్లు పాటుపడుచున్నారో అట్లేకులాచారములలో కాలానుగుణములయినట్టియు సుఖాభివృద్ధి కరములయినట్టియు మార్పులను కలిగించుటకయి ప్రయాసపడవలెను. అయినను రాజ్యాంగ స్వాతంత్ర్య



విషయములలో వాగ్యుద్ధమున మహాశూరులుగా నున్నవారు కులాచారవిషయములైన మార్పుల నిమిత్తమయిన పోరాటములో పిఱికిపందలుగా నుండుటకు కారణములేక పోలేదు.

మొదటి విషయములో దూరముగానుండి గవర్నర్ జనరల్‌గారినో, స్టేటు సెక్రటరీగారినో, గవర్నరుగారినో, రాజశాసనమునో పత్రికాముఖమున నాక్షేపించికావలసి నంత ధ్వనిచేసి యేవిధమయిన కష్టములకును నష్టములకును లోనుగాకయే జనులచే సులభముగా గట్టివాడని పేరుపొందవచ్చును. అందువలననే మనదేశమందింతమంది చదువుకొన్నవారున్నను స్థానికస్వపరిపాలనము మొదలగు విషయములందు ఉపన్యాస ములు చేయువారున్నను కులాచారాదులను బాగుచేయుటకై పాటుపడువారెపుడోగాని కానరాకున్నారు.

(28, సెప్టెంబరు, 1885)

# కులాచార మతాచార సంస్కరణము

(6, ఏప్రిల్-1887 వివేకవర్ధని పీ—సంపూర్ణ గ్రంధావళి-8వ, సంపుటం)

ఇప్పుడు మనదేశము నందెక్కడ జూచినను హూణభాషాభ్యాసము చేసినవారిలో రాజ్యాంగవిషయమైన స్వాతంత్ర్యములు కావలెనని ప్రసంగము చేయువారు లెక్కకు మిక్కిలిగానున్నారు. అట్టివారు జనప్రతినిధి పరిపాలనము కొంతవరకేర్పడినంత మాత్రముచేత జనులుసుఖపడుదురనియు, మన దేశమునకా స్వాతంత్ర్యముకన్న కావలసినది మఱియేమియులేదని భావించుచున్నారు. ప్రభుత్వము వారికి జనులకుండ వలసినంత స్థానికపరిపాలనమును యితర స్వాతంత్ర్యములను యియ్యనందునకయి దూషించుచువార్తాపత్రికలయందు ప్రచురించియు, సమాజములలో ప్రసంగములుచేసియు వారింతటితో కృతార్థులగుచున్నారు. అట్టివారిని చూచి సామాన్యజనులు వారు తమ దేశమునుద్ధరింపనవతరించిన మహాపురుషులని భావించి వారినూరక పొగడుచుందురు. ఇతర విషయములందు వారికున్నదుర్గుణములను పాటింపక యీ విషయమునందు వారు చేసిన అల్పకార్యములను మహాకార్యములుగా కొనియాడుచుందురు. ఇట్టి స్తోత్రములచేత వారు పరమానందభరితులయి లోకములో తామే గొప్పవారమనుకొని గర్వపడుచు కష్టపడకుండ వట్టిమాటలతోవచ్చిన తమకీర్తిని జూచి దేశాభివృద్ధి నిమిత్తమయి కష్టపడువారిని బుద్ధిమాంద్యముగలవారని భావించుచున్నారు. అంతటితోనైన నూరకుండక

చౌకగా పేరుపొందుచున్న యీ మహాపురుషులు కులాచార మతాచార విషయములైన మార్పులకింకను సమయమురాలేదనియు సమయము వచ్చినప్పుడా మార్పులెవ్వరి ప్రయత్నములు నక్కఱలేక తమంతతామే జరుగుననియు ఈ రెండు విషయము లందును ప్రస్తుతమున్న ఆచారములే మంచివియు సుఖప్రదమయినవియు, క్రొత్త మార్పుకై ప్రయత్నించువారు దేశమునకనర్థము దెచ్చుచున్నారనియు అందుచేత వారు నిందార్హులనియు మీదుమిక్కిలి ఘోషించుచున్నారు. మూఢులయినజనులుగూడ వీరితోజేరి కులాచార మతాచారములను సంస్కరింపగృషిచేసెడువారిని బాధింప మొదలు పెట్టుచున్నారు. ప్రతివిషయమునందును వారి ప్రవర్తనమును నిపుణముగా పరీక్షించి వారిలోపములను వెల్లడిచేయుటయేగాక వారియందుండు గుణములకు సహితము విపరీతోద్దేశముల నారోపించి పలువిధముల దూషించుచుందురు. ....................
..........................................................................................
ఇటువంటివారు తాము లోకోపకారములు చేయకపోయినను. చేయబూనినవారిపై లేనిపోనివంకలుపెట్టి నిరుత్సాహ పరుపకయూరకొన్నను కొంతలోకోపకారముగా నుండును.

ఓ విద్యాధురీణులారా ! రాజ్యాంగవిషయమున కొన్ని స్వాతంత్ర్యములువచ్చి నంతమాత్రముచేత దేశమంతయు బాగుపడునని స్వప్నావస్థయందును తలంపబోకుడు. ఇల్లుబాగుపడినను దేశము బాగుపడదు. ఈ సంగతిని మీరు నిశ్చయముగా మనసు నందుంచుకొని రాజ్యాంగ సంస్కరణముతో పాటుగా కులాచార మతాచార సంస్కరణ మునకు గూడ కృషిచేయుచు,చేసెడువారిని నిరుత్సాహపరుపక సహాయపడుచుండవలెను. కులాచారములందలి దోషములుపోయినగాని ఐక్యమత్యమురాదు, ఐకమత్యమునగాని యీ స్వాతంత్ర్యమువలనను జనులకు ప్రయోజనము కలుగదు. (8, ఏప్రిల్—188.)

వ్యాఖ్య

ఇందులో మొదటిరెండువ్యాసాలు కాంగ్రెసు పుట్టనున్న పుట్టుతున్న సంవత్స రంలో వ్రాసినవి. దానిని ఏర్పరచేందుకు ప్రయత్నాలు జరుగుచుండగా వ్రాసినవి. 1884 మే నెలలో మద్రాసు మహాజనసభ జరిగి, ఆ వెంటనే మనరాష్ట్రంలో పలు పట్టణాలలో దానిశాఖలు ఏర్పడుచుండగా వ్రాసినవి. జాతీయసంస్థ పుట్టుకకు తొమ్మిది నెలలుముందుగా దానికి వీరేశలింగంగారు చెప్పదలంచుకొన్న తొలి స్వాగతవాక్యంగా వ్రాసింది ఇంగ్లీషుప్రభుత్వమువలన లాభములు.

అటువంటి వ్యాసమును వారంతకుముందు వ్రాయలేదు. వారిలోవున్న భావాలటు వంటివి. క్రైస్తవమిషనరీలతోను స్థానిక ఇంగ్లీషు పరిపాలన, విద్యా అధికారులతోను వున్న అనుబంధాలు అంతకన్న మరొకస్థాయివి అయివున్నప్పటికి, ఇటువంటి ప్రభుత్వ ప్రచారసాధన మనదగిన వ్యాసం అంతకుముందు ఆయన వ్రాయలేదు. తెలుగువారిలో మరెవ్వరూ వ్రాయలేదనవచ్చు. మరే తెలుగుపత్రిక వ్రాయలేదు.



జాతీయసంస్థ పుట్టుకకు ఇంగ్లీషు ప్రభుత్వము చిరాయువుకావలెనన్న దైవప్రార్థనను వీరేశలింగము చేశారు. అదేవారి ముఖమును చూపే అద్దము.

అప్పటినుంచి చిన్నతరగతి వాచకములలో దాని సారాంశమే పాఠమయింది. వారు వ్రాసిన మాక్మిలన్ వాచకాలకెక్కి వారు చనిపోయిన తర్వాతకూడ చాలకాలము దాకా, అనగా 1930వ పడికోకూడా బడిపాఠముగా వుండేది.

హిందూప్రముఖులు రాజకీయాందోళనలో కాలం వ్యర్థపుచ్చక సంఘ సంస్కరణ కృషిలో మునిగితేలవలసినదని లండన్ ఇంగ్లీషు పత్రికలో ఒక బొంబాయి నివాసి వ్రాసిన సలహాను తెలుగున బలపరచేవాడను నేనున్నానని వ్రాసిందే రెండోవ్యాసం. పేరులేని ఆ బొంబాయి నాగరుడు "వ్రాసిన యంశముల యొక్క సత్యమును తాము సంపూర్ణంగా ఎరిగియున్నామ"ని గదా ప్రారంభించారు. ఇంకేమి వివరణ కావాలి. కాకపోతే తెలివిగా రాజకీయాలు బొత్తిగా మానుకోమనకుండా, అప్పుడే మొదలై ఒక వ్యవస్థిత రూపం పొందక పూర్ణంగా అంకురించనట్టి స్థితిలోసైతంఒక్క రాజకీయ వ్యాపకమే దేశక్షేమానికి చాలదంటూ దాని ప్రాధాన్యాన్ని తగ్గించి, సంఘ సంస్కరణ ప్రాధాన్యాన్ని అతిశయోక్తులతోనింపి, దానిని విస్మరింపరాదంటూ ఘోష పెట్టడం ప్రారంభించారు. ఈ రకమైన జోడింపుమాటలు ఇందులో మొదలుపెట్టి 1915 వరకు విడవకుండా వ్రాసి ప్రసంగిస్తూనే వచ్చారు. కాంగ్రెసును ఇంకా పెట్టకముందే 1885 సెప్టెంబరు నాటికే అప్పటి రాజకీయాందోళనాకారులు మాటలు చెప్పి కష్టము నష్టము పడకుండా యిట్టే తేలికగా కీర్తిని మూటగట్టుకు పోతున్నారని ధ్వజమెత్తారు, హేళన మొదలుపెట్టారు. ఇదే 1907 దాకా నిర్విరామంగా ఘోషించే వారు. 1887 తర్వాత కాంగ్రెసు రాజకీయ మహాసభల మరునాడు కాంగ్రెసు సంఘ సంస్కరణ మహాసభను అనుబంధంగా జరిపించే ఏర్పాటుచేసి రాజకీయంతోపాటు సంఘ సంస్కరణను జోడించుకొంటుండేది ఆనాటి కాంగ్రెసు. ఆ సభకు వీరేశలింగం వెళ్ళి జిల్లా, రాష్ట్రస్థాయి సభలలో ఆయన కులాచార సంస్కరణోపన్యాసాలను చేస్తుండేవారు.

ఇక మూడో వ్యాసం పంతులుగారు రాజమండ్రి కాంగ్రెస్ రాజకీయ మహా సభలో పాల్గొనే యేడు- 1887లో- వ్రాసింది. ఆయన రాజకీయ మహాసభలో పాల్గొ నటంమొదలు- తుదికూడా అదే. పంతులుగారు ఇంగ్లీషు చదువు మెట్రిక్ దాటలేదు. అంతలోగా ఆయనకు కలిగిన ఇంగ్లీషు సంస్కృతి పరిపాలనల మీద కలిగిన అవ గాహన ఎంతగాఢమైనదో గొప్పదోయోచించండి. ఆయనగారికన్న ఎంతో అధికంగా ఇంగ్లీషుచదువులు చదివిన ఆంగ్ల విద్యా విశారదులు యిటువంటి తెలుగు పండితులభావ ఆధిక్యసారథ్యాలను ప్రక్కనబెట్టేదశ అవిష్కృతమయింది. ఆంగ్ల విద్యాధికులే ఆంగ్ల ప్రభుత్వము అది చేయుటలేదు, యిదిచేయుటలేదని విమర్శించడం ఆయనకు విపరీతంగాతోచింది. అది కృతఘ్నతగా కనిపించింది. 1874లో ఆరంభమైన ఆయన

పత్రికారచకత్వం 1887 నాటికి వెనకబడినట్టయింది. ఆనాటి ఆంగ్ల విద్యాధికుల తరానికి ఆతరంవారి భావాలకు ఆయన దూరమవుతున్నట్టు మూడోవ్యాసం రుజువు చేస్తున్నది. అప్పటికి అన్నిరంగాలలోను జాతీయసంస్కృతీ గౌరవం పెరిగింది.

ఆనాటి రాజకీయాలు ఎన్నిమాటలు చెప్పినా ఎంతెంత విమర్శలు చేసినాగాని అది తెల్లదొరతనం ముందు విన్నపాలదశలోనే వుండి, రాజభక్తి ప్రకటన తొలి తీర్మానంగా చేసి తర్వాతనే దేశసమస్యలను పరిష్కరించమని, పాలనలో ప్రాతినిధ్య మిమ్మని, పై ఉద్యోగములిమ్మని, అప్షను, యుద్ధవ్యయం మా దేశంమీద వేయవద్దనుట వంటివేగాని స్వరాజ్యమువంటి భావాలదాకా వెళ్ళనట్టి ప్రాథమికదశ అది కూడా వీరేశలింగానికి సమ్మతంకాలేదని, ఆపాటి రాజకీయాలే బ్రిటిష్ వ్యతిరేకమయినవని బ్రిటిష్‌వారిపట్ల ప్రేమాభిమానాలు ప్రభుభక్తిని పెంచడమే కాంగ్రెసు ప్రథమ కర్తవ్యమని వక్రభాష్యం చెప్పినట్టి వ్యాస భాగాల్ని స్వీయ చరిత్రలో సంక్షేపంగా యిచ్చిన దానిని యిచ్చినట్టుగా వేరే యిప్పుడు యిస్తున్నాము. వీరేశలింగంగారు తమ జాతీయత, దేశభక్తి లోతుపాతులెట్టివో, ఆ పాటి దేశభక్తి జాతీయతలతో అప్పట్లో రాజభక్తికి లోబడి నడుస్తున్న విజ్ఞప్తి రూప ఉదారవాద రాజకీయస్థాయికి కూడా ఎలా బాహ్యమైవున్నవో ఆ సంక్షిప్తరచనే తెలుపుతున్నది. బ్రిటిష్‌వారిపై ప్రేమాభిమానాలను, ప్రభుభక్తిని పెంచడమే కాంగ్రెసు ముఖ్యాతిముఖ్యమైన ఉద్దేశమని వక్రభాష్యం చెప్పిన తన వ్యాసాన్ని ముమ్మందుగా స్థానిక యింగ్లీషు అధికారులకు పంపించుకొన్నానని కూడా అందులోనే తెలపడం గమనార్హం. ఆయనగారు ఏ స్థాయిలో నడిచేవాడో అంతకన్న ఏమికావాలి ?

—త్రిపురనేని

## స్వీయ చరిత్ర నుండి

రాజ్యాంగ విషయములలో నా కాదరములేనట్లు భావింప వలదు. దేశాభివృద్ధి కనుకూలములగు సమస్త విషయములలోను నాకాదరము గలదు. నేను పదునాలు గేండ్లు వివేకవర్ధనికి విలేఖకుడనుగానుండి దానిలో రాజ్యాంగ విషయకములైన వ్యాసములను వ్రాసితిని. హైందవదేశీయ మహాసభ యారంభమయినప్పుడు నా మిత్రులైన న్యాపతి సుబ్బారావు పంతులుగారు మొదలయినవారితో గలిసి నేనును



గొంతపని చేసితిని. ఆ మహాసభ 1887-వ సంవత్సరమున మొదటితడవ చెన్నపట్టణములో జరుగుటకు ముందు రాజమహేంద్రవరములో జరిగిన సభలో నేనొక యుపన్యాసకుఁడనుగానుండి చెన్నపురి మహాసభకు నేనొక ప్రతినిధిగా బంపఁబడితిని. ఆ సభలో నాకు ప్రతినిధులకిచ్చు స్థానము నిచ్చియు, నా మిత్రులైన సభాధ్యక్షులు దొరతనమువారి కొలువులో నుంటినన్న హేతువుచేత నా పేరును ప్రతినిధులపట్టికలో బ్రచురింపక విడిచిపెట్టిరి. ఈపని నాయనుమతిమీద జరిగినదికాదు. 1985వ సంవత్సరమున 'దేశీయ మహాసభయు దాని యుద్దేశములు'నని రాజమహేంద్ర వరమునందొక యుపన్యాసమిచ్చి దానిని ముద్రింపించి విద్యావిచారణాధికారి మొదలయినవారికి సహితము పంపితిని. మత నీతి కులాచారసంస్కారములు లేక యొక్క రాజ్యాంగ సంస్కారము వలననే దేశమభివృద్ధి బొందునని నేనెప్పుడును తలఁచినవాఁడగాను. దేశాభివృద్ధి కన్నిటిలోను సమానముగా పనిజరగవలెనని నాయభిప్రాయము. దేశముయొక్క యిప్పటి యభివృద్ధి ఇంగ్లీషువారి పరిపాలన యే మూలమనియు వారి పరిపాలనము నిరంతరముగా సాగుటచేతనే ముందును దేశమభివృద్ధిని గాంచుననియు నాకు దృఢమైన నమ్మకము.* నా యభిప్రాయములు తేటపడుటకయి దేశీయ మహాసభను గూర్చి నేనిచ్చిన యుపన్యాసములోని కొంత భాగము నిందు ప్రకటించుచున్నాను—

"రాష్ట్రీయ ప్రజలమయినందున మనకుండవలసిన స్వాతంత్ర్యములను బొందుటకయి ప్రయత్నించుటకొఱకును, దానినిబట్టి మన భరతఖండము నందలి ప్రజల స్థితిని క్రమక్రమముగా నభివృద్ధి పరుచుటకొరకును, గడచిన మూడు సంవత్సరముల నుండియు హిందూ దేశమునందలి ప్రధాన నగరముల యందు మహా జనసభలు జరుగుచున్నవనియు, ఆ సభలకు రాజ్యాంగ విషయములను ప్రసంగించుటకు జాతిమత భేదములులేక యెల్లజాతులవారును సమస్త మతములవారును తమ తమ ప్రతినిధులను బంపుచున్నారనియు, ఆ సభలయందు సమిష్టిమీద హిందూ దేశమునకు క్షేమకరము లయిన ముఖ్యరాజ్యాంగ విషయములు చర్చింపబడి బహుజనాభిప్రాయమును బట్టి దృఢనిశ్చయములు చేయబడుచున్నవనియు, మీరెరిగియున్నారు గదా ? సమస్త విషయములయందును అభివృద్ధి బొందుచుండుట మనుష్యునకు సహజధర్మమయి యున్నది. మృగాదులకును మనుష్యులకునుగల భేదములలో నీయభివృద్ధి విషయమైన ధర్మ మొకటి మృగాదులభివృద్ధిలేక యెప్పుడు నేరీతిగానుండును; ఈ విషయమున వానికి వృద్ధిక్షయములుండవు; వేయి సంవత్సరముల క్రిందట కాకులెట్లు గూండ్ల

---

* రాజకీయాభిప్రాయాలలో దాదాబాయి నౌరోజీ, ఫిరోజీషా మెహతా, గోఖలే మొదలయినవారు మితవాదులు ఇంచుమించు. 1920 సంవత్సరం వరకూ రాజకీయాలలో అతివాద వర్గం బలం పుంజుకోలేదు. రాజకీయాలకు సంబంధించి వీరేశలింగం మితవాది.

కట్టుచుండునో యిప్పుడు నదే ప్రకారముగా కట్టుచుండును; ఇంక ముందు వేయి సంవత్సరములు దాటిన తరువాతను గూటిని నిర్మించుటయందేమియు నభివృద్ధిని బొందక యధాప్రకారముగానే యెల్లకాలమును గూండ్లను నిర్మించుకొను చుండును. మనుష్యుడట్లుగాక కృషిచేయుచు వచ్చిన యెడల నంతకంత కభివృద్ధి నొందుచుండును. వేయి సంవత్సరముల క్రిందట మృగప్రాయులై గుహలయందు వాసముచేయుచుండిన వారిప్పుడు పెంకుటిండ్లు కట్టుకొని యందునివసించుచుండవచ్చును; ఇఁకముందు నాగరికాగ్రగణ్యులయి దివ్యభవనములు నిర్మించుకొని యింద్ర భోగము ననుభవింప వచ్చును. ఈ విధముగా నభివృద్ధి బొందుటకయి కృషియావశ్యకము జ్ఞానహీనులయి కృషిచేయక యుపేక్షించుచు వచ్చిన పక్షమున మునుపున్న స్థితియందైననుండక క్రమ క్రమముగా హీనదశను బొందుచువచ్చి కట్టకడపట వించుమించుగా మరల మృగ ప్రాయులగుట సంభవించును. జ్ఞానాభివృద్ధిఁజేసికొనుచు నెడతెగక కృషిచేయుచువచ్చిన పక్షమున, మతమునందును నీతియందునువిద్యలయందును, కులాచారములయందును, వస్తునిర్మాణాదులయందును సుఖసాధనకల్పనమునందును, తక్కిన సమస్త విషయముల యందునుమనమంతకంత కభివృద్ధి నొందుచుందుము.ఇంచుమించుగానన్ని విషయముల యందునుసమానముగా వృద్ధినొందుచుండుటయేఅభివృద్ధియగునుగానితక్కినవిషయముల యందధమదశలో నుండి యొక్క విషయమునందు మాత్రము వృద్ధిచెందుట నిజమైన యభివృద్ధికాదు. అట్టి యేక దేశాభివృద్ధివలన దేశ క్షేమకరములయిన ప్రయోజన ములును కలుగవలసినంత కలుగనేరవు. మన శరీరమునందలి సమస్తావయవములును వాని వాని పరిమాణమునకు దగినట్లుగా పెరుగుచుండుటయే క్షేమకరమయిన యభివృద్ధి యగునో, అట్లన్ని యవయవములును సమానముగా వృద్ధి నొందక యొక్కతలకాని కడుపుగాని కాలుగాని లావగుటయే క్షేమకరమయిన వృద్ధియగునో తెలిసినవారికి జన సామాన్య క్షేమలాభములకయి వృద్ధి సమస్తవిషయములయందును సామాన్యముగా నుండవలసిన యావశ్యకమును గూర్చి పెంచి చెప్పవలసిన యక్కరలేదు. ఒక్కతల మాత్రమెదిగిన దయ్యపు తలయనియు, ఒక్క బొజ్జమాత్రమెదిగిన బానకడుపనియు, ఒక్కకాలు మాత్రమెదిగిన బోదకాలనియు, పేరులు పెట్టి వాని వృద్ధికి సంతోషింపక యనర్థదాయకముగా భావించి చికిత్సలు చేయింపఁబూనుకొనుట యెల్లవారికి ననుభవ సిద్ధమయినదే. అనేకావయవమయమయిన దేహవిషయమునెట్లో యనేకాంగవిశిష్ట మయిన బాహ్యవిషయమునందును వృద్ధియట్లే యుండును. ధనమును తిన్నగా నుప యోగించుకోగలుగుట కావశ్యకమైన తెలివిని గలిగింపక కాపులను మూర్ఖత్వములో మునఁగియుండునట్లుజేసి వారికి ధనము దశగుణము లధికముగా లభించుమార్గము తేర్పరచిన పక్షమున దానివలన నేమి ప్రయోజనము కలుగును ? తినుటకు కడుపు నిండ పుష్కలముగా నన్నము లభించు సాధనములను గల్పింపక ధనము నుపయో గింపవలసిన మార్గములను వేయిటి నుపదేశించిన పక్షమున నందువలన నేమి ప్రయో



జనము కలుగును ? బయల రాజ్యాంగ విషయకములైన స్వాతంత్ర్యములు లక్ష లభించినను గృహమునందానంద భంజకములయిన దుర్మతి దురాచార పిశాచములకు దాస్యముచేయవలసి యుండినయెడల నేమి సౌఖ్యము కలుగఁబోవును ? ఇంట సంతోష దాయకములైన సన్మతసత్కులాచార స్వాతంత్ర్యములను గలవాఁడయియున్నను ధన ప్రాణరక్షణము చేయని నిరంకుశ దుష్టప్రభుత్వమునకు బయలదాస్యము చేయుచుండ వలసి యుండినయెడల నేమి సుఖముకలుగును ? వృద్ధిసమస్త విషయములయందును తగిన విధముగా నున్నప్పుడే దేశమునకు నిజమైన క్షేమలాభములు కలుగునుగాని యేదోయొక విషయమునందు మాత్రమభివృద్ధి సంభవించినందునఁ గలుగవు. కాఁబట్టి రాజ్యాంగవిషయమైన స్వాతంత్ర్యముల తోడిపాటుగా జ్ఞాననీతుల విషయమునను, మతవిషయమునను, కులాచారవిషయమునను గూడ నభివృద్ధి బొందుచుండుటయత్యం తావశ్యకము. క్రూరములైన కులాచారములకు దాసులమయి మనయింట నుండు స్త్రీల కష్టములను నివారింపలేనివారము రాజ్యాంగ స్వాతంత్ర్యములను బొంది దేశము యొక్క కష్టముల నెట్లు నివారింపఁగలుగుదుము ? మతవైషమ్యమును వహించి, యైకమత్యమును త్యజించి యొండొరులను ద్వేషించుచు తగవులాడు చుండెడివారము. రాచరికపు సంబంధమయిన స్వాతంత్ర్యములను బొందినప్పుడు జాతిమత వైషమ్య ములు విడిచి యెట్లు సర్వజన క్షేమమునకయి యైకమత్యముతో పాటుపడఁగలుగుదుము? కాఁబట్టి జాతిమత ద్వేషమూలములు గలిగి పెరుగుచున్న దురాచార వృక్షమును మూలచ్ఛేదము చేయుటకయి ప్రయత్నింపక రాజ్యాంగ విషయకములైన స్వాతంత్ర్య ములను బొందుటకై లక్ష ప్రయత్నములు చేసినను వానివలన సంపూర్ణమయిన యైక మత్యమును నిష్పాక్షిక దృష్టియుఁగలుగనేరవు. ఇవి రెండును గలుగకున్నంతకాలము నిజమైన దేశక్షేమాభివృద్ధులు కలుగవు. ఈ విషయమున నే నింతదూరము చెప్పుటచేత మతాచార కులాచార సంస్కరణమునందు సంపూర్ణ దశను బొందువఱకును రాజ్యాంగ సంబంధములయిన స్వాతంత్ర్యములను బొందుటకయి ప్రయత్నింపగూడదని నాయభి ప్రాయమయినట్టు మీరు భ్రమింపఁ బోకుఁడు. సమస్తవిషయముల యందును యుక్తరీతిని కృషిచేయుచుండవలసిన దనియే నాయభిప్రాయము.కులాచారమతాచారముల యందందరికిని నైకమత్యము కలుగనేరదు. పరస్పర విరుద్ధములయిన వివిధమతములును వివిధకులములునుశాఖోపశాఖలుగానున్న యీదేశమునందెవరి మతములోను గల దురాచార ములను తొలఁగించుటకయి యాయా మతములోని వారును కులములోనివారును ప్రత్యేక ముగాఁ గృషి చేయవలసినదేగాని యన్ని మతములవారును అన్నికులములవారును గలిసి చేయవలసినపనిలేదుఒక్క రాజ్యాంగవిషయమైనస్వాతంత్ర్యములుమాత్రమేసర్వజాతిమత సామాన్యాపేక్షణీయములై యున్నవి. కాఁబట్టి యీయొక్క విషయమునందు మాత్రమే హిందూదేశములోని సకలజనులు సంఘీభవించి జాతిమత వర్ణభేదములతో పనిలేకుండ నన్యోన్యక్షేమ సంపాదనము నిమిత్తమైకమత్యముతో పాటుపడుట సాధ్యమగును. ఇది

విచారించియే మన దేశమునందలి విద్యాధికులైన బుద్ధిమంతులనేకులాలోచించి కృషిచేసి కడచిన నాలుగు సంవత్సరములనుండియు దేశీయమహాసభను స్థాపించి వ్యయ ప్రయాసములను జాటింపక సర్వజన క్షేమాభివృద్ధుల నిమిత్తమయి పాటు పడుచున్నారు.

సర్వజనోపయుక్తమయిన యీ మహాసభయొక్క యుద్దేశములనుగూర్చియు, దీనివలనఁ గలుగ నపేక్షించిన ప్రయోజనములను గూర్చియు, దీని విషయమయి యెల్ల వారును జేయవలసిన కృత్యములను గూర్చియు, ఈవరకు సమావేశమయిన మూఁడు సభలలోను జేయఁబడిన నిశ్చయములను గూర్చియు, నేనిప్పుడు కొంత ప్రసంగింపఁబోవుచున్నాను. మీరందరు సావధాన మనస్కులరయి చిత్తగింపవలయును.

ఈ సభయొక్క ప్రధానోద్దేశములు ముఖ్యముగా మూఁడని చెప్పవచ్చును. అందు మొదటిది నేటివరకును జాతిమత కులాచార భేదములచేత విడివడి యైకమత్యములేక యున్న హిందూ దేశములోని పలు తెగలుగానున్న మహాజనులనందరి నొక్కటిగా కలిపి దేశాభిమానము పురికొల్పుట. రెండవది యీ ప్రకారముగాఁజేరిన మహాజనులలో జ్ఞాననీతి కులాచార వ్యవహారాదులైన సమస్త శాఖలయందును గ్రమ క్రమముగా నభివృద్ధిని కలిగించుట మూఁడవది హిందూదేశముయొక్క క్షేమమునకు భంగకరముగాను న్యాయవిరుద్ధంగాను నున్నయవస్థలయందు సవరణ కలిగించుటవలన నింగ్లాండు దేశమునకును హిందూ దేశమునకును గల యనుబంధమును మరింత దృఢపరుచుట. ప్రభుత్వము వారియెడల ప్రజలకనురాగాభివృద్ధి చేయుటయన్న యీ యుద్దేశమిందుఁగడపటఁజెప్ప - బడినను, ప్రాధాన్యమును బట్టి యీ సభవారి యుద్దేశములలో నిదియే మొదటిదని చెప్పవలసియున్నది. ఓర్వలేనివారు కొందరీ సభకు ముఖ్యకారకులుగా నున్నవారి యుద్దేశము జనులను పురికొల్పి వారికి దొర తనమువారి మీఁద ద్వేషమును పుట్టించుట యని నిష్కారణముగా దోషారోపణముచేసి లేని యపవాదమును వేయుచున్నను, కొంచెమాలోచించి చూచువారికందరికిని వారి వాక్యములు సత్యమునకు మిక్కిలి దూరములైనవని బోధపడకపోవు. ఇంగ్లీషు వారి ప్రభుత్వమువలనఁ గలిగిన ముఖ్య ఫలముల ననుభవించువారు సాధారణముగా మనదేశములో విద్యాధికులేకదా ? ఈ సభాస్థాపనమునకు ముఖ్య ప్రోత్సాహకులుగా నున్నవారును విద్యాధికులేకదా ? హూణప్రభుత్వమువలని యనంతలాభముల ననుభవించుచున్న యీ విద్యాధికుల కారణముగా కృతఘ్నులయి స్వలాభమునకును దేశక్షేమమునకు భంగకరముగా దొరతనమువారి మీఁద తిరుగఁబడునట్లుగా మూఢ జనులను బురిగొల్పుదురన్న వివేకులైనవారెవ్వరైన విశ్వసింపఁదగి యుండునా ? కలలోను విశ్వసింపఁదగియుండదు. వారి యుద్దేశమెప్పుడును మూఢులయి యింగ్లీషు ప్రభుత్వమువలని లాభములను దెలిసికోలేక యతృప్తి వహించుచున్న సామాన్య జనులకు వారనుభవించుచున్న లాభములు బోధపడునట్లు చేసి రాజ



భక్తినిబురికొల్పి మహా జనులలో నైకమత్యమును కలిగించి దొరతనమువారిని ప్రార్థించి వారి యనుగ్రహమువలన నూతన స్వాతంత్ర్యములను బొందుటకై ప్రయత్నించునట్లు చేయుటయు, అందువలన స్వలాభమును దేశక్షేమమును వృద్ధి వరుపఁ గోరుటయు, నయియుండునుగాని వేరువిధముగా నుండునా? మన దేశాభివృద్ధి నుద్దేశించి పరమదయాపరుడైన యీశ్వరుడు ప్రసాదించిన యీ యింగ్లీషు ప్రభుత్వ మహిమనుబట్టికాని, కాకపోయినయెడల మన మీ దినమున నిట్లు సభ కూడి యిందర మైకమత్యముతో రాజ్యాంగ విషయములను గూర్చి నిర్భయముగా బ్రసంగింప గలుగుదుమా? మనదేశమునందింగ్లీషు వారి ప్రభుత్వము నెలవుకొనక ముందు నిరంకుశాధికారముగల కొందరు దుష్ట ప్రభువులు జరిగించిన దౌర్జన్యములను దుర్జయములను దలచుకొన్న దేహమిప్పుడును గంపరమొందుచున్నది. ఆ కాలములో ధనమునకుగాని మానప్రాణములకుగాని రక్షణములేదు; న్యాయమంతయు ధనము నాశ్రయించి యుండుటచే బీదల కది లభించుట కలలోని వార్తగా నుండెను: బండవాఁడు రాజు కంటెను బలవంతుడు ; ఈ భరతఖండములోని చేరువదేశములకు సహితము సరకులు కొనిపోవుటకుఁ దగిన మంచి మార్గములు లేవు; ఉన్న యడవి మొదలయినవి కొనిపోవుటకుఁ దగిన మంచి మార్గములు లేవు; ఉన్న యడవి మార్గములు కొన్నియు వ్యాఘ్రాదిఘాతుక మృగములతోను ఘాతుకమృగముల కంటెను క్రూరులైన దొంగలతోను నిండియుండుచు వచ్చెను; అందుచేత తీర్థయాత్రపరులు సహితము తామిల్లువెడలు నప్పుడు మరణకాలమునందప్పగించునట్లుగా ఋణ ధనాదులను బిడ్డల కప్పగించి మృతులకై యేడ్చునట్లు బంధు మిత్రాదులు రోదనములు చేయుచుండఁగా బయలుదేఱుచుండిరి; కాశికిఁ బోయినవాఁడును కాటికిఁ బోయినవాఁడును సమానమన్న లోకోక్తి మీరిప్పుడును వినుచుండలేదా? ఆ కాలమునందు సేద్యముకాక సారవంతములైన భూములు సహితము లనేకములు బీడుగా విడిచి పెట్టఁబడుచుండెను; నీటి యాధారములు క్రొత్తవి నిర్మించుట లేకపోఁగా బూర్వకాలమునందున్నవి సహితము బాగుచేయించువారు లేక యుపేక్షింపఁబడి పాడగుచుండెను: క్షామములు సర్వసాధారణము లగుచుండెను: సామాన్యజనులు విద్యాగంధమెఱుగకఁ యజ్ఞానాంధకారములో గ్రుడ్డివారివలె సంచరించుచుండిరి; గాఢాంధకారములో మెఱుపు మెఱసినట్లు దైవికముగా మంచి రాజొకానొకఁడప్పడప్పుడు వచ్చుచు వచ్చినప్పుడు జనుల కల్ప సౌఖ్యము కలుగుచు వచ్చినను, ఆ మేలుతడవు నిలుచునదిగాక సామాన్యముగా దేశమును విపదంధకారమే క్రమ్ముకొని యుండెను: అకాలమునందొకఁడు గ్రామాంతరము పోయినయెడల మరలవచ్చి కంటఁబడుదాఁక వాని క్షేమవార్త బంధువులకు తెలియకుండెను.

శత సంవత్సర పరిమితమయిన యింగ్లీషువారి సత్పరిపాలనము వలన మన మిప్పుడనుభవింపఁగలిగిన సుఖసాధనముల ననేకములను మన పూర్వులు స్వప్నావస్థ యందును వినియు కనియునుండరు. కాశిలోని వారి క్షేమ సమాచారమును తంత్రీ

ముఖమున నూఱుల కొలఁది క్రోసుల దూరములోనున్న యిచ్చటివారు నిమిషములోఁ దెలిసికోఁగలుగుదురని నూఱు సంవత్సరముల క్రిందట నెవ్వరూహింపఁగలరు? ఆసేతు హిమాచల పర్యంత భూభాగమునం దెక్కడ నున్నను బంధు మిత్రాదుల క్షేమ సమాచారములను దెలిపెడి యుత్తర ప్రత్యుత్తరములను కానిచీటితో కొన్ని దినములలోఁ దెప్పించుకొనుట సాధ్యమగునని నూఱేండ్ల క్రిందట నెవ్వరూహింపగలరు? అవిరి సాహాయ్యముచేత నడుపఁబడెడి యోడలలోను బండ్లలోను నీటిలోను మెట్టను వందలకొలఁది క్రోశముల దూరము నొక్కదినములో ప్రయాణము చేయుట సంభవించునని శత సంవత్సరముల క్రిందట నెవ్వరూహింపఁగలరు? అప్పటి వారి యూహకందని సౌఖ్యములను సహితము మనమిప్పుడు సర్వ సాధారణముగా ననుభవించుచున్నాము. ఇప్పు డించుమించుగా ధన ప్రాణములకు సంపూర్ణ రక్షణము కలిగియున్నది: న్యాయము కోటీశ్వరుడు మొదలుకొని కూటిపేదవఱకును సమానమయి యున్నది: ప్రతి దేశమునందున మృగచోరభయాదులు మృగ్యములైన దారు లేర్పడుటయేకాక వాయువేగమున మనుష్యులను వాణిజ్య వస్తువులను గొనిపోవు ధూమశకట మార్గములు కూడ బహుదేశములయందు వ్యాపించి యున్నవి: అందుచేత కాశ్యాదిదూర తీర్థయాత్రలుచేయుట పొరుగూరికిపోయివచ్చుటవంటిదైనది: నదుల కడ్డకట్టలుకట్టి కాలువలు బహుముఖములఁ బ్రవహింపఁజేయుటవలన తొంటియూషరక్షేత్రములిప్పుడు పరిపండెడు దివ్య క్షేత్రములయినవి; పూర్వపు రీతిక్షామముల కిప్పుడు క్షామమువచ్చుచున్నది: క్షణకాలములో వేలకొలది యోజనముల దూరమునుండి వార్తలను మనోవేగమునఁ గొనితెచ్చెడు తంత్రీ వార్తాహరణ కార్యస్థానము లన్ని గొప్ప పట్టణముల యందును స్థాపింపఁబడినవి: నిరుపేదలు సహితమత్యల్ప ధనముతో నచిరకాలములో బంధుమిత్రాదుల యోగక్షేమములను పత్రికా ముఖమునఁ దెలిసికొనుట కనుకూలములైన ప్రోషణ కార్యస్థానము లల్పగ్రామములయందు సహితము నెలకొల్పబడినవి: వాణిజ్యాదులు వృద్ధినొంది ద్వీపాంతరముల యందలివింత వస్తువులు సహితము పెరటిపంటలైనవి. ఇవి యన్నియు నిట్లుండఁగా నెల్లయెడలఁ బాఠశాలలు స్థాపింపఁబడి పూర్వకాలమునందు కొన్ని జాతులవారి కందనిమ్రాని పండుగా నుండెడి విద్యాధన మిప్పు డజ్ఞానాంధకారములోఁ జిరకాలమునుండి యుండియున్న వారి కన్నులు మిఱుమిట్లు కొనునట్లుగారినెల్ల యెడల వెదచల్లఁబడు చున్నది. అమూల్యమయిన యావిద్యా ప్రభావమువలనేకదా కడచిన మూఁడు సంవత్సరముల నుండియు జాతి మత వైషమ్యమును లేశమాత్రమును వహింపక, ఆసేతు హిమాచల పర్యంత హిందూదేశమునఁగల హిందువులును, మహమ్మదీయులును, క్రైస్తవులును, పారసీకులును, బౌద్ధులును, జైనులును, ద్విజులును, శూద్రులును, ద్రావిడులును, గౌడులును దేశక్షేమము నిమిత్తమయి ధనవ్యయమునకును శరీర ప్రయాసమునకును సహించి దూరదేశ ప్రయాణములు చేసి యేటేట నొక్కొక్క పట్టణమున నొక్క మందిరమున



సోదరులవలె సంభాషింపఁ గలుగుచున్నారు! అయస్కాంతము సూదుల నాకర్షించునట్లుగా విద్యాబుద్ధి సంపన్నులైన నూఱులకొలఁది భిన్న దేశీయులను, భిన్న మతస్థులను, భిన్న భాషలవారిని నిట్లొక్క స్థలమున కాకర్షించి యొక్క సభా మండపమున నొక్క భాషతో మృదు మధుర గంభీర వాగ్గుంభనలతో దేశలాభము నిమిత్తమయి వారిచేతఁ బ్రసంగములు చేయించుచున్నది. ఇంగ్లీషు విద్యయను సమ్మోహన మంత్రము గాక మఱియేది? ఇంతవఱకును జాతి మత ద్వేషములచేత నొకరి నొకరు తాఁకుటకును నొకరితో నొకరు సంభాషించుటయునుగూడ సంశయింపవలసిన స్థితియందుండిన నానావిధముల వారి నొక్కచోట సమావేశపఱిచి, ఆప్తబంధువులవలె నేకాసనములఁ గూరుచుండఁ బెట్టి, ఏక కుటుంబములోని వారివలె జన సామాన్య క్షేమము నిమిత్తము సంభాషింపఁజేసి, స్వప్రయోజన పరత్వమును బోఁద్రోలి యైకమత్యమును నేర్పుచు హిందూదేశమునకుఁ గ్రొత్త ప్రాణము వోయుచున్నది. హూణ భాషారూపమయిన సంజీవనీ విద్యగాక మఱియేది? ఈ భాష యమృత వర్షము కురియునట్లుగా నెల్లయెడల వెదచల్లుచున్న యుత్తమ జ్ఞానమును, పరిశుద్ధ నీతిని, నిర్మల ధర్మతత్వమును, మానుష స్వాతంత్ర్య స్వరూపమును, చవిగొన్న తరువాత నెవ్వరు తమ తొంటి యజ్ఞానజన్యమయిన యైకమత్యాభావమును స్వార్థపరత్వమును దురభిమాన ద్వేషములను త్యజించి పరస్పర భ్రాతృవాత్సల్యముతో సంఘీభవించి మానుష భాస్వార్హములయిన స్వాతంత్ర్య ఫలములను పొందకుండఁ గోరుదురు? ఎల్లవారల హృదయములయందు నదృశ్యముగా నడుచుచున్న యీయద్భుతమైన మార్పును జూడఁగా నిదియేమో మహేంద్రజాలమువలెఁ గానఁబడుచున్నది. ఇంగ్లీషు విద్య యొక్కయు నింగ్లీషు ప్రభుత్వం యొక్కయు ఘనతను, శక్తిని ఘోషించుటకయి యింతకంటె వేఱేమి కావలెను?

ఈ వఱకు దేశమునకు సంప్రాప్తములయిన ప్రభుత్వములలో నెల్ల నీ యింగ్లీషు దొరతనం సర్వోత్కృష్టమయినదని భూషించుటచేత దేనియందే విధమయిన లోపములును లేవని నేను చెప్పఁదలఁచినవాఁడనుగాను. ప్రపంచములోని దేదియు సంపూర్ణముగా నిర్దుష్టమయి యుండదు. ఇంగ్లీషు ప్రభుత్వము నందును లోపము లనేకము లున్నవి."

# రావుబహదూర్ బ్రిటిష్ రాజభక్తి-క్రైస్తవరక్తి

--త్రిపురనేని వెంకటేశ్వరరావు

(విజయవాడ)

రావుబహదూర్ కందుకూరి వీరేశలింగం పంతులుగారు రాజకీయంగా బ్రిటిష్ ప్రభుభక్తి పరాయణులుగా చరమదశలో చరిత్రప్రసిద్ధులయ్యారు. ఆయన సాంఘిక సంస్కరణ ఆయన సాహిత్యసేవ ఎంత ఘనమైనదో ఆయనగారి బ్రిటిష్ ప్రభుత్వ భక్తి అంతకంటే ఘనమైనది. ఆయన సంస్కరణ ఎంతగా గౌరవింపబడినదో ఆయన బ్రిటిష్ ప్రభుభక్తి అంతగా నిరసనకు గురి అయినది.

కాని కమ్యూనిస్టులాయనను కొలవడానికి పూనుకొన్నప్పటి నుండి ఆయనగారి బ్రిటిష్ భక్తి జాతీయ కాంగ్రెస్‌లోని మితవాదులైన గోపాలకృష్ణ గోఖలే-దాదాభాయి నౌరోజీ–సురేంద్రనాథ బెనర్జీ-గోవిందరానడేల వర్గంవారి దృష్టికి సరిపోలినట్టిదని, సమానమైనదని, అదొక చారిత్రకదశకు చెందిన జాతీయత అని ఒక సమర్థనను ఒక సిద్ధాంతీకరణను వారు తయారుచేసి వ్రాయసాగారు. అలాగని కమ్యూనిస్టులు చెప్పడము వ్రాయడమేగాని జాతీయోద్యమస్థులు, ఆ వుద్యమ చారిత్రకులు మాత్రం అలా వ్రాయడంలేదు. ఆ సిద్ధాంతాన్ని అంగీకరించలేదు. ఆయన సంఘ సంస్కరణను ఆయనగారి బ్రహ్మసమాజ మతాన్ని అంగీకరించి అనుసరించి అభిమానించినట్టి జాతీయోద్యమ చరిత్రకారులు కూడా వీరేశలింగం గారిని గోఖలేతరం, గోఖలే తరహా జాతీయ దృష్టిగల జాతీయవాదిగా గుర్తించి వ్రాసినవారులేరు. వారు ఆయనను సంఘసంస్కర్తగా మాత్రమే గౌరవించారు.

వందేమాతరం మొదలు హోంరూలు వుద్యమం వరకు ఆయన వైఖరి గోఖలేయ వైఖరి కూడా కాదని, బ్రిటిష్ వ్యతిరేకమైన జాతీయతకు ఆయనగారు వ్యతిరేకి అనే గుర్తింపును ప్రచారాన్ని ఆయన పొందినట్లు ఆయన స్వీయచరిత్రే చెప్పి వున్నది. ఆంధ్ర జాతీయోద్యమం ఆయనను జాతీయవాదిగా గణించలేదు. ఆయనను పలుసభలలో బ్రిటిష్ భక్తుడని వారి సంస్కరణోద్యమానుచరులే కేకలువేసి హేళన చేసినట్లు వారే వ్రాసుకొన్నారు. ఇంకా పలువురు వ్రాసివున్నారు. వారు బ్రిటిష్ భక్తుడు గాడు, అలాగనుకోవటం పొరపాటు అని ఆయన జాతీయతను అపార్థం చేసుకోవద్దని వివరించిన వారెవ్వరూ వారు సజీవులైయుండగాలేరు.



## పంతులగారు: నాయుడుగారు

అంత పరిస్థితి ఏర్పడటానికి ఆయన ప్రవర్తనే కారణం. వందేమాతరోద్యమాన్ని బ్రిటిష్‌జాతి, జనద్వేషంగా జమకట్టి, వ్యాఖ్యానించి ఆ వుద్యమంలో ప్రజలు పాల్గొనరాదని పనిగట్టుకొని ప్రచారం చేశారువారు. అటువంటి వందేమాతరోద్యమ వ్యతిరేక వీరాన్ని ఆయనగారి బ్రహ్మసమాజ నాయకులలోగాని, అనుచరులలోగాని, ఆయనగారి సంఘసంస్కరణోద్యమాభిమానుల్లో ఏవొక్కరు పూనలేదు. పంతులుగారికే మాన్యుడు బ్రహ్మర్షి బ్రహ్మసమాజ ఆంధ్రప్రవక్త అయిన రఘుపతి వెంకటరత్నంనాయుడు వందేమాతరంలో పాల్గొనలేదుగాని, పంతులుగారిలాగా వ్యతిరేక ప్రచారం చేయలేదు. పంతులుగారు ఆకాలంలో జరిగిన పరిశుద్ధాస్తిక సభా వేదికలను, ప్రార్థనాసభలను ఉపాసనాసభలను వందేమాతరం నిరసనకు ఉపయోగించారు. అలా మతవేదికలను జాతీయవాద రాజకీయోద్యమ నిరసనోపన్యాసాలకు వాడినప్పుడే ఆయనను అల్లరిచేశారు. అలాగని స్వీయచరిత్రే సాక్షిగావుంది.

పంతులుగారిలా నడుస్తోంటే, ఆ వుద్యమంలో పాల్గొనకపోయినప్పటికీ రఘుపతినాయుని నడక వేరుగా వుంది. గౌరవప్రదంగావుంది. 190.లో కాకినాడలో వందేమాతరం అని కేకవేసిన కుర్రవాణ్ణి 'కెంప్' అనే తెల్ల వైద్యాధికారి రోడ్డుమీద పడేసి చచ్చినదూడను ఈడ్చినట్టు యీడ్చుకువెళ్ళి పోలీసుస్టేషన్లో పెట్టి కొట్టించాడు. నెత్తురుకాల్వలో పడివున్న ఆ కుర్రవాణ్ణి చూచిన ప్రజ ఆ కెంపు వెళ్ళిన తెల్లదొరల క్లబ్బును చుట్టుముట్టి రాళ్ళు వేశారు. అలా రాళ్ళు వేయటాన్ని నిరసించటానికి పురప్రముఖులు సభ పెట్టారు. రఘుపతినాయుడు ఆ సభకు వెళ్ళి కెంప్ చేసినది దుర్మార్గమని, అదే ప్రజలను రెచ్చగొట్టిందని, కెంపును ఖండించే తీర్మానం ప్రవేశపెట్టాడు. అతనిని ఖండించియే, రెండుజాతులమధ్య సమరసభావం అవసరమనిచెప్పాడు. అంతేగాక వందేమాతరంలో జైలుశిక్షపడిన విద్యార్థులకు జామీనిచ్చి పరీక్షలు వ్రాయించాడు. విశ్వప్రేమ అనే బ్రహ్మసమాజ మతప్రేమసూత్రం నాయుడిగారిలో అలా ఫలిస్తే, అదే ప్రేమసందేశం వీరేశలింగంచేత బందరు నుంచి బరంపురం వరకు జరిగిన ఆస్తిక సభలలోను, ఆయన సంఘసంస్కరణ సభలలోను వందేమాతరం అనే నినాదం జాతిద్వేషపూరితమైనదని, సోదరులైన బ్రిటిష్‌వారిని ప్రేమించాలని బ్రహ్మసమాజం చెప్పే ప్రేమసూత్రం యొక్క అర్థమదేయనే దుర్వ్యాఖ్యానం చేయించింది! ఎంత విపరీతమో ఆలోచించండి.

## బెంగాలీ బ్రహ్మోలు-వందేమాతరం

బెంగాలులో బ్రహ్మసమాజంవారు ఇలా ప్రవర్తించలేదు. బెంగాలు విభజనను రద్దు చేయాలనే ఆ ఆందోళనలో ముందుపీఠీ నాయకులువారే. అసలు స్వదేశీ నినాదం

వారిదే. 1901లో బ్రహ్మసమాజ బోధకై ఆంధ్రదేశం పర్యటించి వెళ్ళిన బిపిన్ చంద్రపాలే 1907లో వందేమాతరంలో ఆంధ్రను ఉర్రూతలూగించాడు. మన బ్రహ్మోలు రఘుపతి, కందుకూరులు వందేమాతరానికి ఆమడదూరాన వుండిపోయారు. కందుకూరి వ్యతిరేక ప్రచారకుడు. (అటువంటి జాతీయోద్యమ వ్యతిరేక పాత్రను రఘుపతివారు 1920లో సహాయనిరాకరణోద్యమంనాటికివహించాడు. సహాయనిరాకరణ వ్యతిరేక సభకు కాకినాడలో అధ్యక్షత వహించాడు.) మునగాల చల్లపల్లి రాజాల వంటి జమిందారులు సైతం స్వదేశీ వుద్యమం మేరకైనా వందేమాతరంతో సహకరించారు. ఆ మేరకైనా వీరేశలింగం సహకరించలేదు. వందేమాతరం మొత్తాన్ని నిరసించాడు. విచిత్రంగా 1908లో కామరాజు హనుమంతరావుకొక మభ్యపెట్టే ఉత్తరం వ్రాశారు. స్వదేశీ పరిశ్రమ పెట్టబోతున్నాను, అందులో నీవు పని చేయాలి, రమ్మని వ్రాశారు. నమ్మివచ్చాడాయన. వచ్చిన తర్వాత స్వదేశీ పరిశ్రమ మాటేలేదు. కామరాజువారిని వితంతు శరణాలయ నిర్వహణలో పెట్టారు. అంతే సరిపోయింది.

## మితవాదులు-వందేమాతరం

గోఖలే వందేమాతరంలో బెంగాలు విభజన రద్దుచేయాలి. స్వదేశీ పరిశ్రమలు స్వదేశీ వస్త్ర వస్తు వినియోగ ఉత్పత్తుల దీక్షవరకు నిరాఘాటంగా బలపరచాడు. అపైన విదేశవస్తు బహిష్కారం గూర్చి సందేహాలు వెలిబుచ్చాడు. సురేంద్రనాధబెనర్జీ బహిష్కారం వంగ విభజన రద్దయ్యేవరకే, అందుకు సాధనంగా తాత్కాలిక చర్య మాత్రమేయని చెప్పి వొప్పించాడు. కాంగ్రెసు మితవాద పక్షవైఖరి అంటే ఇది. వీరేశలింగం వైఖరీ యిదీ ఒకటేనా ? నిజంగా ఆయన వైఖరి ఆ మితవాదవైఖరే అయివుంటే, అదేదోచెప్పి, పోలికతెచ్చి స్వీయచరిత్రలో సమర్థించుకోకుండా వొదిలి పెట్టుతారా? ఎంతదీర్ఘమైన సంజాయిషీవ్రాశారోగాని, అందులో ఏమైనా మితవాదస్పర్శ ఏమైనా వున్నదేమో ఆలోచించండి!

ఆంధ్రలో మితవాద కాంగ్రెసు నాయకులెవరోకాదు; వారి మిత్రులైన న్యాపతి సుబ్బారావు, మోచర్ల రామచంద్రరావు, బి.యన్. శాస్త్రిలే కదా! పంతులుగారి స్వీయ చరిత్రలో ఎక్కువగా తగిలిన పేరు న్యాపతిది. ఆయనగారి రాజకీయ దృష్టి, నాదీ వొకటేయని ఏమైనా చెప్పగలిగారా ? సంస్కరణలో, మత విషయంలో భేదించి నప్పటికీ దేశాభివృద్ధి, జాతీయతలో న్యాపతితో వీరు రాజకీయ ఏకీభావం వున్నవాణ్ణని ఏమీ వ్రాసుకోలేదు. 1887 నాటి కతలకన్నా మరొక కృషిని వారు చెప్పుకోలేదు.

## రాజమండ్రి - స్వదేశి

1904 నుంచి, అనగా బెంగాల్ విభజనకు కొంచెం ముందునుంచే, దానితో సంబంధం లేకుండానే రాజమండ్రిలో బాలభారతీ సమాజం ఏర్పడి స్వదేశీ వస్తు



వినియోగ ప్రచారం వున్నది. కంచుమర్తి రామచంద్రరావు, గంటి లక్ష్మన్న, టంగుటూరి శ్రీరాములు, గున్నేశ్వరరావులు చురుకుగా పనిచేస్తున్నారు. అందులో టంగుటూరి ఆ కాలంలోనే జాతీయోద్యమంతోపాటుగా సంస్కరణోద్యమాన్ని గట్టిగా చేపట్టాలిగాని, తగ్గించడం తప్పని వ్యాసాలు వ్రాశారు. సంస్కరణ - స్వరాజ్యం రెండూ ఏకకాలంలో కావాలన్నగ్రూపే రాజమండ్రి గ్రూపు. రెండింటిని తీవ్రతరం చేసిందాగ్రూపు. న్యాపతి రాజకీయ మితవాదేకాదు - సంస్కరణలో కూడా వెనుకంజ వేసినవాడు. పైగా అనీబిసెంటునుతెచ్చి, గత శతాబ్దంలోనే ఆల్కాటునుతెచ్చి దివ్యజ్ఞాన సమాజ ఛాయలో హిందూ సమాజం నడపబోయినవారు. శ్రీరాములు, నాళం, చిలుకూరి గంటి వగైరా యువతరం విమర్శ ఆయనగారి మీదే. పంతులుగారు మద్రాసు నుంచి తిరిగివచ్చేసరికి ఆయన చేతికి దొరికిన యువతరం యిది. వీరే పంతులుగారికి అప్పటి అనుయాయులు - సంఘ, మత సంస్కారంలో వందేమాతరం కెరటం విరుచుకు పడేసరికి పంతులుగారి దేశభక్తిని బ్రిటీష్ భక్తి మింగేసింది. ఆ కెరటం నుంచి దూరంగాపోయి ఆయన ఒడ్డున బుసలుకొట్టుతూ వుండిపోయారు. ఏకాకులైపోయారు. చిలకమర్తి సంఘ సంస్కార శూరత్వం ఎంత ఎక్కువో, జాతీయతను అంతకన్నా ఎక్కువగా నిరూపించారు. అప్పట్లో జాతీయ కవిగా ఎదిగిపోయారు - అతివాదిగా లెక్కకు వచ్చారు. "భరత ఖండంబు చక్కని పాడియావు....ఆయన పద్యమే. వందేమాతరానికి రఘుపతి శిష్యులైన పట్టాభి, ముట్నూరి, కోపల్లె బందరులో నాయకులు. పంతులుగారి శిష్యుడు వల్లూరి సూర్యనారాయణరావు బందరులో వందేమాతరంలో ముందున్నారు. పంతులుగారు వందేమాతరం వ్యతిరేకి. అందులో హరిసర్వోత్తమరావు మీద వచ్చిన రాజద్రోహ నేర విచారణలో తమ బ్రిటీష్ రాజభక్తిని బాగా నిరూపించుకొన్నారు. ఆ కథకాస్తా చెప్పుకోలేక స్వీయచరిత్రలో దాటవేశారు. ఆ విచారణలో ఎంతమాత్రమైనా ఉపయోగకరమైన సాక్ష్యమే గనక యిచ్చివుంటే దాన్ని ఎంతో పెద్దచేసుకొని స్వీయచరిత్రలో చెప్పుకోకుండా వదిలే ఘటమా వీరేశలింగంగారు ?

రాజకీయాందోళనలో పడి సంస్కరణను ఉపేక్షించడం వెనక బెట్టడం అనేమాటనే పరిశీలించుదాం. అతివాదులు సంఘముయొక్క ఆర్థిక వ్యవస్థను సాంఘిక చట్రాన్ని మతవిశ్వాస, ఆచారమౌఢ్య మూలాలను మార్చి వేయాలని, పగులగొట్టాలని అంటారుకదా! వారికొక నిశ్చితమైన తత్వదృష్టివుంది. కాని వారు దేవునితో మతంతో విశ్వాసాలతో ఎంత పోరాటంచేశారు ? ఆర్థిక విషయం ప్రధానమని ఈ దేశంలో ప్రధానమైన సాంఘికవ్యత్యాసాల విషయం ఏమీ పట్టించుకోవద్దను కొన్నారు. ఏమీచేయలేకపోయారు. మళ్ళీవీరే తమను తాముకానక వీరేశలింగం లేవనెత్తిన ఈసాకులను విమర్శా పూర్వకంగా చూడకుండా గుడ్డిగా నమ్మి వల్లించుతున్నారు. కుల మత సంస్కరణలను పట్టించుకోవద్దన్న మార్క్సియ

రాజకీయం జాతీయవాద రాజకీయానికి ఆ అవకాశం యివ్వకుండా బ్రిటిష్‌భక్తితో ప్రచలితమైన వీరేశలింగంగారి వ్రాతలను నమ్మి వల్లించడం తప్పు. గురిగింజతనం. మార్క్సియులకు కావలసిన ఆచరణీయతను జాతీయోద్యమకారులకు వద్దంటారా ? మార్క్సియులు అధికారంలోకి వచ్చిన తర్వాతకూడా యీమౌఢ్యాలమీద పోరాటాన్ని సడలించారు అని గమనించుకోవాలి గదా! కాస్త సిగ్గుతో వినమ్రులు కావాలి. ద్వంద్వ ప్రమాణాలు పనికిరావు.

## 1887 ఆలిండియా కాంగ్రెసు - పంతులుగారు

1887లో ఆలిండియా కాంగ్రెసు రాజకీయ ప్రతినిధిగా పంపించబడ్డానుగాని, ప్రభుత్వ ఉపాధ్యాయుడనని జాబితానుంచి నా పేరు తీసివేశారు, నా అనుమతి లేకుండా తీసేశారుగాని, స్కూలు మాష్టరుగా వుండికూడా అంత తెగించినవాణ్ణని, కాని ఆ అవకాశం యివ్వక అన్యాయం చేశారన్నట్టు రాసుకొన్నారు కదా! ఈ ఘట్టం ఒకటి చాలా తికమకగా వ్రాసుకొన్నారు. పంతులుగారు కాంగ్రెసు ప్రతినిధిగా ఎన్నికయ్యారేగాని వెళ్ళి పాల్గొనలేదని వి. రామకృష్ణగారికి అర్థమయింది. కొందరు ఆయన వెళ్ళి పాల్గొన్నారనుకొన్నారు; మరొకాయన అయితే పంతులుగారు మూడో అఖిల భారత జాతీయ మహాసభను ఏకంగా Address చేశారనే యింగ్లీషున ఇటీవల (Mager P. A రాజు) థీసిస్ చేశారు. పంతులుగారి అదృష్టమేమోగాని వారి పరిశోధక శిరోమణులు తాముగా చేశామని చెప్పుకోకపోయిన పనులను కూడా తెచ్చి పంతులుగారి పేర జమవేసేవారే దొరుకుతున్నారు.

కాని ఉద్యోగం విరమించిన తర్వాతను, ఆ కాంగ్రెసు కాస్తా ఆ మితవాదుల పాలైన కాలంలో—1907నుంచి 1916వరకు గల దశాబ్దకాలంలో వీరేశలింగం దాని రాజకీయసభల చాయలకన్నా పోలేదు. రాజకీయసభ ముగిసిన మర్నాడు జరిగే సంస్కరణ సభల సమయానికి మాత్రమే హాజరయ్యేవారు. వారే1915లో స్వీయచరిత్ర రెండోభాగంవ్రాస్తూ 1887లో తనతెగువను గురించి తన పురాజాతీయతను గురించి రాస్తున్నారంటే వారినేమనాలి ? దీనినే గోఖలే - నౌరోజీల తరహా మితవాద జాతీయత అనవచ్చునా ? అంటే అనరాదు.

Unlike other moderate nationalists, he had no grasp of the nature of British colonial rule in India —V. Ramakrishna

అలాగంటూనే మితవాదుల్లో మితవాది అందాము, 19వ శతాబ్ద పూర్వార్థపు సాంఘిక సంస్కర్తగానే మిగిలిపోయాడందాము అంటున్నారు. ఇరవయ్యో శతాబ్దపు తొలిపాదంలోవున్న పంతులుగారిని, అప్పుడు అందుకొన్న స్వాతంత్ర్యోద్యమంతో మూగసానుభూతి అయినా చూపకుండా, పైగావ్యతిరేక ప్రచారానికి పూనుకొన్నవ్యక్తిని



19వశాతాబ్ద పూర్వార్థ సంస్కర్తలవంతున తీసుకొందామనటమేమిటి ? చిలకమర్తివంటి పంతులుగారి అనుచరుని వైఖరి ఏమిటి? పంతులుగారి వైఖరిఏమిటి? స్వరాజ్యంతోపాటు సంస్కరణకూడా కోరాలంటూ వల్లించడమేగాని ఆచరణలో స్వరాజ్యవ్యతిరేకి వీరేశలింగం. రెండూ ఏకకాలంలో కావాలనడంలో చిత్తశుద్ధి కనబరచినాడు చిలకమర్తి: అలానడచినవాడే టంగుటూరి శ్రీరాములు అతని Carlylean పత్రిక.

1905 లో వందేమాతరానికి ముందే స్వదేశీ వుద్యమంలో రాజమండ్రి ముందంజ వేస్తోండగా, బాలభారతీ సమాజాలుపెట్టుతోండగా, పంతులుగారు రాజమండ్రి విచ్చేసి విక్టోరియా పాఠశాలను పెట్టుతున్నారు: విక్టోరియా వితంతు శరణాలయాన్ని మద్రాసునుంచి తరలించితెచ్చారు. దక్షిణభారత విద్యాసాగరుడనిపించుకొన్నందుకైనా ఆమూలసంస్కర్త విద్యాసాగరునిపేర ఏ శరణాలయమో విద్యాలయమో సమాజమో ఏమీ పెట్టకుండా విక్టోరియా భక్తిని సంస్థలద్వారా వెదజల్లుతున్నవాని జాతీయత ఎట్టిదవుతుంది? పంతులుగారికన్నా బ్రిటిష్ భక్తులింకెవరన్నావున్నారా ? బ్రిటిష్ భక్తి యింతకన్నా వెర్రితలలు యింకేమన్నా వేసిందా? ఆనాడు జాతిద్రోహం అనేదున్నదా ? లేదా ? ఉంటే యింకెలాగున్నది ? చూపగలరా ?

## శ్వేతజాత్యహంకారం : నౌరోజీ : ఉవారంగనాయకులు

ఇంగ్లీషు ప్రభుత్వాన్ని ఏదో వాక సమస్యమీద వీరేశలింగంగారు గతశతాబ్దపు వాగుడు నాయకులలాగా విమర్శించాననటానికి ఏదో కొంత పత్రికారచన చేశాడు గాని క్రైస్తవ మతాన్ని విమర్శించే సాహసం చేయలేదు. చేయలేడు. ఇంగ్లీషు రాజ్యం పాలనా దృష్టిచేత ఉదారరాజకీయ సిద్ధాంతానికి (లిబరలిజానికి) చెందినట్టిది. అది విమర్శను సహించింది. సురేంద్రనాథబెనర్జీని, బెంగాలీవాగుడు రాయుళ్ళను అది గత శతాబ్దంలో బాగా సహించింది.కొంత ఆ వాగుడును ప్రోత్సహించేదేమో కూడా ! పంతులుగారు అందుకని అదేదో కొంత వ్రాయొచ్చు అప్పట్లో. అదికూడా చాలాచప్ప వ్రాతే. ఆసియా జాతులు ఐరోపా శ్వేతజాతులముందుజన్మతఃహీనజాతులంటూ కాఫరు అనే పరిశోధకుడు ప్రసంగిస్తే, దాదాభాయి నౌరోజీ ఖండిస్తూ ఇంగ్లాండులోనే మనపూర్వోన్నతిని, వారి మృగదశను చెప్పి ప్రసంగించాడు. ఆ తెల్లజాతుల జాత్యహంకార ఖండన పురుషార్థప్రదాయిని 1870 జనవరి, ఫిబ్రవరి సంచికలో అచ్చువేయబడినది. వీరేశలింగంగారు దానినిగాని, అట్టిదింకొక దానినిగాని ప్రచురించారేమో పరిశోధకులు చెప్పాలి! అంతపాటిపని వీరేశలింగంగారి దృష్టికీ శక్తికీ మించిన పని. దాదాభాయి ఎంత మితవాదులైనా జాతిమత విషయాల్లో శ్వేతజాతులకు క్రైస్తవానికి ఆధిక్యం యివ్వలేదు. వీరేశలింగం దృష్టిని రానడేవంటి వారి సాంస్కృతిక సంప్రదాయంగా కూడా చూడ వీలులేదు. "British Connection is ordained, is the inscrutable dispensation of providence for India's good"అని

సిద్ధాంతీంచిన గోఖలే, Self Government on the lines of English colonies cannot be attained without work, sacrifice worthy, of the cause అన్నారు.

అందులో రెండో భాగం బొత్తిగాలేనివాడు వీరేశలింగం. పైగా, బ్రిటీష్ సంబంధాన్ని దృఢతరం చేయటమే కాంగ్రెసు ఉద్దేశాలలోకెల్ల ప్రధానోద్దేశమని దుర్వ్యాఖ్యానంచేసి చదివిన ప్రసంగాన్ని ప్రభుత్వాధికారులకు పంపుకొన్నట్టివాడు.

## పరిశోధకుని దివాలా

భార్యనుకోల్పోయి, ఆరోగ్యంపోయి, అసహాయదశయని వర్ణించుకొన్న కాలంలో 1911లో పంచమజార్జి చక్రవర్తి ఢిల్లీ దర్బారుపై కీర్తనలు కైవారాలు అందరిలాగా వ్రాయలేదనుకొంటానని అదే ఆయన బ్రిటిష్ భక్తి రాహిత్యానికి తార్కాణమని వ్రాయబూనటం వరదనీటిలో కొట్టుకుపోయేవాడు గడ్డి పోచనుకూడా గొప్ప ఆధారంగా గ్రహిస్తాడన్న సామెతను రుజువు చేస్తున్నది. దివాలాగదా!

అసలింతకూ 1911నుంచీ పంచమజార్జి రాజభక్తిని బ్రిటిష్ భక్తినీ పంతులుగారు వదిలేసుకొన్నారంటున్నారా ఏమిటి ? ఐతేమరింకోమాట అనేద్దాం. మొదటి ప్రపంచ యుద్ధకాలంలో, తిలక్‌తోసహా కాంగ్రెసు రెండువర్గాలవారూ కలిసి బ్రిటిష్ విజయమే తమ విజయమని యుద్ధసహకారమందించారు. అటువంటప్పుడు మన వీరేశలింగం గారొకేవొక్కరు అటువంటి ప్రార్థనపద్యాలు విజయాకాంక్షల పద్యాలు వ్రాసినట్టులేదు. కావున గాంధీ, బీసెంట్ లాల్-బాల్-పాల్ కంటే పంతులుగారే నిజమైన అతివాద జాతీయతమూర్తీభవించినవాడు సుమా అని అనేద్దాం!! అంటే ఏదో అడ్డం వచ్చేట్టుంది. యుద్ధకాలంలో పంతులుగారెలా వున్నారంటారు? 1913జూలై లగాయతు 1916మార్చి దాకాను, మళ్ళీ 1916లోను కూడా పంతులుగారు మంగమ్మకేసులో కోర్టుల్లో రొష్టు పడుతూ వున్నట్టుందిగదా, అప్పుడేమి వ్రాసేట్టున్నారు అని ఎవరేనా అనేస్తారన్నదే బెంగ, బెదురు. ఎవరేమంటే ఏముంది, విశాంధ్రులు ఎలాంటిదైనా ఒప్పుతారు కావున్న వ్రాయొచ్చను కొంటాను.

దేశభక్తిని మింగేసినంత బ్రిటిష్ భక్తి కలవాణ్ణి పట్టుకొని, స్వదేశీమేరకేనా జాతీయతాదృష్టిలేనివాణ్ణి పట్టుకొని మితవాదుల్లో మితవాది అందాంగాని యింకేమీ అనవద్దని ఒక పరిశోధకుడు, మితవాదంలో తీవ్రవాదియని మరొక పరిశోధకుడు గాలిని మూటగట్టుతున్నారు. వీరేశలింగంగారిలో యింకేముందో చూడండి.

## పంతులుగారి స్వదేశీ : బరంపురం స్వదేశీ

ఈ పరిశోధకులు చూపలేకపోయారుగాని, పంతులుగారు 1880ల్లో స్వదేశిని గూర్చికూడా వ్రాశారు. స్వదేశీవస్తువినియోగం, దేశిపరిశ్రమలను ప్రోత్సహించాలనే



భావాలు 1870లోనే పుట్టినై. బెంగాలీబాబులు, మహారాష్ట్రకాకాలు స్వదేశీ ప్రచారం ఎప్పుడో ప్రారంభించారు. 1870నాటికి భోలానాధచంద్రులు విదేశవస్తు బహిష్కారం బోధించాడు. పూనాసార్వజనికసభ, సార్వజనికకాకా గణేష్‌వాసు దేవజోషి అందుకు అప్పుడే ప్రసిద్ధి చెందారు. బెంగాలీప్రభావంపడి మనబరంపురంనుండి 1875లోనే స్వదేశి అన్న తెలుగుపత్రికే ప్రారంభమయివుంది. ఇవన్నీ తెలుసుకొని పంతులుగారుకూడా 1880లో స్వదేశి భావాలను పత్రికలో వ్రాశారు. ఎలాగైతేనేమి, అప్పుడెప్పుడోవ్రాసి, వ్రాసినప్పుడు ఆచరించకపోయిన కార్యశూరుడై, పాతికేళ్ళు గడచిన పిదప ఆ భావాలే ఒకపెద్ద వుద్యమమైవచ్చేసరికి, దానికి ఆమడదూరంగాపోయి శాపనార్థాలు పెట్టారు. పంతులుగారి కార్యశూరత్వం సంఘసంస్కరణతో స్వదేశీయులమీదికేగాని స్వదేశీబోధను ఉద్యమంగా విదేశ ప్రభుత్వంమీద ప్రసరించే కార్యశూరత్వం గాకపోయింది ! పంతులుగారు నేతబట్టేవేసినవారు గారటమరి. ఏమైనా పంతులుగారి కార్యశూరత్వంలో కిటుకు కూడా అక్కడేవుంది.

## పంతులుగారు : మద్యనిషేధం : ఆత్మారి

అంతేగాదు, వేశ్యాసమస్యమీద పంతులుగారు చూపిన శూరత్వాన్ని త్రాగుడు దురాచారంమీద చూపలేకపోయారు. తెల్లదొరతనంక్రింద త్రాగుడు పెరిగిందని పత్రికా రచన కొంతచేశారేగాని, దానిని మాన్పడానికి ఏమీ కార్యశూరులు గాకపోయారు. సభలైనా జరపలేదు. రాజమండ్రిలో నలుగురి త్రాగుబోతులను సంస్కరించడానికైనా యత్నించలేదు. ఆయనకు బ్రాహ్మ సంస్కారమార్గం అందించిన ఆత్మూరివారు ఇంటర్‌నేషనల్ టెంప్లార్‌గా సభలుచేసి, అఖిలభారత అగ్రాసనాధిపత్యం (1878లో) వహించారు. అంతపాటి కృషి పంతులుగారు చేయనేలేదు. లోకరంజని అనే తెలుగుపత్రిక త్రాగుడును నిషేధించాలని గోలచేసింది. అసలిట్టి టెంపరెన్సు ఉద్యమాన్ని ఇంగ్లీషువారుకూడా ప్రోత్సహించారు. బొంబాయి రాష్ట్రంలోనే ఆందోళన ముందుగా తలెత్తింది. ప్రభుత్వ విచారణసంఘం ఏర్పడింది. 1876-77 సరికే ఆ పని జరిగింది. అందుకే పంతులుగారు తమ పత్రికలో బొంబాయిలెక్కలు ఎక్కువగా యిచ్చారు. మహాత్మజ్యోతిబాపూలే పూనామున్సిపాలిటీలో సారాదుకాణాల లైసెన్సులకు అడ్డునిలిచారు. రాజమండ్రి కౌన్సిలర్‌గాను, తాలూకాజిల్లా బోర్డుల్లో మెంబరుగాను వుండీ అటువంటి కృషిని పంతులుగారు చేయలేదు. మద్యపానవిషయంలో పంతులు గారి వైఖరి సరళమని నిడదవోలువారే అన్నారు కదా ! అందుకే తమిళ మహాకవి భారతియార్ చంద్రికనవలలో త్రాగుబోతుఅయిన అయ్యంగారు పంతులుగారికి మంచి దోస్తుగా సృష్టించివున్నారుగదా ! మద్యపాన నిషేధకృషి బ్రిటిష్ ప్రభుత్వాదాయానికి దెబ్బకదా. అందుకే పంతులుగారు త్రాగుడును గూర్చి మాటలతో సరిపెట్టారు. వేశ్యావిషయం యింగ్లీషు ప్రభుత్వానికి దెబ్బకాదు. అదే కిటుకు.

## తెల్లదొరతనాన్ని నష్టపెట్టని సమస్యలే

ఇంగ్లీషు ప్రభుత్వాన్ని నష్టపెట్టే విషయాలజోలికి వెళ్ళకపోవటం పంతులుగారి జాగ్రత్త. ఆదినించీ ఆ జాగ్రత్తవుంది. రైతులు చెల్లించే భూమిపన్నును గూర్చిగాని, ఉప్పుధరను ఉప్పుపన్నును గూర్చిగాని ఆయన పత్రికలలో వ్రాసినజాడలేదు. ఆంధ్ర ప్రదేశ్‌లో స్వాతంత్ర్య సమరం అని మామిడిపూడి వెంకటరంగయ్యగారొకగ్రంథం కూర్చారు. అందులో ఆనాటి తెల్లదొరతనం దృష్టికెక్కిన పత్రికా రచనలను చాలా ఉటంకించారు.

## తెల్ల ప్రభుత్వ దృష్టిలో వివేకవర్ధని

అందులో వివేకవర్ధని నుంచి 1875 మొదలు 1887 వరకు గల రచనల నుంచి 14 ఉల్లేఖనలు ఆనాడు ప్రభుత్వదృష్టి బడదగియుండిదృష్టిబడినవని ఆచరిత్రలో పొందు పరచారు. అందులో ఉద్యోగాలు-జీతాలు-పరీక్షల వయస్సు-ప్రొమోషన్లను గూర్చినవి ఆరు వ్రాతలు; ఇల్బర్టు బిల్లును గూర్చి వ్రాసినవి రెండు; ఆయుధచట్టం గూర్చి ఒకటి; యుద్ధవ్యయం-సైన్య సమీకరణను గూర్చి ఒకటి; వేశ్యాబాలికలను బాలికాపాఠశాలల్లో చేర్చుకోవద్దని ఒకటి, నల్లమందును నిషేధించమని ఒకటి, రంపపితూరిని గూర్చి ఒకటి, భారతదేశ దారిద్ర్యం అన్నదొకటి-వెరశి 14 ఉల్లేఖనలున్నాయి.

ఉద్యోగాలను గూర్చిన గోల అప్పుడు సర్వసామాన్యమైనదే. భారతీయులై పత్రిక పెట్టినవారంతా వ్రాసిందే అది. సురేంద్రనాథబెనర్జీ ఉపన్యాసాలేఅవి. పాశ్చాత్యు లను ఇండియన్ జడ్జీలు విచారించే అధికారమిచ్చే ఇల్బర్టు బిల్లును ఉపసంహరించుకో రాదని ఆందోళన చెయ్యని పత్రికారాజములేదు. ఆంగ్లేయులకే ఆయుధ ధారణ హక్కు కాదు, ఇండియన్లకు కూడా యిమ్మన్నదొకటి.

యుద్ధవ్యయం భారతదేశంమీద వెయ్యరాదు, మీరూ భరించనక్కరలేదు, అందుకు జీతాలు తగ్గించండి, సంస్థానాధిపతుల సైన్యాలను యుద్ధసమయంలో పుచ్చు కోండి. వలంటీరుదళాలు ఏర్పరచండి, యుద్ధసమయంలో వాడుకోండి-ఉభయ తారకమైన మార్గం అని సూచించారు. నల్లమందుని నిషేధిస్తే ఆదాయం పోతుందని చూడవద్దు-పన్ను విధించి వాడకం అనుమతిస్తే ఆ పన్నులచేత చైనాలోలాగున నల్లమందు తిరుగుబాటులు జరగవచ్చుసుమా అని హెచ్చరించటం విశేషం.

1878లో రంపపితూరికి కారణం కొండజాతివారిమీద అబ్కారీ కాంట్రాక్టరు వసూలుచేసే పన్నుకొరకు పోలీసులు సహాయపడటంలో దౌర్జన్యకాండ జరిగింది. అక్కడ కాంట్రాక్టు, పన్ను ఎత్తివేయాలని పురుషార్థప్రదాయిని వ్రాసింది. పోలీసులను గూర్చి పురుషార్థప్రదాయిని రెండవసంచికలో చదువునీతిగల పోలీసులు కావలెనని వ్రాసి



వుంది. రంపఅల్లరిలో చదువు, మంచికుటుంబముచూచి పోలీసులుగాతీసుకుంటేఇటువంటి గొడవలురావని 1879లో పంతులుగారువ్రాశారు. అదీచూచివ్రాతే. అంతేగానినల్లమందును నిషేధించమన్నట్టు మద్యనిషేధం అమలు జరపమని వ్రాయలేదు. అబ్కారీ పన్ను తగ్గించమనీ వ్రాయలేదు. మంచి పోలీసులను తయారుచెయ్యమన్నారు! ఇండియా ఆదాయాన్ని ఏటా ఇరవైకోట్లు ఇంగ్లాండుకు తరలిస్తున్నారు. అదే మా దారిద్ర్యానికి హేతువుగాని జనాభాపెంపు హేతువుకాదు; తురకరాజులనాడు పంటలో ఆరోభాగం పన్ను-ఇంగ్లీషు పాలనలో మూడోవంతు పన్ను అయింది. దాన్ని ఇంగ్లాండుకు తర లిస్తున్నారు అని వ్రాశారు. ఇవీ వీరేశలింగంగారి పత్రిక వ్రాతలు. తెల్లదొరతనం దృష్టి కెక్కిన స్వాతంత్ర్య సమర సంబంధమైన అంశాలుగా ప్రాధాన్యంపొందినవి.

## కొక్కొండవారి పత్రిక: షోడశ ప్రశ్నలు

కొక్కొండ వెంకటరత్నంగారి ఆంధ్రభాషా సంజీవనిలో ఒక్క కుల విష యాన్ని మినహాయించితే, ఆయనగారు తన పాఠకుల నుంచి సమాచారాన్ని కోరుతూ అడిగిన ప్రశ్నావళి నిజంగా అద్భుతమైనది. ఆ పిచ్చిపంతులుగారి పదిహేను ప్రశ్నలు (కులప్రశ్నవదలితే) నిజంగా రాజకీయంగా కీలకమైన ప్రశ్నలు. విద్య-ఉద్యోగాలను గూర్చి వేసిన మూడు ప్రశ్నలు-వ్యవసాయదారుల శ్రమానుగుణమైన ఆదాయం మిగులుతున్నదా, ధాన్యం ధరలెందుకు పెరుగుతున్నాయి, ఏ పన్నులు అధికంగా వున్నాయి, ఎంతకు తగ్గించాలి, ఏ పన్నుల వలన ఏ పనులను ఎంతవరకు చేస్తున్నారు. వర్తకులకు పూర్వంవలె లాభాలుంటున్నవా ? తక్కువెక్కువలకు కారణాలేమిటి ? నూతన న్యాయవిధానము, ప్లీడర్లు, పోలీసు వ్యవస్థ వలన ప్రజలకు ఉపయోగమెంత వరకున్నది ? పాతవ్యవస్థే మెరుగా ? నేరములకనుగుణమైన జరిమానాలు దండనలు విధించబడుతున్నవా ? ఇంగ్లీషు రాజ్యంలో నిష్పక్షపాతంగా న్యాయపాలన జరుగు తున్నదా ? బొంబాయి, కలకత్తా రాష్ట్రాలలో లాగానే జమిందారీ విధానం కావాలని కోరుతారా ? జమిందారీ, రైత్వారీ భూముల రైతుల స్థితిగతులలో తారతమ్యంఏమిటి? కంపెనీ పాలన మెరుగా, రాణీపాలన మెరుగా ? ఇలా వేసిన ప్రశ్నలు నిజమైన రాజకీయ పరిపాలనా ప్రశ్నలు. ఆంధ్రభాషా సంజీవని వీనికెటువంటి సమాచారం పోగుచేసి రాసిందో తెలియదుగాని కందుకూరి పత్రికను కీర్తించేముందు (1874 నవంబరు) ఇటువంటి ప్రశ్నలతో నడిచిన పత్రికలున్నవని తెలుసుకోవాలి. ఆంధ్ర ప్రకాశిక 1885లో పుట్టి 40 ఏళ్ళు పైగా నడచింది. కృష్ణాపత్రిక పుట్టేదాకా అదే నిజమైన తెలుగు రాజకీయ పత్రిక-జాతీయోద్యమ పత్రిక.

## ఉప్పు సమస్య-పంతులుగారు

వివేకవర్ధనిలో జనసామాన్యమును పట్టిపీడించే సమస్యలు తక్కువ. పైగా సమస్యల విషయంలో తప్పుదారి పట్టినది. ఉప్పుశాఖలో భారతీయులకు కేటాయించిన

చిన్న ఉద్యోగాలను తెల్లవాళ్ళే కబళిస్తున్నారని వ్రాసి ముగించిందేగాని. మణుగు ఉప్పుధర, బస్తా ధాన్యం ధరకంటె ఎక్కువగా నిర్ణయించారని, ఉత్పత్తి ధరకన్న 200 రెట్లకుపైగా ధరనిర్ణయించి అమ్మనిస్తున్నారని, పన్ను అత్యధికమని (రూ.2-60) దాని మీద ఇతర తెలుగుపత్రికలు వ్రాసినై, గాని వివేకవర్ధని వ్రాయలేకపోయింది. అందులో ఉద్యోగాలగోలేగాని జనబాహుళ్య సమస్య పట్టలేదు. అంటే అదితెలియదు అందామా ? ప్రభుత్వ ఖజానాపై దాడి అవుతుంది గావున దానిని వదలివేయడమందామా ? అందరూ వ్రాసిన దానిని ఆయనే ఎందుకు వ్రాయలేకపోయినట్టు ? వీరేశలింగంపై పరిశోధక శిఖామణిగా చెల్లజూస్తున్న మిత్రులు అంతపెద్ద సమస్య అయిన ఉప్పు సమస్యపై ప్రభుత్వ విధానాన్ని పంతులుగారు విమర్శించిన దాఖలాలు మనముందుంచలేదు. పంతులుగారి సాంఘిక రాజకీయ భావాలపై డాక్టరేటు చేసినవారికీవిషయాలుపట్టలేదు. పంతులుగారైనా స్వీయచరిత్రలో తామై అట్టి ముఖ్య విమర్శ చేశామని చెప్పలేదు.

## పంతులుగారు: రైతు సమస్యలు: కరవులు

పంతులుగారు వ్యవసాయాన్ని గూర్చి వ్రాసినదానిలో సత్యం సాంతం గల్లంతు అయింది. స్వీయచరిత్రలో తమ దేశభక్తికి సమర్ధనగా "దొరతనము వారికి చెల్లించవలసిన నేలపన్నుల మొత్తముకంటె నీరిచ్చెడు రాజపురుషులకియ్యవలసిన మొత్తమెక్కువయినప్పుడు నేలపన్ను కొంచెము తగ్గింపబడిన మాత్రమున కాపులకేమి మేలిమి కలుగును" అని (1వ భాగం-60 పేజీ) "పూర్వపురీతి క్షామములకిప్పుడు క్షామమువచ్చుచున్నది" యని (2వ భాగం-217 పేజీ) వ్రాయసాహసించిన మహానుభావుని దేశాభ్యుదయదృష్టిని ఏమని కీర్తించగలమో ఆలోచించండి.

ధనమును లెస్సగానుపయోగించుకోగలుగు తెలివిని గలిగింపక కాపులను మూర్ఖత్వములోనే మునిగియుండునట్లుజేసి వారికి ధనము దశగుణములధికముగా లభించు మార్గము లేర్పరచిన పక్షమున దానివలన నేమి ప్రయోజనము ? [213 పేజీ-1వ భా. స్వీ. చ]

## లంచాలు పంతులుగారి వీరం :

కృష్ణా గోదావరీ డెల్టాలలో కాలువనీరు విడుచుటకు ఆ కాలములో కోరిన లంచాలే, ఆ డెల్టా సమస్యలే కనిపించినవిగాని, దేశములో నూటికి 90 వంతుల సాగుభూమి చెరువులు బావులమీదగాని, ఆకాశరాజు కటాక్షంమీదగాని అప్పుడు ఆధారపడివున్నదని, నీటిలంచాల సమస్య గోదావరిక్రింద రాజమండ్రి సరిహద్దులలోనేగాని దేశవిస్తృత సమస్యకాదనీ స్ఫురణమాలి వున్నారన్నది స్పష్టం.ఇది దారితప్పినదృష్టి-వ్రాత అసలు విషయం లంచవ్యతిరేకోద్యోగవిజయాలు తెల్లదొరతనానికి ఉపద్రవకరంగావు. పైగా అది ప్రోత్సహించగలదు. అందుకేవీరు నడిపిన లంచాలవ్యతిరేకోద్యమపు



వ్రాతలు. చేతలను ప్రభుత్వానువాదకుడు ప్రభుత్వదృష్టిలో పెట్టలేదు. స్థానిక సమస్య అయిన లంచాలమీద స్థానికఖ్యాతి ప్రభుత్వసహాయంతోనే లభించవీలున్నది. అదీ ఎంతో అవసరమైనదే-సందేహంలేదు.కాని అందులోవున్నసులువది. ప్రభుత్వం ప్రోత్సహించింది. వీరేశలింగంగారి సంఘసంస్కరణలోవున్న వీలు,సులువు అదే. దొరతనపు అండతో దేశీయుల దురాచారాలను పోరాడటం నిజమైన రాజకీయ పోరాటం జరపటంకన్న సులువు. ఆనాడున్న పరిస్థితికూడ అదే. అలా చేయొచ్చు. కానిదానిలోని సులువునుకాస్త గుర్తెరిగి మాట్లాడుకోవాలి మనం.

అంతేగాదు నీటి తీరువాకన్న నీరు వొదిలే వుద్యోగికి యిచ్చే లంచం ఎక్కువ అనేమాటలు పంతులుగారికి అలవాటైన అతిశయోక్తులు - లంచాలెన్నటికి అసలుకన్న వడ్డీఎక్కువ అన్నట్టివిగా వుండవు. అప్పట్లో అసలట్లాలేవు. ఇప్పటికీ లాభించేదానిలో కొంతభాగమేగాని మించి వుండలేదు. ఒక్క నేలపన్నునీటి తీరువాల సంగతేకాదుకోర్టు కేసుల విషయంలోనూ యింకొకదానిలోనూ లంచాల సమస్యయే మౌలికమయినదని చెప్పి. మూలవ్యవస్థను కదిలించకుండా కొనసాగుతుండడమే గొప్పపనిగా చెప్పడానికి చేసే అతిశయోక్తులివి; అంతేగాని అప్పట్లో అది అసలే మౌలిక సమస్యకాదు.

## పంతులుగారు దాచేసిన నాగేటి సమ్మెలు

నాటి నాగేటి సమ్మెలను పంతులుగారెరుగరా ? అసలు డెల్టాలలో వేసిన నేల పన్నులు నీటిపన్నులు డెల్టావలన పెరిగిన ఆదాయంకన్న ఎక్కువో సమానమో అంత తక్కువగాకనో ఆనాడురైతులు నాగేటిసమ్మెలు చేయవలసివచ్చిందన్న చరిత్రతెలియని వారేపంతులుగారి యీవ్రాతలునమ్మాలిగాని తెలిసినవారెవ్వరూ నమ్మరు.కానికమ్యూనిస్టు చారిత్రకలుసమ్మారు.ఉన్నవవారిమాలపల్లినవలలోనినల్ల మోతువారినాగేటిసమ్మెవృత్తాంతం 1880-1890కాలములోనిది,మాముత్తాతలు-అనగా కవిరాజుత్రిపురనేనిరామస్వామిచౌదరి తండ్రితరంలో గుడివాడ సీమరైతులు భూములుబీడుపెట్టి అరకమోపకుండా విడిచిపెట్టి సాగుచేయలేమని జమాబందికివెళ్ళి కలెక్టరు తాసిల్దారుకు భూములప్ప గింతపెట్టబోవటము, వారినిపట్టి నాలుగునాళ్ళు కారావాసములో పెట్టివదలటము, ఆపైన నెమ్మదిగా శిస్తులుతగ్గించటము గతశతాబ్ది చివరిలోని వ్యవసాయచరిత్ర. అదిలంచాల సమస్యకాదు. భూమిశిస్తుసమస్య. కమిషన్‌వేసి శిస్తుపునర్విచారణ జరుపనున్నారని, అదెలాబహిరంగంగా జరపాలో నిర్దేశిస్తూ ఆంధ్రప్రకాశికా పత్రిక ఆందోళన చేసిన సమస్య. మౌలికసమస్య. శిస్తునునిజంగా తగ్గించాల్సిన వైనం.

ఇంగ్లీషు పాలనలో కరువులే కరవై పోయాయని వ్రాయడంకన్న కల్లవ్రాతలు-తెల్లదొరతనపుదాసానుదాసత్వము మరొకటి ఏముంటుంది? హిందూ రాజ్యాలంతరించినది లగాయతుజలాధారాల ఆలనపాలనపోయి తురకలనాటికంటే ఇంగ్లీషు వారికాలంలో కరవులెక్కువయ్యాయని చరిత్రలు ఘోషించాయి. కృష్ణా గోదావరి ఆనకట్టలు ఏర్పడిన తర్వాతకూడా ఆ జిల్లాల మెట్టప్రాంతాలలోనే ఘోరమైన కరవులు సంభవించాయి.

## కరవులభారతం : పంతులుగారి భాగవతం

పంతులుగారు పత్రికపెట్టి దేశ సమాచారం సేకరించి దేశసేవ చేయబూను కొన్నారు. సంఘసంస్కరణకేకాదు, భాషా సంస్కరణకేకాదు, పత్రికాకర్తగా ప్రజల బాధలు, ప్రభుత్వ అశ్రద్ధ వంటివన్నీవ్రాసి దేశప్రజాభ్యుదయానికై పాటుపడినదేశభక్తి పరునిగాకూడా చెప్పుతున్నాంకదా! ఆయన 1874 నుంచి పత్రికారంగంలో వున్నారు. ఆ కాలంలో క్షామదేవత తాండవిస్తోంది. 1877, 1878, 1889, 1892, 1897, 1900 సం॥రాలలో ఏర్పడిన పెద్దకరవులలో తక్కువలో తక్కువగా అంచనావేస్తే కోటిన్నర ప్రజలు మృతిచెందారు. అనగా ఇంగ్లాండులో సగంజనాభా తుడిచిపెట్టుకు పోయినంత జననష్టం ఆ కరవుల్లో ఇండియాలో జరిగిందన్నమాట అని రమేశచంద్రదత్త, నౌరోజీలవంటి దేశనాయకులు, చారిత్రకులు వ్రాశారు. (త్రివేణి, Oct- Nov 1985, Vol·5, సంచిక-3, పేజీ 27-31) 1860 లగాయతు 1908వరకుగల 49 సం॥రాల బ్రిటిష్‌పాలనలో యిరవైసం॥రాలు కరవు సంవత్సరాలని ప్రభుత్వ రికార్డులే చాటు తున్నాయి—ఇవన్నీ కాంగ్రెసు మితవాద శిఖామణి అయిన దాదాభాయి నౌరోజీ వ్రాతలనుంచి యిచ్చిన ఉదాహరణలు-1897నాటికి కరువుపనులకై, కరువు నివారణకై కేటాయించినధనం కోట్లరూ॥లు కరువు క్రింద కర్చుపెట్టకుండా నిల్వవుందని, దాన్ని వ్యవసాయాభివృద్ధికి, నీటివనరులకు కరువు పనులకేగాని మరొకరకంగా వ్యయం చెయ్యరాదని ఆనందాచార్లుగారు మద్రాసు కౌన్సిల్లో గోలపెట్టుతున్నారు. 1890-1900 మధ్యగల పదేళ్ళలో ఆరేళ్ళు కరువులకాలంగదా!

## ఆంధ్రుల మారిషస్ వలసలు : పంతులుగారి వ్రాతలు

1872లో విశాఖగంజాం జిల్లాలలో కరువు వచ్చింది—ఆ వార్తలు పురుషార్థ ప్రదాయినిలో వున్నాయి. ఆంధ్రప్రకాశికఆ తర్వాతకాలంలో కరువులనుకరువుకమీషన్లను గూర్చి ప్రధానంగా వ్రాసిన పత్రిక. బుడావెంకటరెడ్డి,డొక్కాసీతమ్మగార్ల * కరువుకాలపు

* డొక్కా సీతమ్మ, జోగయ్యగార్ల కరవుకాలపు దాతృత్వం గోదావరి మండలంలోనే-



దాతృత్వం, ధాతకరవు వీరేశలింగంగారి కాలంలోనే సుమీ! వీరేశలింగంగారికాలంలోనే కరువులకు తాళలేని ఆంధ్రప్రజలు మారిషస్‌కు వలసవెళ్ళి పోతున్నారని పురుషార్థ ప్రదాయిని వ్రాసింది. రంగూన్‌కు సర్కారుజిల్లా ప్రజలవలసకూడా ఆయనకాలంలోనే సుమీ. 1876లో వచ్చిన కరువులో ఒంగోలు సీమలో అన్నంపెట్టి కరువు నుంచి తప్పిస్తాముగాని మతం మార్చుకోవాలి, అనగా క్రైస్తవులు కావాలన్నారు. అలా రోజుకొకవందమంది చొంతునఅకలిచావులు తప్పుకోటానికిమనజనులుమతం మార్పిళ్ళకు గురిఅయ్యారు. ఇవేవీ వివేకవర్ధనికర్తకు పట్టలేదు. పంతులుగారిపై పరిశోధక పట్టా పొందినవారు యింగ్లీషు పాలనలో కరువులుపోయాయని పంతులుగారి కల్లమాటలనే చిలకలై వల్లిస్తున్నారు. కృష్ణా గోదావరి ఆనకట్టల నిర్మాణాలతో దేశంలో కరువు పోయిందనుకొంటారు. వివేకానందులు కలకత్తా ప్లేగుకాలంలోనూ, బెంగాలు కరువు కాలంలోను(1897-98)నపంజాబుకరవులో శ్రద్ధానందులు నిధివసూలు సేవాకార్యక్రమం గొప్పగాచేపట్టారు.ఆంధ్రలో ముద్దు నరసింహంనాయుడుగారుకరువుకాలంలో వ్యాపించిన కలరాలలో1850కి ముందేదాని నివారణకృషి చేసివున్నారు. వీరేశలింగంగారుఅటువంటి ఆపత్కాల సేవలను చేయలేదు. క్రైస్తవుల నుంచి అటువంటి సేవాధోరణిని నేర్చు కోలేదు. అటువంటి సేవా కార్యక్రమం వారి ప్రణాళికకాదు. వారి రంగం సంఘ సంస్కరణ - వితంతు వివాహం, స్త్రీ విద్య.... అంతే.

ఇంత దారుణంగా కరవులు తాండవించిన ఇంగ్లీషు రాజ్యాన్ని కరవులు కరవైనరాజ్యమని యిరవై పాతికేళ్ళ పత్రికారచన, పత్రికా ప్రచురణచేసిన పత్రికాధిపతి వ్రాస్తే, అతణ్ణి దేశభక్తుడు అని అనగలరా ? బ్రిటిష్ భక్తి పరాయణుడన కుండగలరా? వీరేశలింగంగారినైతే అనరాదా ? ఆలోచించండి.

## కృష్ణాడెల్టాలో రైతు : డెల్టాలో కరవు

1866-1880 మధ్యకాలంలో కృష్ణా డెల్టాలో రైతు ఆదాయాన్ని తెల్లప్రభుత్వం పరిశీలించి ఒక నివేదికలో ప్రచురించింది. వందరూ॥ల శిస్తు చెల్లించేంత భూవసతిగల రైతు 'ఉమ్మడి కుటుంబంలో యిరవై' ముప్పైమంది సభ్యులుండేవారు. రెండుమూడు అరకల వ్యవసాయం వుండేది. అనగా, పది ఎకరాల భూమికావచ్చు. దానిమీద గొర్రెపెంట ఎరువు కట్టించడానికిగాని, నాట్ల తరుణంలో కూలికిగాని 50 రూపాయలు, పై ఖర్చులు పెట్టి ఉమ్మడి కుటుంబంవారు ఏడాదిపొడువునా శ్రమపడి పండిస్తే పండిన పంట మొత్తం విలువ అప్పుడు 300రూ॥లు. అందులో శిస్తు, ఎరువు, కూలిపోగా 150 రూపాయలు మిగిలేదట. అనగా యిరవయిమంది సాలుసరిసంపాదన 150 రూ॥లు. నెలకు తలసరి ఆదాయం పది అణాలు! వీరేశలింగంగారూతన తల్లీగలఇద్దరికుటుంబానికి

వారి యింటి భాగాన్ని అద్దెకిచ్చి నెలకు 4 రూ॥ల చొప్పున వచ్చిన ఆదాయం నుంచి ఆయన చదువుకోవటం కష్టంగా వుండేది; పెద్దతండ్రి ఆదుకోవలసి వచ్చేది. యిద్దరు గల పట్టణ కుటుంబం నెలకు 4 రూ.లతో జరుపుకోవటం కష్టమని చెప్పుతున్న కాలంలో అంతకు పదిరెట్లు సభ్యులుగల రైతు కుటుంబానికిపన్నెండున్నర రూపాయలు నెలసరి ఆదాయమంటే ఎంత కష్టంగా వుండేదో ఆలోచించండి. అంతపాటి భూమిగల కుటుంబాలలో మూడోవంతు అప్పుల పాలై వుండేవని ప్రభుత్వలెక్కలు. ఈ ఆదాయం బాగా పండిన సం॥రం సంగతి. మొత్తం పంటలో శిస్తు మూడోభాగంగాను-రైతు నికరాదాయంలో మూడింట రెండు వంతులుగాను వుండేది. వర్షపువరదలతో నష్టపడిన సంవత్సరాలలో అప్పుచేయడమే. అందుకే కృష్ణా డెల్టాలో నాగేటిసమ్మెలు జరిగినై. 1890-1900 మధ్యకాలంలో గోదావరి కృష్ణా డెల్టాలో కూడా రెండో పర్యాయం శిస్తు సెంటిలుమెంటు జరిగింది. ఆ దశాబ్దంలో రాష్ట్రంలో 1890-92, 1896, 1897 1898, 1900 సం॥రాలు కరువు సంవత్సరాలు. కృష్ణా డెల్టాలో కూడా కరువువచ్చింది. [A.V. రామారావుగారి The Ecomomic Development of A.P.- 4,5 అధ్యాయాలు] మా అంగలూరు హరిజనులు గుడివాడలో దుకాణాలు దోచుకున్నారు. మా పాలేళ్ళు మాదిగవారు అందులో పాల్గొన్నారని మాతాతగారు చెప్పేవారు. వారిని నేను బాగా ఎరుగుదును.

హిందూ రాజ్యాలు అంతరించినది లగాయతు జలాధారాల మరమ్మతుల ఆలన పాలనపోయిపోయి, ముస్లిం పాలన నుంచీ ఇంగ్లీషుపాలనాకాలం వచ్చేసరికి గత శతాబ్దం మొత్తం భారతదేశం చరిత్రలో కరవుల శతాబ్దమై పోయిందని చరిత్ర ఘోషిస్తుండగా, ఇంగ్లీషు పాలనలో కరవులే కరవైపోయాయని వ్రాసిన వ్రాతలు-తెల్లదొరతనపు దాసానుదాసత్వపు వ్రాతలు కాక మరేమవుతాయి ? ముస్లింపాలనలూ 1/6 శిస్తునుంచి యింగ్లీషుపాలనతో 1/3 శిస్తు అయిందని పత్రికలో వ్రాసినవారే శాశ్వతమైన గ్రంథాలలో కరవులు కరవైన మంచి కాలమని, ధనమును ప్రయోగించు తెలివిలేని రైతుకు పదిరెట్లు ధనాదాయం పెరిగే మార్గాలు ఏర్పరచడం నిష్ఫలమని, వ్రాయ జాలిన మహానుభావుని సంస్కారాన్ని, భావసరళిని ఏమనాలో మతిమంతులమై ఆలోచించాలా, అక్కరలేదా ? ఇట్టి వ్రాతలు 1915లో కూడావీరేశలింగంగారు వ్రాయ గలిగారు. రైతు కూలీ సంఘాలు పెట్టి పని చేసిన కమ్యూనిస్టులు ఇటువంటి వ్రాతలు కానకుండా వున్నారు. వారి ఆంధ్రుల సంక్షిప్త చరిత్రకారులే వీరేశలింగంగారి అసత్య చరిత్రను నమ్మి నడుస్తున్నారు; నడిపిస్తున్నారు. ప్రశ్నించినవారిపై పిచ్చి ప్రచారం చేస్తున్నారు ! !



## వందేమాతరం బాధలు : వీరేశలింగం పగలు

సంఘ సంస్కరణలో పంతులుగారుగాని మరొకరుగాని పడిన ప్రయాసకన్న రాజకీయమైన స్వరాజ్యోద్యమకారులు పడిన బాధలకన్న, చేసిన త్యాగంకన్న ఎక్కువైనదో కాదో కొంత విచారించుకోవాలి. వందేమాతరంలో పాల్గొని వుద్యోగాలకు అర్హత అవకాశం ప్రభుత్వాజ్ఞచేత కోల్పోయి జీవితాంతం ప్రయాసపడిన వందలాది దేశభక్తులనుభవించిన బాధముందు, ఆ వందేమాతరాన్ని శపిస్తూపోయిన వీరేశలింగం సంస్కర్తగా అనుభవించిన బాధలేపాటివి ? సంస్కరణ వీరేశలింగానికి జీవికకు ఉపకరించింది. అదే ఆయన అనుచరులెవ్వరికీ ఉపకరించలేదు. ఆయనగారికి మాత్రమే ఉపకరించింది. ఆ సంగతి వీరేశలింగం వెలుగునీడలకు వ్రాసిన పీఠికలో వివరంగా చెప్పాను. చూడగలరు.

## పంతులుగారి క్రీస్తు జీవితచరిత్ర

అలౌకిక శక్తులు, అద్భుత మహిమలు లేకుండా ఏసుక్రీస్తు చరిత్రని వ్రాయటం ఆయనలో క్రైస్తవ ప్రభావం లేదనటానికి, బ్రిటిష్ భావదాస్యం లేదనటానికీ ఉదాహరించవలసివస్తే ఆ కక్షుర్తిని ఏమనగలం? పంతులుగారు క్రైస్తవప్రభావితులు కారన డానికి వారు వ్రాసిన క్రీస్తుచరిత్రే ఉదాహరణమవుతుందా? మతిగలవారి వ్రాతేనాయిది ? వీరేశలింగం అనే ఆయన క్రీస్తు చరిత్ర వ్రాయటమే క్రైస్తవ మతప్రచారకులకు పెద్ద సేవ అవుతుంది. పంతులుగారు బ్రహ్మసామాజికులు-అది వ్రాసేసరికి అనుష్ఠానికులు కూడాను. బ్రహ్మసమాజం Most Rationalistic Religion అని చెప్పుకొనేది. దానికి తగినపనే అతిలోకమహిమలను తిరస్కరించడం. కేశవచంద్రసేను క్రీస్తును గూర్చి వ్రాశారు. దేవేంద్రనాథులూ వ్రాశారు. ఆ బ్రహ్మసమాజ ప్రవక్తలు క్రీస్తు అద్భుత శక్తులను చెప్పలేదు. అవేవో వున్నందుకే క్రీస్తును వారు మెచ్చలేదు. అతిలోకమహిమలు లేకపోయినా క్రీస్తులో వారు దివ్యాంశను దర్శించారు. ఇక్కడ వీరేశలింగం కూడా తన రచనలో అంతే. అతిలోకమహిమలులేని క్రీస్తును కీర్తించిన కేశవచంద్రసేనులు అర్ధక్రైస్తవులే అనిపించుకొని క్రైస్తవులకు ముద్దువచ్చాడు. ఇక్కడ వీరేశలింగం పంతులుగారూ అంతే. ఆయన క్రీస్తు చరిత్ర క్రైస్తవులకు బ్రిటిష్ ప్రభుత్వాధికార్లకు ప్రీతిపాత్రమయినదేగాని చేదనిపించలేదు.

## బ్రహ్మసమాజకర్తల జీవితాలు వ్రాయని పంతులుగారు

అసలదికాదు. నలభై ఏళ్ళుగా బ్రహ్మసామాజికునిగా వుండికూడా అనుష్ఠానికు డనుగాకుండా ఈశ్వర వంచకుడనై వున్నానని, బ్రహ్మసమాజ గ్రంథములు తెలుగులో

వ్రాయకపోతినని స్వీయజీవిత సమీక్ష చేసుకొని జందెము తెంపివేసి దేశిరాజు బాపయ్యననుసరించిన తర్వాత కూడా ఒక్కటైనా ఒక్క బ్రహ్మసమాజ గ్రంథం వ్రాయక పోయినట్టి పంతులుగారు-బ్రహ్మోప్రవర్తకులైన రామమోహనరాయ్, కేశవచంద్రసేను వంటి బ్రహ్మసమాజ ప్రవర్తకుల జీవితచరిత్రలైనా వ్రాయలేదు. ప్రతాపచంద్రమజుందారును గూర్చి వ్రాయలేదు. తెలియదేమో! రామమోహనరాయి చరిత్ర ఎప్పుడో కొంత వ్రాసినదానిని పూర్తిచేయలేదు. దేవేంద్రనాథ కేశవచంద్రసేనుల చరిత్రలనసలే తలపెట్టలేదు. కాని క్రీస్తు చరిత్రను వ్రాసి అచ్చువేశారు. తన అనుష్ఠానిక మత ప్రవర్తకులను గూర్చి అంత పశ్చాత్తాపం ప్రకటించిన తర్వాత కూడా వ్రాయటం మానేసి, అవాంతరంగా క్రీస్తు చరిత్ర వ్రాయడమేమిటి ? అందులో గల మతలబు ఏమిటి ? బ్రాహ్మమతగ్రంథాలు వ్రాయడానికని ఏవి గ్రంథాలు తెప్పించి చదవాలో బెంగాలీ నాయకులను కనుక్కొని, డైరీలో పాఠిక పుస్తకాల పట్టిక వ్రాసుకొని, అదేమీ వ్రాయకుండా అనుష్ఠాన బ్రాహ్మ నాయకులవారు క్రీస్తు చరిత్రను, చాలామంది క్రైస్తవ కన్యకామణుల జీవితచరిత్రలను హిందూవనితలకు ఆదర్శముగా వ్రాసేశారు. జందెం తెంపిన తర్వాత వెనువెంటనే ఈ క్రైస్తవ చరిత్రల ముద్రణే ఆయన చేసిన మహత్కార్యం.

## క్రైస్తవ కన్యల చరిత్ర

గ్రేసుడార్లింగుకన్య, జోన్ ఆఫ్ ఆర్కు, లేడీ జాన్ గ్రే, అలెగ్జాండ్రామహారాజ్ఞి ఎలిజబెత్ ఫ్రై దొరసాని (1780-1845), మేరీ కార్పెంటర్ (1807-1877) దొరసాని గార్ల జీవితచరిత్రలను మన పరిశోధకుని మాటలలో "మహావిషయాలు"తో నింపి వ్రాశారు.

## ఆనాటి హిందూ విదుషీమణుల చరిత్రలేం వ్రాశారు?

1880ల నాటికే జాతి గర్వించదగిన భారతవిదుషీమణులు ఏర్పడినారు. క్రైస్తవ స్త్రీ చరిత్రలను పుస్తకాలుగా వేసిననాటికి, అనగా 1911 నాటికి మరెందరో విదుషీమణులు వెలువడినారు. చరిత్రలో ఎందరో వీరనారులున్నారు. మన పురాణములలో, చరిత్రలలోను ఎందరో పతివ్రతామణులున్నారు. కానివారు అహల్యాబాయి, రమాబాయి, అచ్చమాంబలను తప్ప మరెవ్వరినిగూర్చి వ్రాయలేదు. ఆరుగురు క్రైస్తవ స్త్రీలను గూర్చి వ్రాసి, వానినన్నింటిని ప్రత్యేకంగా ఉత్తమ స్త్రీ చరిత్రలుగా ముద్రించారు. అట్టిపని భారతనారులను గూర్చి చేయలేదు. రమాబాయి సరస్వతితో పాటుగా ఆనందీబాయిజోషీ వున్నది. 18 ఏళ్ళప్పుడు భర్తతో అమెరికావెళ్ళి పెన్సిల్వేనియా వైద్యకళాశాలలో వైద్యపట్టభద్రురాలై తిరిగివచ్చి కొల్హాపూరు వైద్యశాల స్త్రీ విభాగానికి ఆధిపత్యం వహించినది. రమాబాయి వితంతు శరణాలయానికి ధన సహాయం చేసింది. ఇతర విధాల సేవచేసింది. 22 ఏళ్ళ ప్రాయంలో అకాల మృతి చెంది పూనా నగరం మొత్తాన్ని గర్భశోకంలో ముంచిన ఆ ముద్దుల చిన్నారి చరిత్ర వున్నదని పంతులుగారెరుగని విషయమా ? రమాబాయి క్రైస్తవం పుచ్చుకొన్నది. ఆనందీబాయిజోషీ హిందూగానే వున్నది. ఆ యిద్దరి స్నేహితురాండ్రలో ఒకరిచరిత్ర వ్రాసి ఒకరి చరిత్ర వదిలేశారు. ఆ ఆంధ్రయువతీమణి ఎవ్వరోగాని 1880 నాటికి లాపదివి మద్రాసు నుంచి వెళ్ళి విశాఖపట్నంలో న్యాయవాదినిగా పనిచేసినవారొకరున్నారు. సరోజనీదేవి పెండ్లి పంతులుగారే నిర్వహించారు. ఆమె కవయిత్రిగా గత శతాబ్ది చివరికే ఇంగ్లాండులో పేరుపొందివుంది. 1906 నాటికే దేశంమీదపడి మహోపన్యాసాలు చేస్తున్నది. గోఖలేకు ముద్దుగూతురై పోయివుంది. తెలుగువారి కోడలు. బ్రహ్మసమాజం వల్ల స్త్రీలు ఎందరో పేరులోకివచ్చారు. వివేకానందునికి శిష్యురాలైన నివేదిత గొప్ప సంఘ సేవాకార్యక్రమంచేస్తూ హిందువుగా మారిన యూరోపియన్ వనిత. వంగ కవయిత్రి గాయని సరళాదేవి చౌధురాణి, ఆర్యసమాజంలోని పండిత గాయత్రీదేవి, ఆజ్ఞావతి, షరాణదేవి వగైరాలున్నారు. వీరెవ్వరి జీవితాలను ఉత్తమ స్త్రీ జీవితాలుగా వ్రాసి పుస్తకంగా కూర్చకుండా పాశ్చాత్య క్రైస్తవ స్త్రీ జీవితాలు వ్రాసి గ్రంథంగా ప్రకటించడంలో పంతులుగారి జాతీయత ఏమిటి ? సంస్కరణ ఏమిటి ? మతమేమిటి ? బ్రాహ్మమా, క్రైస్తవమా ? చరమదశలో క్రైస్తవ రచనలకు ప్రత్యేకమైన ప్రేరణమేమిటి ? ప్రలోభమేమిటి ? పరిశోధించాల్సిన విషయం కదా !

భారత నారీమణులకు ఆదర్శనారులుగా ఈ క్రైస్తవకన్యల జీవితాలను వ్రాయటం క్రైస్తవ మతాధికారుల, క్రైస్తవ ప్రభుత్వాధికారుల మెప్పుకొరకు వ్రాయటమా, నిజంగా మన స్త్రీలు వీటిని చదువుతారనే, చదవాలనే ఉద్దేశించి వ్రాయటమా ఆలోచించవలసిన సంగతి. ఇటువంటి లొచ్చుపనులు బెంగాలీ బ్రహ్మసమాజనాయకులు చేసివుండరు. అక్కడ క్రైస్తవ గురువులు కేశవచంద్రసేనులవారి వెంటబడి వేచి కాచుకొంటే, వీరేశలింగం యిక్కడ యిలాంటి వ్రాతలతో చిన్నచిన్న క్రైస్తవ గురువుల వెంటపడేవారు; ఆశ్రయించేవారు. ఆ పరమత గురువుల అండదండలతో నడిపిన సంఘ సంస్కరణ, జీవయాత్ర పంతులుగారిది.

## క్రైస్తవ సభలకు పంతులుగారు:

మంగమ్మకేసులో పడి నలుగుతూ కూడా జడ్జి ఎల్విన్ ఏమిచేస్తాడో అని కంపించిపోతున్న గడియల్లో-1914 జనవరి 18వ తేదీన కాకినాడలో "Attended Devine Service Conducted By Reverend SUNDERLAND at 9-00 A.M." అని డైరీలో తాను చేసిన క్రైస్తవోపన్యాసశ్రవణం గూర్చి

వ్రాసుకొన్నాడు. అనగా ఆయన క్రైస్తవం లోపలికంటా ఎంతగా వెళ్ళివున్నాడో, ఆ గురువులకెంత దగ్గరలో మెలగుతున్నాడో వేరే ఏమిచెప్పాలి !

అమెరికన్ యువపరిశోధకుడైన లియోనార్డు పంతులుగారిని గూర్చి వ్రాసిన గ్రంథంలో ఆయనపై మిషనరీల ప్రభావం ఎట్టిదో, వారాయనకెంత ప్రేరణమయ్యారో, ఆయన సంస్కరణాభిప్రాయాలలో అందుకాయన చేసిన ప్రయత్నాలలో ఆయన వారికెంత ఋణపడివున్నారో ఏఏ రూపాలలో సహాయంపొందివున్నారో తప్పక వ్రాసి వుంటాడు. దానిని నేను చూడలేదు. ఆ గ్రంథంకలవారు దాచిపెట్టుకొని నాదాకారానివ్వ లేదు. ఆ భాగం చూస్తేగాని పంతులుగారి అర్ధక్రైస్తవతత్వంయొక్క సమగ్రరూపం తెలియరాదు. అందాకా నవయౌవనంలోవున్న పంతులుగారు రివరెండు బారోస్‌కు తెలుగునేర్పి, అందుకు బదులుగా అతనివద్ద క్రైస్తవం ఉచితంగా ఎంతో నేర్చి వుంటాడనుకోవచ్చు.

## క్రైస్తవ పత్రికల ప్రభావంలో పంతులుగారి పత్రిక

పంతులుగారు పురుషార్ధ ప్రదాయినీ పత్రికను ఆదినుండీ చదివి, ఆ పరవడిలో తన పత్రికను నడిపించారని, అది ముఖ్యమైన ప్రభావమని వీరేశలింగం వెలుగు నీడల్లో నిరూపించారు. అదొక్కటే ప్రభావంగాదు, అప్పటి చాలా పత్రికల ప్రభావం వుంది, దానొక్కదానినే చెప్పటమేమిటని నాయుడు పత్రికాప్రభావం నామోషీగా భావించి శ్రీ యక్షిణి అనే పత్రికను పంతులుగారు గొప్పగా మెచ్చుకొన్న సాక్ష్యము వుందని పరిశోధక శిఖామణులు నవరణ తెచ్చారు. దాన్నెందుకు కాదనాలని అదెవరి పత్రికో ఎట్టిదో జ్ఞాపకం చేసుకోగా బళ్ళారి క్రైస్తవ పత్రిక అయింది. అసలింకా విచారించగా అప్పట్లో అధికాధిక పత్రికలు మిషనరీలవిగా తేలింది. అప్పటి పదిపన్నెండు పత్రికలను పంతులుగారుచదివి జీర్ణించుకొారన ఈపరిశోధకుల వాక్యాన్ని తరచుగా Native public poinion అనే మద్రాసు క్రైస్తవ పత్రిక, రివరెండు బారోస్ రాజమండ్రి మిషనరీ పత్రిక Godavari Educationist (ఇదే పంతులుగారి తొలిరచనలకు నెలవు) ప్రభావందాఖలాలు ప్రసిద్ధమే గదా! బందరు నుంచి రివరెండుషర్కీ మిషనరీ 1877 దాకా నడుపుతున్న హితవాది ఆయన తప్పకుండా చూచినదే. ఆయన పత్రిక పెట్టిన తర్వాత కూడానడిచినదేకదా ! అంతేగాక, సామినేనిహితసూచనిని 1862లో ధారావాహికంగా అచ్చువేసిన పత్రికఅది. ఆ పుస్తకాన్ని పంతులుగారు సంపాదించి, దాని వ్యాసాలను వాడుకోవటం బద్దనిరూపితాంశంకదా ! ఇక రివరెండు పెర్సివల్ మద్రాసు నుంచి నడిపిన దినవర్తమాని పత్రిక ప్రభావంకూడా అందులో వచ్చిన అంశాలను బట్టి వున్నదనటానికి ఆక్షేపణ మేమీలేదు. ఒకటేమిటి 1850 తర్వాత



రాష్ట్రంలో వెలువడిన సర్వక్రైస్తవ పత్రికల ప్రభావం పురుషార్ధ ప్రదాయినితో పాటుగా వుందనమనే మన పరిశోధకుని అభిప్రాయం కావాలి. అది ఇలా వుంది అని ఇప్పుడు తెలుపుకొన్నాం గదా: ఎక్కువగా వీరేశలింగంగారు క్రైస్తవ ప్రభావాన్ని కోరు కొన్నట్లే, వారి పరిశోధకులు కూడాఇప్పుడుఅట్టివిశాలదృష్టికలవారై ఆ క్రైస్తవ పత్రికా ప్రభావాలను చెప్పలేకపోయిన వారిని తప్పు పట్టటం ఎంతైనా సమంజసంగావుంది.

వీరేశలింగంగారిని గూర్చివ్రాసేవారు క్రైస్తవమందుఅయిష్టులై నందున అమెరికన్ లూధరాన్ మిషనరీలు పంతులుగారి కృషికి అందిచిన అనల్పమైన సహాయాన్ని గూర్చి వ్రాయలేదని లియోనార్డు తన గ్రంథంలో వ్రాశాడట. అతడు చూచివున్న సమాచారమే గాక మరికొంత సమాచారాన్ని కూడా కనుగొన్న క్రైస్తవ సంఘంవారు వీరేశలింగం సంస్కరణలో క్రైస్తవ మత భాగస్వామ్యాన్ని వివరించే రచన కూడా త్వరలో వెలువరించనున్నారని వార్తలు అందుతున్నాయి. త్వరలో ఆ వాస్తవాలు చాలా వెలుగు లోకి వస్తాయి. అమెరికన్ క్రైస్తవం, క్రైస్తవ అమెరికన్ సంస్కృతి వీరేశలింగం నిర్మాణంలోకి ఏఏ రూపాల్లో ఏపాళ్ళలో ఎక్కిందో యిక నిప్పుడు చర్చించుదాం.

## పంతులుగారు చేయించిన క్రైస్తవ సంస్కారాలు

కాని పురుషార్ధ ప్రదాయినీ ప్రభావాన్ని ప్రాశస్త్యాన్ని కాదని, క్రైస్తవ పత్రిక పేరెత్తడానికి కారణం పరిశోధకుల దృష్టిపై శాల్యమేనాకాదా అని అను మానం కలిగింది. ఎందుకంటే ఈ పరిశోధకుడు ఆత్మూరి సామినేనుల వైష్ణవాన్ని యీసడించివ్రాసినట్టు గుర్తువచ్చింది.

> "సామినేని ముద్దు నరసింహం నాయుడిలా, ఆత్మూరి లక్ష్మీనరసింహంలా
> బసవరాజు గవర్రాజుగారు శ్రీ వైష్ణవులుగారు. దాని సంప్రదాయం
> ఆయనకక్కరలేదు" అని 29-6-86 విశాలాంధ్ర 4వ పేజీలో వ్రాశారు.

గవర్రాజుగారు వారివైష్ణవాన్ని తీసుకోవాల్సిందని ఎవరూవ్రాయలేదు; వ్రాయరు. ఇది అసందర్భ ప్రసంగం. గవర్రాజుగారు వైష్ణవం తీసుకొన్న ఆత్మూరితో ఆత్మీయంగానే వున్నారుగాని విరోధించలేదు. ఆత్మూరివారు తనలాగా వైష్ణవం పుచ్చుకోమనలేదు ఆయనను. వీరేశలింగంగారే గవర్రాజుగారిచేత క్రైస్తవ సంస్కారం చేయించారు. ఆయన పిల్లవాడుచనిపోతే క్రైస్తవులరీతిలో కొయ్యపెట్టెను (coffin) చేయించి, శిశుకళేబరాన్ని అందులో పెట్టి తోసుకొని వెళ్ళి ఖననక్రియలు చేయించారు ! వీరేశలింగంగారుఆ విధంగా అంత్యక్రియలలో క్రైస్తవ సంస్కారాలను ప్రవేశపెట్టయత్నించారు. ఆయనగారిని ఆ ప్రయోగాలు తనమీదగా జరగ డానికి ఒప్పుకొన్న గవర్రాజుగారిని వైష్ణవాచారం చేయమన్నవారూలేరు

ఇతరులు చేయమంటే ఆయన చేయనూ చేయరు.కాని ఈపరిశోధకుడియీ అసంగతపు వ్రాతలో వైష్ణవద్వేషం, వైష్ణవమందు న్యూనతాభావం వాసనమాత్రం తగులుతున్నది మరి. ఇది దృష్టివైశాల్యంగాదు. చాలా సంకుచిత బుద్ధి. ఇట్టి హ్రస్వదృష్టిహారు వీరేశలింగం పరిశోధకులు, ఎలాగబ్బా! అనుకోగా ఈ పరిశోధకుల సంప్రదాయమైన అద్వైతాన్ని అవలంబించి, అద్వైత ప్రాచుర్యంతో ఒక నాయుడుగారు నడిపించిన పురుషార్థప్రదాయిని అగ్రగామిత్వాన్ని మార్గ దర్శిత్వాన్ని కూడా కాదనటం ఏమిటబ్బా! అని పించింది. ఒకప్పుడు ఈ సామినేని, అత్మూరి, ఉమానాయుడు గారలను ఆనాడు ప్రతిభావంతులైన ఆంధ్రులని తనసిద్ధాంత వ్యాసంలో దండిగాపొగడి, పాదపీఠికలు వివరణలు వ్రాసి కొత్తగా ఇప్పుడు వైఖరిమార్చు కొని వివేకవర్ధని పత్రికలను శివరాగావుగాచుచూడలేదనిడబాయింపు వ్రాతలువ్రాసిన ఈ పరిశోధకులు, ఆ వివేకవర్ధని వాల్యూములనుంచి పంతులుగారు వ్రాసిన క్రైస్తవ మత విమర్శను మతాంతరీకరణల నిరసనను చేదితెచ్చి ఉల్లేఖించలేక పోయారు. రాయసం వెంకటశివుడు గారితో పైపేటుగా పంతులుగారు క్రైస్తవవిమర్శ చేశారేమో! ఇంకా యితర ఆంతరంగికులతో చేశారేమో! అదేనాకావలసింది మనకు ? అగా ఆటపట్టించగలిగిన వారు అదేదీ వ్రాయలేకపోవటం క్రైస్తవుల ముందు ఆయన పిరికితనం అణగి యుండాల్సినస్థితి అవుతుందిగదా!

పంతులుగారు వివేకవర్ధనిని దాదాపు యిరవై యేళ్ళనడిపారు. అది వేలకొలది పుటల సంపుటాలై వుండాలి. అందులో ఎన్నో ఈ పరిశోధకులు చదివారు! వీరేశలింగ సంపూర్ణగ్రంథావళి అంటూ వేలకొలది పేజీలలో వ్యాసోపన్యాసాలు నాటకప్రహసనాలు వగైరా వారి రచనా ప్రపంచమంతా వుంది. చెక్కుచెదరకుండావుంది. తొలుతవ్రాసిన వ్రాతలను సంపుటాలుగా ముద్రించేటప్పటికి తనకుకావలసినట్టు మార్చిచేర్చి ఆధునికీ కరించుకొని మరీ ముద్రించిన గ్రంథావళిఅది. ఆ వీరేశలింగ రచనా ప్రపంచం నుంచి ఒక్క వ్యాసం క్రైస్తవమత విమర్శనంగా వుండేమో చూపలేకపోయారు! ఒక్క సంపాదకీయాన్ని, ఒక్కఎడిటోరియల్ రిమార్కును ఉల్లేఖించలేకపోయారు! పది వారాలు పొడవున విశాలాంధ్ర వారిసంస్కారస్థాయిని బట్టి పిట్టకథలతో అప్రస్తుత ప్రసక్తులతో ఎవరెవరో యిచ్చిన కితాబులతో నింపి ఆకాశపురాణంగా యాభై కాలముల సోది వ్రాశారు. పంతులుగారి క్రైస్తవ విమర్శనా రచన యిదిగో అని యివ్వలేక పోయారు. సమయంమించిపోలేదు. ఈ పరిశోధకులేకాదు; మరికొందరు పరిశోధకులు వున్నారు. వీరేశలింగం వెలుగునీడలపై పోరాడాలన్నారట! వారంతా పంతులుగారిని కీర్తించిన వారే. వారెవరైనాసరే వీరేశలింగంగారి క్రైస్తవ విమర్శా రచన యిదిగోయని, మతాంతరీకరణ నిరసన యిదిగో అనిగాని, ఆయనగారి వివేకవర్ధని కాలంలో వచ్చిన కరువులలో జరిగిన మతాంతరీకరణలనుగూర్చి పంతులుగారి



వ్యాఖ్యలను చూపించగలరేమో తమ అదృష్టాన్ని పరీక్షించుకొని ఫలితాన్ని ప్రచురిస్తే బహుమానం యివ్వొచ్చు.

## రాజశేఖర చరిత్ర - క్రైస్తవ మిషనరీలు

వీరేశలింగంగారు మిషనరీలను మెప్పించి, మంచిచేసుకొని, వారిచేత సాటి స్థానిక, రాష్ట్రీ ఆంగ్లేయాధికారులకు చెప్పించుకొని, వారి అండదండలతో తమ సంఘ సంస్కారం నడుపుకొన్నారు. వారి సంస్కరణకు మిషనరీలు వెన్నుగాచారు. వారి రాజశేఖర చరిత్రను హిందూ మౌఢ్య చిత్రణగా గ్రహించి యింగ్లీషులోకి అనువదించ బూనుకొన్నదెవరోకాదు- మిషనరీలే. వారేమీ ఆంగ్లసాహిత్యంలో రచయితలుగా పేరొందినవారుగాదు. ఈ అనువాదమే వారి సాహితీజీవితానికి ఆరంభము-అంతము- ఒకరుగాదు, యిద్దరు తలపెట్టారు. రివరెండు హచిన్‌సన్ శ్రీకాకుళంలోని అమెరికన్ మిషన్ అధికారి. ఇతడు అనువదించేది తెలియకుండా మరొకమిషనరీ అనువదిస్తున్నాడు : ఆతడు భద్రాచలందగ్గరి దొమ్మగూడెం క్రైస్తవ ప్రచారకుడు - రివరెండు కెయిన్. చచ్చిపోయిన శవాన్ని ఎత్తివేయడానికి సాయపడినప్పుడు ఆ మతములోవుండి ప్రయోజనమేమున్నది అన్నంతదాకా వ్రాశారు గావున దానిని ఆ క్రైస్తవ ప్రచారకులు ఇంగ్లీషులోకి అనువదించారుగాని అందులో ప్రత్యేకంగావున్న సాహిత్యపు విలువను బట్టి అనువదించారనగలమా? అందులోగల సాహిత్యసౌరభమెంతటిది? కల్లలాడటమే హిందూశీలమని చేసే యింగ్లీషు ప్రచారాన్ని పొరపాటని, తప్పని మాక్సుముల్లరు నిరూపించుచున్నకాలంలోనేవారి జాజులందు వైవాహికములందు ప్రాణవిత్త మానభంగ మందు బొంకవచ్చు, పాపంచుట్టుకోదనే పద్యాన్ని హిందూ కల్లాలితనానికి నిరూపణగా ఒకహిందూరచయిత వ్రాస్తున్నాడని చెప్పడానికీ క్రైస్తవ ప్రచారకులు అనువాదించారు. మాక్సుముల్లరు ఈ పద్యమూలమైన శ్లోకాన్ని వాసిష్ఠస్మృతిలో వున్నప్పటికీ అది హిందూశీలంకానేరదని, గ్రీకు రాయబారులు విదేశీ యాత్రికులు, యింగ్లీషు మిలిటరీ అధికారుల కథనాలు హిందూ సత్యసంధతను తెలుపుతున్నాయని వ్రాస్తున్న సమయాన వెలువడిన నవలయిది.

ఇంకా పంతులుగారు స్థానిక ఆంగ్లేయ విద్యాధికారులకు పుస్తకాలు అంకిత మివ్వటమేకాదు (హెడ్మాష్టరుకు, ఇనస్పెక్టరుకు యిచ్చాడు.)- రాష్ట్రీ విద్యాధికారి అయినతర్వాత మక్డోనాల్డు [వేమనపై వ్యాసకర్త] పేరిట రాజమండ్రిలో పురమందిరం కట్టించాలని స్థానికులను మోపు చేయజూశారు. పాపం, జనులు కలిసి తీరుఇది. ఆయన రాలేదు. స్థాని కాంగ్లేయాధికార్లతో ఆయన వ్యవహరించిన స్థాయి అంతే. ఆ విధంగా పుస్తకాలను పాఠ్యగ్రంథాలు చేయించుకొంటూ, మాక్మిలన్ కంపెనీవారికి వాచక పుస్తకాలు వ్రాసిపెట్టుతూ సంస్కరణతోపాటు సంపాదనాప సత్యానృతంగా పర్వాన్ని చక్కగా చూచుకున్నారు.

## పంతులుగారి క్రైస్తవ విధేయత:

అంచేత వీరేశలింగంగారు బ్రిటిష్‌భక్తి పరాయణుడే కాకుండా క్రైస్తవమత విధేయతను కూడా మానుకోలేకపోయినవాడని చెప్పకోక తప్పదు. ఆయన బ్రహ్మ సమాజ నాయకుడనంటాడుగాని బ్రహ్మసమాజ గ్రంథాలను వ్రాసినవాడు కాదు. నిజానికి ఆయన బ్రహ్మసమాజ సిద్ధాంతపులోతులెరిగినవాడు కాదనిపిస్తుంది. ఆయన అందులో గట్టి గ్రంథాలను గత శతాబ్దంలో చదివినట్టుగాలేదు. 1905 తర్వాతే ఆ సిద్ధాంతాన్ని గూర్చి వ్రాయాలంటే ఏమేమిచదవాలో అడిగి తెలుసుకొని తెప్పించు కొన్నాడు. చదివాడు. కాని ఏమీ వ్రాయలేకపోయాడు. పరిశుద్ధ ఆస్తికమతమనే వ్యాసంవిన్నా ఆయన వ్రాయగలిగిందిలేదు.అందుకాయన చాలినవాడు కాదనినానమ్మకం. ఆయనదార్శనికసూక్ష్మతలెరిగి వ్రాసినదాఖలాలులేవు. ఒక్కగానొక్క బ్రాహ్మమతకీర్తన వ్రాయలేదు. ఎందరోయితరులు వ్రాశారు. ఆయనకు బ్రహ్మసమాజాన్ని గూర్చితెలిసిన దాని కన్నా క్రైస్తవమతాన్నిగూర్చి తెలిసిన దెక్కువే మోయనిపిస్తుంది. బ్రహ్మ సమాజవివాహవిధిగాని, ఆ సమాజం చేసే శ్రాద్ధకర్మ విధానంగాని ఆయనకు 1906 దాకా తెలియదు. అప్పుడు బెంగాలీలకు వ్రాసి తెలుసుకొంటున్నాడని స్వీయచరిత్ర తెలుపుతున్నది. పంతులుగారి భార్యచనిపోతే మాసికాలు పెట్టారు. పునర్జన్మ, పితృలోకాలులేని బ్రహ్మసామాజికులు శ్రాద్ధాలు పెట్టడమేమిటోగాని పంతులుగారు మాసికాలే పెట్టారు. పంతులుగారు క్రైస్తవగ్రంథాల చరమదశలోను వ్రాశారు.

ఆయన హిందూదేవుళ్ళను విమర్శిస్తే, హిందూనీతిని, మతాన్ని దుయ్యబట్టితే అది క్రైస్తవ ప్రభావం, క్రైస్తవ పద్ధతి అంటున్నారు: అదే వేమనచేస్తే అద్భుతంగా చేశాడు, గొప్పగా చేశాడు అంటున్నారని వీరేశలింగ పరిశోధక శిరోమణి చాలా బాధపడుతున్నారు—ఇది అన్యాయం కాదా అని అడుగుతున్నారు. హిందూమతాన్ని హిందువులుగా సంస్కరించడం యింకెలాగుసాధ్యం అని అడుగుతున్నారు. అటువంటి వైఖరి ఛాందసులు వేసుకొనే ముసుగవుతుందంటున్నారు! అది వారి అజ్ఞానాన్ని తెలుపుతున్నది. దయానందుల ఆర్యసమాజము నెరుగనివాని మాటలివ్వి.

## వేమన, దయానందులు
## వంగీయు పరిణామం - పంతులుగారు

వేమన విమర్శ, వేమనసంస్కరణ క్రైస్తవ, అర్ధక్రైస్తవ విమర్శ ఎలా కాకపోతుందో, దానిదేశితనమెటువంటిదో, అనగా హిందూసంఘ మత సంస్కరణను హిందూ సంస్కరణగా ఎలాచేయాలో, చేశారో,చేయొచ్చో యిప్పుడే పరిశోధకులడుగు తున్నారంటే వీరిస్థాయి వెల్లడవుతున్నదే కాని వీరేశలింగంనాటికే ఆ వరవడి ఏర్పడి



పోయివుంది: ఆయన వివేకవర్ధని పెట్టేనాటికే, ఆయన సంఘసంస్కారక రచన లారంభించేనాటికే స్పష్టరూపం పొందివుంది.

సి.పి. బ్రౌనువేమనను అద్వైతిగానో, (వీర) శివాద్వైతిగానో దేశితనం కలవానిగా, అద్వైతాన్ని సాంఘికాద్వైతంగా సాంఘికసమానతా సాధకంగా మలచిన వానిగా దేశంముందుంచాడు. 1873 నాటికే దయానందుల ఆర్యసమాజ మత, సంఘ సంస్కరణ సంచలనాత్మకంగా వెలువడివున్నది. అవతారవాదం, బహుదేవతారాధన, విగ్రహారాధన. శ్రాద్ధకర్మలు, పితృలోకాల, స్వర్గనరకాలులేవని, పౌరాణిక మత సంస్కృతులు ఆర్షేయంకాదని, అవి వైదిక సభ్యతకు విరుద్ధమని చాతుర్వర్ణ్యంలోని కులభేదాలు వేదవిరుద్ధమని, సర్వకులజనుల సహపంక్తి సమానోదకపాన, సహాసనా విధులు, అస్పృశ్యతా నిరాకరణ, స్త్రీ విద్య, రజస్వలానంతరవివాహం, విధవా వివాహాలు, వరశుల్క కన్యాశుల్క నిరసన నిషేధాలు వేదోక్తమని చెప్పినట్టి వీర హిందూమతసంస్కరణ. జాతీయ సంఘమత సంస్కరణలతో 1869లోనే కాశీ ఛాందస పండితపరిషత్తులో300మందిని ఏకవ్యక్తిగాచారిత్రాత్మకమైనవివాదంలో నోరుమూయించి నట్టి దయానందులు అందుకుదారివేసేవున్నారు.తులసీదాసు రామాణాయాన్ని భాగవతాన్ని అనేకస్మృతి పురాణాదులను చదవరాదన్న హిందూమతంఆయనది. శ్రీకృష్ణుణ్ని ఆయన ఖండించారు. మాక్సుముల్లరు సాయం మనకక్కరలేదన్నారు. ఆయనను అంతగా గణించలేదు. ఈయన సంస్కరణవీరాన్నిచూచి క్రైస్తవ ప్రాయులైన కేశవచంద్రుని భారత బ్రహ్మసమాజం ఛాందసహిందూతత్వంపై దయానందులతో కలిసి పోరాడుదా మని ప్రతిపాదిస్తే, దాన్ని తిరస్కరించి ఏకైకపక్షంగా హిందూమత విప్లవ మార్గాన్ని వారు పారదెరచారు. దానిమార్గం తనకెందుకు పనికిరాకపోయిందోకూడా వీరేశలింగం వ్రాసుకోవలసినవాడు. ఐనా ఆ వూసెత్తకుండా దాటుకొన్నాడు. క్రైస్తవులైపోయిన ఆయన రచనలలో ఆర్యసమాజం వునికిని విన్నట్టే కనిపించదు. వారిని హిందువులుగా తిరిగి మార్పించే శుద్ధి కార్యక్రమానికి వీరేశలింగంలో శక్తిలేదు సాహసంలేదు.

అంతేకాదు ఆ కేశవ చంద్రసేనువద్ద గప్పుమంటున్న క్రైస్తవవాసనను భరించలేక క్రైస్తవ ప్రభావతిరస్కారకమైన చీలిక సాధారణ బ్రహ్మ సమాజం 1878లో ఏర్పడి బహ్మోలో పరిణామం పూర్తయివుంది. అంతకుముందే అమెరికా రష్యాలనుండి వచ్చిచేరిన బ్లావటాస్కీ, ఆల్కాటుల మనహిందూమతాన్ని సమర్థిస్తూ 1875 నుంచీ పెట్టిన దివ్యజ్ఞానసమాజం తలెత్తింది. బ్లావటస్కీ హిందూ ఛాందసంపై ఐక్యపోరాటం ప్రతిపాదించి దయానందులను ఆదిలో వొప్పించారు. ఆచరణలో దివ్యజ్ఞానుల సర్కస్‌చూచి దయానందులువారి తొడిపొత్తు రెండేళ్ళకే తెంపేసు కొన్నారు. ఏమైనా దివ్యజ్ఞానులు స్త్రీ సంస్కరణతో ముందుకు వచ్చినవాళ్ళు (భారతీయ పురాప్రతిభను అపహాస్య భాజనముగా కీర్తించిన వాళ్ళు.)

ఆంధ్రదేశంలో సామినేని ముద్దునరసింహనాయుడు హితసూచని ద్వారాను, ఉమారంగనాయకులవారి వర్గం పురుషార్థ ప్రదాయిని ద్వారాను విశిష్టాద్వైత, అద్వైత మతాలను సంఘ సంస్కారకాలుగా మలచి చాలా సాత్వికంగా సుబోధంగా చెప్పి చూపించివున్నారు. గతం మీద భీషణగర్జనలులేని సంస్కరణ వారిది.

పంతులుగారికి యీ సంస్కరణ మార్గాలు పనికిరాలేదు. రామకృష్ణ, వివేకానందుల విషయమై తన మతభేదం చెప్పుకోలేదు. కేశవచంద్ర సేనులు రామకృష్ణ ప్రభావానికి లోనుకావడం ఆయనకు తెలియదు. కేశవచంద్రులు భగవంతుణ్ణి క్రైస్తవమైన పితృభావంతోనేగాక, శక్తిగా, కాళిగా, మాతృరూపంగా కూడా మాట్లాడివున్నారు,పాడివున్నారు. పంతులుగారుభగవంతుణ్ణి పితృరూపంలోతప్ప మాతృరూపంలో చూడలేదు. అందుచేత కేశవచంద్రులకన్న పంతులుగారే క్రైస్తవుల భగవద్భావనకు బాగా లోనైనవాడనవచ్చు. సాధారణ బ్రహ్మసమాజం వారు బెంగాలులో క్రైస్తవులతో సంబంధంలేనివాళ్ళమని చెప్పి చూపుకొన్న ధోరణి వీరేశలింగంగారిలో కనపడదు సరిగదా, క్రైస్తవుల ఆశ్రయం కొరకు అండకొరకు ఆయన కడవరకూ ప్రాకులాడివున్నారు. యిందాకే ఆ విషయం చూశాం. మద్రాసు విడచివచ్చిన తర్వాత అనుష్ఠాన బ్రాహ్మలైన తర్వాతే మరింతగా క్రైస్తవ రచనలు చేశారు.

మూడేళ్ళు ఆయాసపడిపడి కడకెట్లో మెట్రిక్ మెట్టెక్కి కూర్చోబడిన పంతులుగారు ఆంగ్ల నాగరికతను ఆంగ్ల సమాజాభ్యుదయ మూలసూత్రాలను కీలకాలను కరతలామలకం చేసుకొన్న మహావేత్తగా ముద్రపట్టి ఆంగ్ల విద్యావిశారదులైన వారందరూ ఎందుకోగాని బ్రిటిష్ నాగరికతా విముఖులై బ్రిటిష్ భక్తిలేనివారై తప్పుదారిపట్టి యింటగెలిచి రచ్చ గెలవవలెననేమాట మరచి సంఘ సంస్కరణను పూర్తిచేసుకొన్న తర్వాతనే రాజకీయ హక్కులు అడగవలెనని మరచిఉద్రేకిస్తున్నారని సంఘసంస్కారంలేని రాజకీయంవలన ఉపయోగములేదని, 1884లోనే అనగా కాంగ్రెసు పుట్టకముందే కాకిగోల మొదలుపెట్టి-అందుకు పారితోషికంగా 1885లో రావు సాహెబ్ బిరుదుపొంది - బ్రిటిష్ ప్రభుత్వము వలని లాభములు ప్రచారంచేసి, కరువులను సృష్టించిన పాలనను కరువులే కరువైన రాజ్యమని పాటలుపాడి, రాజకీయార్థిక ఆందోళన సరిగా ప్రారంభం కాకముందే సంస్కరణను ఉపేక్షించుతున్నారనే బూచిని చూపించి, రాజకీయాందోళన వలన చౌకగా కీర్తిలభిస్తున్నదని సంస్కరణే ఎంతో కష్టనష్టములతో కూడిన అసిధారావ్రతమని తెగవ్రాసి రాజకీయాందోళకుల ప్రశస్తికి అసూయపడి చులకన వ్రాతలు వ్రాసి, మూఢాచార విశ్వాసాలపై పోరాడటంలో బ్రాహ్మణ బ్రాహ్మణేతర కోణాన్ని ప్రవేశపెట్టి బ్రిటిష్‌వారి విభజించి పాలించు సూత్రానికి కావలసిన నడకనడచి 1895 నరికి రావుబహుదూరు బిరుదు అందుకొని, ఆ కృతజ్ఞతలో తేలియాడుతూ వందేమాతరం ఉద్యమం ఎంతగా ఎటువంటి మహత్తర త్యాగసుంకాన్ని జీవికాబలిదానాన్ని కోరు



తున్నదో కళ్ళారా చూచికూడా ఆ పాత పాచిపళ్ళదాసరి పాటనే పాడుతూ వుండిపోవడమంతా జాతీయ భావశూన్యుడై బ్రిటిష్ భక్తిమతం పట్టి నడచిన రాజకీయపు నడకగాక మరొకటికాదు.

క్రైస్తవ పత్రికలోనే రచనా వ్యాసంగం మొదలుచేసి క్రైస్తవులకు తెలుగు చెప్పి వారినుంచి క్రైస్తవం తెలుసుకొని దానికి దగ్గరగావుండే అర్ధ క్రైస్తవ మనిపించుకొనే బ్రహ్మసమాజ మతంపట్టి, ఆంగ్లేయాధికారులకన్నా, అసలు మిషనరీలకే సన్నిహితులైపోయి క్రైస్తవ చర్చి యొక్క, ఆంగ్లాధికారుల యొక్క ప్రాపకంపొంది తానను కొన్న సంస్కరణలకోసం భారత సమాజంపై పోరాడుటకు సులభమైన మార్గంగా ఎన్నుకొని తీర్థానికి,స్వార్థానికి పనికివచ్చే అడ్డుదారికనుగొని సంస్కరణకు దిగారు. దేశీయ భావధార ఆధారం చేసుకొని దేశీశక్తులను కూర్చుకొనే కష్టతరమైన దారి నెన్నుకోలేదు. అందుకాయన చాలినవాడుకాదు. ఆయన మన సంస్కృతిలోతులను అర్థం చేసుకొన్న వాడు కాదు. ఆ లోతులను అర్థంచేసుకొంటూ అందులోవున్న అవకాశాలను మత సాంఘిక సంస్కరణలకు సాధకంగా మలచుకొంటూ రూపుదిద్దుకున్న దేశీవిచారధార ఆయన తలకు మించినదని, ఆయన ఆచరణ శక్తికి మీరినదని నిస్సంశయంగా చెప్పవచ్చును. నిజానికి ఆయన భావజీవితంలో ఆ కాలానికి, అనగా 1885 నాటికే, అయన బాగా వెనకబడినవాడేగాని నవ్యుడుకాదు.

18వ శతాబ్దాంతంలో విలియం జోన్సుతో మొదలై మాక్సుముల్లరు దాకా గల ఫ్రెంచి, జర్మన్, ఇంగ్లీషు, అమెరికన్ విద్వాంసులు భారతీయుల చరిత్రలో సంస్కృతిలో చేసిన పరిశోధనలతోను, వారి మదింపులతోను, ఆర్యసమాజ భావ జాతంతోను, దాని కార్యశూరత్వంతోను, రామకృష్ణ పరమహంస ప్రభావ ప్రసరణతోను వీరేశలింగంగారికి పరిచయంలేదు. చీలికలకు గురియై, రామకృష్ణునికి కోల్పోతూ వంగభూమిలోనే వెనకమొగం పట్టిన బ్రహ్మసమాజపు నగటు భావాలను అందిపట్టుకొని వ్రేలుకాడుతూ ఆంగ్ల విద్యావిశారదుల కొత్తతరం పొందుతున్న నూతన స్ఫూర్తికి దూరమై దిగువవాడై తానుసజీవుడై యుండగానే కాలదోషానికి గురైనవాడు. ఆంగ్లేయులైన క్రైస్తవ ప్రచారకుల, ప్రభుత్వాధికారుల అండదండలతో పెంచుకొన్న సంస్కరణ వీరంతో పాతతరహా పండితుల, పాతతరహా పూర్వాచారుల పాలిటికి మాత్రం అధికుడుగా నవ్యుడుగా చెల్లి వారిని చెండాడుతూ, అనతికాలంలోనే ఆంగ్ల విద్యాధికుల నూతన తరం ముందుమాత్రం పాతబడిన పలాయితీ విశేషంగా భారతీయ సంస్కృతి యొక్క లోతుపాతుల ఆకళింతలేని ఉపరిచర సంస్కర్తగా చూడబడి తీవ్రఖండనకు గురియై ముగిసినవారు వీరేశలింగంగారు.

ఈ సుదీర్ఘమైన వివేచనకు ముగింపు వాక్యమును కృష్ణాపత్రిక నుండి యివ్వటం ఉచితంగా వుంటుంది. ఆ వాక్యాలు పురాణం సూరిశాస్త్రిగారివి. అవి 15 మార్చి

1923 కృష్ణాపత్రికలోని కృష్ణరాయడు - కృష్ణాపత్రిక అన్న అద్భుతమైన వ్యాసం నుండి స్వీకరించినది:

> "వీరేశలింగంగారి గద్యవిధాన మాంధ్రులకు ఉపకరించినను, వీరి సాంఘిక విమర్శనములోతులేక, సంప్రదాయాభిజ్ఞతలేక, వంగాంగ్ల విదేశాదర్శపూరితమై, వైదికద్వేషకలుషితమై, రాగాహంకార మాలిన్యదూషితమై, జాతీయోద్బోధ దీధితుల జూడజాలక, పొగకమ్మిపోయినది."

ఆ శాస్త్రిగారే ముట్నూరులో కలిగిన పరిణామమును చెప్పినమాటల నిచ్చినచో, పంతులు గారిలో కలుగని పరిణామం, వారెక్కడ ఆగిపోయినది మరింత విశదమవుతుంది:

> "కృష్ణరావుగారాంగ్ల పండితులు, వంగభక్తులు. చిన్నతనం నాడు భావస్థిరములై యున్న తత్వములు అర్థక్రైస్తవులగు బ్రహ్మసమాజమునకు చెందినవి. ఆంగ్ల నాగరిక సంస్కారోపాసనము వలన జాతిభ్రష్టులై, నల్లదొరలై, యుభయ సంప్రదాయ దూరులై, క్రమ్మర నైజ జాతీయతనొంద యత్నించు వంగదేశీయులు వీరి యాదర్శ పురుషులు. ఆనందకుమారస్వామి సిఫారసుచే వీరు హైందవ కళల నామోదించిరి."

ఆవంగీయబ్రహ్మోల పరిణామము, యీకృష్ణరాయాదిబ్రహ్మోల పరిణామము పంతులు గారిలో కలగలేదు.

హిందూ సంస్కర్తనుకానని బ్రహ్మోనని ప్రకటించటంవల్లను, బ్రిటిష్ భక్తి వెల్లివిరిసి జాతీయోద్యమానికి వ్యతిరేకిగా నిల్చినందువల్లను, క్రైస్తవ రచనలకు పూనుకొని మతరీత్యా సాంఘికరీత్యా, రాజకీయరీత్యాను జాతీయమార్గాలకు దూరమైన ఆంధ్ర సంస్కర్త, విధవా వివాహవీరుడు, ఆస్తిక హేతువాది, గత శతాబ్ది గద్యవాఙ్మయ యుగనాయకుడు రావుబహదూర్ వీరేశలింగంగారు.

